మార్చి 2009 వెల : రూ.14/-


అమరజీవి
ఎవిఎస్‌కు జోహార్లు

THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY




# ఐక్య ఉపాధ్యాయ

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక

యుటియఫ్ 11వ రాష్ట్ర
మహాసభల ప్రత్యేక సంచిక

2004 తర్వాత
ప్రభుత్వ పెన్షన్ రద్దు, SGT పోస్టులు రద్దు,
ఎయిడెడ్ నియామకాలు రద్దు, TPF రద్దు,
అన్ ఎయిడెడ్ ఇంక్రిమెంట్లు రద్దు
నోషనల్ ఇంక్రిమెంట్లు, DSC పెండింగ్

నా తప్పులు తెలుసుకున్నాను, మీరు అడిగినవన్నీ చేస్తాను మాకే ఓటేయండి!

అప్పుడు చెప్పినవన్నీ చేయాలంటే మళ్ళీ మమ్మల్నే గెలిపించండి!

లెఫ్ట్

టిడిపి

కాంగ్రెస్

ఎవరధికారంలో ఉన్నా ప్రజా సమస్యలపై పోరాడే వారినే గెలిపించండి!

ఓటు

ఓటు

ఉపాధ్యాయులు

బ్యాలెట్ బాక్సు

# హక్కుల రక్షణకే ఓటు హక్కు

CI

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్, 11వ రాష్ట్ర మహాసభలు

20.21.22 ఫిబ్రవరి 2009 అప్పారి వెంకటస్వామి నగర్ నల్లగొండ


ప్రారంభసభకు అధ్యక్షత వహించిన
ఐ.వెంకటేశ్వరరావు


ప్రారంభోపన్యాసం చేస్తున్న విద్యావేత్త
చుక్కా రామయ్య


స్వాగం పలుకుతున్న రాష్ట్ర కార్యదర్శి
ఎ.నర్సిరెడ్డి


విద్యాసదస్సుకు అధ్యక్షత వహించిన
పిడియఫ్ ఫ్లోర్ లీడర్ డి.రామిరెడ్డి


విద్యా సదస్సు వేదిక


విద్యారంగంపై తీర్మానం ప్రవేశపెడుతున్న
ఎస్.నారాయణ


విద్యాసదస్సులో పాల్గొన్న కాంగ్రెస్ అధికార ప్రతినిధి
ఎన్.తులసిరెడ్డి


టిడిపి నాయకులు మండవ వెంకటేశ్వరరావు


సిపిఎం రాష్ట్ర కార్యదర్శి బి.వి.రాఘవులు


సిపిఐ నాయకులు ఆదిరెడ్డి


ఎంఎల్‌సి కె.నాగేశ్వర్ సందేశం

# ఐక్య ఉపాధ్యాయ

విద్యా విషయక మాసపత్రిక

మార్చి, 2009

సంపుటి : 35 సంచిక : 03




**ఈ సంచికలో**




సంవత్సర చందా : రూ. 70-00

విడిప్రతి : రూ. 14-00



**ఐక్య ఉపాధ్యాయ**

గగన్ మహల్ రోడ్ నెం. 7,

దోమల్‌గూడ, హైదరాబాద్-29.

Ph.No. : 040-27636840

Fax. No. : 040-27650366

MobileNo. : 9490300573

Website : www.aputf.org.

E-mail : ikyopadhyaya@yahoo.co.in

ikyopadhyaya@gmail.com


# ఓటు హక్కును సద్వినియోగం చేసుకోవాలి

మన రాష్ట్రంలో ఏప్రిల్‌లో రెండు విడతలుగా సార్వత్రిక ఎన్నికలు జరుగుతున్నాయి. లోక్‌సభకి, అసెంబ్లీకి ఒకేసారి ఎన్నికలు జరుగుతున్నందున వీటికి ఎంతో ప్రాధాన్యత సంతరించుకొన్నది. నూతన ఆర్థిక విధానాలు వచ్చిన తర్వాత కేంద్రంలో, రాష్ట్రంలో ప్రభుత్వాలు మారుతూ వచ్చాయి. కానీ ప్రజావ్యతిరేక విధానాలు, ప్రభుత్వరంగ వ్యతిరేక చర్యలు మాత్రం యధాతథంగా కొనసాగుతున్నాయి. దీని వలన ప్రభుత్వ విద్యారంగం, ఉద్యోగుల సంక్షేమం సతమతం అవుతూనే వున్నది. ఈ పరిస్థితుల్లో ఉద్యోగులు, ఉపాధ్యాయులు తమ ఓటు హక్కును సద్వినియోగం చేసుకోవాల్సిన అవసరం మరింత అమూల్యమైందిగా గమనించాలి.

విద్యాహక్కు విషయంలో గత ఎన్‌డిఏ లాగే నేటి యుపిఏ ప్రభుత్వమూ ఫెయిలైంది. ఫలితంగా విద్యని ప్రాథమిక హక్కుల్లో (21/ఎ) చేర్చుతూ 2002 సెప్టెంబర్‌లో రాజ్యాంగానికి 86వ సవరణ చేసి 7 సంవత్సరాలు గడుస్తున్నా అది ఆచరణకు నోచుకోలేదు. కానీ నిర్బంధోచిత ప్రాథమిక విద్యకోసమంటూ రెండు శాతం చొప్పున విద్యాసెస్ మాత్రం వసూలు చేస్తూనే వున్నారు. మరో వైపు 11వ పంచవర్ష ప్రణాళికలో విద్యకి పెంచిన నిధులను 'పబ్లిక్ ప్రైవేట్ పార్టనర్‌షిప్' పేరుతో ప్రైవేట్ సంస్థలు వినియోగించుకొనే అవకాశం కల్పించారు. ప్రైమరీ నుండి యూనివర్సిటీ దాకా కార్పోరేట్ విద్యా వ్యాపారానికి విస్కృంఖలమైన అవకాశాలు కల్పించారు. దానితో ప్రభుత్వ విద్య పతనమయ్యే పరిస్థితి దాపురించింది. విద్యా వినాశకర చర్యలు ఆంధ్రప్రదేశ్‌లో మరింత పెచ్చరిల్లాయి. ప్రభుత్వ రంగంలో 5 వేల పాఠశాలలు మూతబడ్డాయి. ఎయిడెడ్ విద్యాలయాల్లో ఖాళీలు భర్తీ చేయకుండా నిషేధం విధించారు. గిరిజన పాఠశాలలు, మున్సిపల్ పాఠశాలలకు గత ఐదేండ్లలో ఒక్క పోస్టు కూడ మంజూరు చెయ్యలేదు. అప్‌గ్రేడేషన్ పేరుతో 22 వేల ఎస్‌జిటి, గ్రేడ్-2 పండిట్స్, పిఇటి పోస్టులు రద్దు చేశారు. క్రాఫ్ట్, డ్రాయింగ్, సూయింగ్ వంటి స్పెషలిస్ట్ టీచర్ పోస్టుల్ని పూర్తిగా రద్దు చేశారు. మంత్రులు, ఐఏఎస్ అధికారుల అధికారాలకు అనుకూలంగా పాఠశాల విద్యని రెండు ముక్కలు చేశారు. పాఠశాల విద్యలో అవినీతి కుంభకోణాలు, అక్రమాలు పెరిగిపోయాయి. పాఠశాల విద్య పరిపాలనా వ్యవస్థ కునారిల్లిపోయింది. విద్యా కమిటీలను రద్దు చేసి ప్రజల భాగస్వామ్యాన్ని పరిహాసంగా మార్చారు.

ఉద్యోగుల హక్కుల్ని హరించే విషయంలో యుపిఏ ప్రభుత్వం ఆటలు సాగలేదు. పెన్షన్ ఫండ్ నిధుల్ని, ప్రావిడెంట్ ఫండ్ నిధుల్ని షేర్ మార్కెట్‌కి తరలించే చర్యలు, పిఎఫ్‌పై వడ్డీని మరింత తగ్గించే ఎత్తుగడలు అమల్లోకి రాకుండా ఆగిపోయాయి. అక్కడ వామపక్షాల బలం మీద ఆధారపడిన ప్రభుత్వం గనుక ఉద్యోగ వర్గాన్ని దెబ్బతీసే చర్యలకు కేంద్ర ప్రభుత్వం వెనకాడింది. ఉద్యోగులు, ఉపాధ్యాయులకు కొంత ఊరట కలిగింది. ఇక్కడ అలాంటి పరిస్థితి లేనందున రాష్ట్ర ప్రభుత్వం ఇష్టారాజ్యంగా వ్యవహరించింది. 2004 సెప్టెంబర్ నుండి అపాయింట్ అయిన ఉద్యోగులకు ప్రభుత్వ పెన్షన్ లేకుండా కంట్రిబ్యూటరీ పెన్షన్ పథకాన్ని ప్రవేశ పెట్టారు. 70 వేలమంది ఉపాధ్యాయులకు ప్రభుత్వ పెన్షన్ పొందే అవకాశం లేకుండా పోయింది. ఎయిడెడ్ టీచర్లకు ప్రావిడెంట్ ఫండ్ పథకాన్ని కూడ రద్దు చేశారు. 8వ పిఆర్‌సీతో ఉద్యోగులు, ఉపాధ్యాయుల ఆర్థిక ప్రయోజనాలు దెబ్బతిన్నాయి. ముఖ్యంగా కేటగిరీ 3 టీచర్లకు పెద్ద ఎత్తున నష్టం జరిగింది. ఉపాధ్యాయ నియామకాల్లో అప్రెంటిస్ విధానం అలాగే కొనసాగుతోంది. అప్రెంటీస్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్ల విషయం త్రిశంకు స్వర్గంలో వుంది. ఎస్‌సి, ఎస్‌టి ఉపాధ్యాయుల అన్‌ట్రైన్డ్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు యిచ్చే రాయితీ రద్దయిపోయింది. ఎయిడెడ్ టీచర్ల అన్‌ఎయిడెడ్ సర్వీస్, అప్‌గ్రేడెడ్ పండితుల గ్రేడ్-1 స్కేల్ ప్రయోజనం ఎగిరిపోయింది. మొత్తం మీద ఈ ఐదేండ్ల కాలంలో ఉద్యోగులు, ఉపాధ్యాయులకు మేలు కంటే కీడే ఎక్కువగా జరిగింది. గతంలో పోరాడి సాధించుకొన్న హక్కులు, ప్రయోజనాలు హరించుకుపోయాయి. 22 సంవత్సరాల తర్వాత ఉపాధ్యాయులు 13 రోజుల సమ్మె చెయ్యాల్సిన పరిస్థితి ఉత్పన్నమైంది. మరోవైపు ఉద్యమాల్ని అణిచి వేసే ప్రభుత్వ అప్రజాస్వామిక చర్యలు ఈ కాలంలో అదనంగా ముందుకొచ్చాయి.

ఇలాంటి ప్రత్యేక పరిస్థితుల్లో వచ్చిన ఈ ఎన్నికలను ఉద్యోగులు, ఉపాధ్యాయులు తమ సమస్యల పరిష్కారానికి అనువుగా వినియోగించుకోవాలి. ఉద్యోగుల హక్కులను హరించే ప్రభుత్వాలు రాకుండా చూడాలి. ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికుల ఉద్యమాలకు అండగా నిలిచే శక్తులను బలపరచాలి. ప్రభుత్వాల నిరంకుశ చర్యలను అడుగడుగునా నిలువరించే ప్రజా ఉద్యమకారులను గెలిపించుకోవాలి. అందుకోసం ఉద్యోగులు, ఉపాధ్యాయులు తమ కుటుంబ సభ్యులతోసహా ఓటు హక్కును సద్వినియోగం చేసుకోవాలి. ♦

## చైనా చంద్ర మిషన్ తొలి అంకం విజయవంతం

2012లోగా చంద్రుని ఉపరితలంపై తిరుగుతూ పరిశోధనలు నిర్వహించే అంతరిక్ష నౌకను పంపాలనే లక్ష్యంతో చేపట్టిన చంద్ర మిషన్‌లో తొలి దశను చైనా విజయవంతంగా ముగించింది. చైనా తొలి ఉపగ్రహం చాంఘే-1 చంద్రునిపై విజయంతంగా దిగింది. స్టేట్ అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ సైన్స్, టెక్నాలజీ అండ్ ఇండస్ట్రీస్ సంస్థ అధికారులు ఈ విషయాన్ని ధృవీకరించారు. చంద్రుని ఉపరితలంపై తిరుగుతూ పరిశోధనలు నిర్వహించేందుకు 2012లోగా రోవర్ నౌకను పంపాలన్న లక్ష్యంతో చేపట్టిన మూన్ మిషన్‌లో ఇది మొదటి దశ మూడు దశల్లో ఈ లక్ష్యాన్ని చేరాలని చైనా నిర్ణయించుకున్నది. చైనీయుల ఇతి హాసాల్లో 'చాంఘే' అన్నది చంద్ర దేవతకున్న పేరు కావడం విశేషం.

## ఆఫ్ఘన్‌లో మొగ్గ తొడుగుతున్న మహిళా హక్కులు

2001లో ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్ ప్రభుత్వాన్ని తొలగించిన అనంతరం అక్కడ మహిళా హక్కులు మొగ్గ తొడగడం ప్రారంభించాయి. కొత్త రాజ్యాంగం, కొత్తగా ఏర్పాటు చేసిన మహిళా వ్యవహారాల శాఖ మహిళల హక్కుల కోసం పోరాడే సంస్థలకు నిధులు సమకూరుస్తున్నాయి. ఈ నిధులతో నిరాశ్రయులైన మహిళల కోసం శిబిరాలు నడుపుతున్నారు. ఇలాంటి శిబిరాలు నడుపుతున్న నాలుగు స్వచ్ఛంద సంస్థల్లో ఉమన్ ఫర్ ఆఫ్ఘన్ ఉమన్ అనేది ఒకటి. " ఈ సమాజం పితృ స్వామ్య సమాజం. స్త్రీలు కూడా వారి ఆస్తి. ఇది ఇక్కడి సంప్రదాయం. ఇక్కడ స్త్రీలకు న్యాయం జరగడం లేదనీ వాపోతున్నారు. ఈ సంస్థ డైరెక్టర్‌మనేఝూందేరీ. స్త్రీలకు సహాయపడడం కోసం శిబిరాలు నిర్వహిస్తుంటే విదేశీ చొరబాట్లు అని విమర్శిస్తున్నారన్నారు. మహిళల వివాహ వయస్సు 16, పురుషుల వివాహ వయస్సు 18, బలవంతపు వివాహాలు, మహిళలపై హింస కొనసాగుతున్నాయి. అయితే 2005 తరువాత పై శిబిరాల ప్రాధాన్యత పెరిగింది. బాధితులైన స్త్రీలు అత్తింటిలోనో, పుట్టింట్లోనో బాధలకు గురి కాకుండా స్వతంత్ర వ్యక్తిగా ఎదిగే అవకాశం కల్పిస్తున్న శిబిరాల వైపు తమ నడకను ప్రారంభించారు. ఆఫ్ఘన్ సాంప్రదాయ వాదులు పేర్కొంటున్నట్లు కుటుంబ విచ్ఛిన్నానికి కాక తమ జోక్యం ద్వారా, మధ్య వర్తిత్వం ద్వారా, కౌన్సిలింగ్ ద్వారా కుటుంబాలను ఒక్కటి చేస్తున్నామని మహిళా నేతలు అంటున్నారు. జాతీయ పోలీసు విభాగం కూడా కుటుంబ సమస్యలపై ప్రత్యేక శ్రద్ధ పెట్టేందుకు ఒక విభాగాన్ని ఏర్పాటు చేసింది. ఇదంతా ఎన్నో ఆటంకాలను ఎదుర్కొంటూ మహిళా పునరావాస శిబిరాలు నడిపిన స్వచ్ఛంద సంస్థలు, మహిళా సంఘాల ఘనతేనని ఆఫ్ఘన్ మహిళలు మనసారా మెచ్చుకుంటున్నారు.

## ఆహార అభద్రత

కేంద్ర ఆర్థిక సర్వే (2007-08) గణాంకాల ప్రకారం 1950-2007 మధ్య కాలంలో ఆహారధాన్యాల ఉత్పత్తి వార్షికంగా 2.5% పెరిగింది. సరళీకరణ విధానాలు అమలు పరిచిన కాలంలో 1990-07 ఇది 1.2%నికి పడిపోయింది. ఇదే కాలంలో జనాభా పెరుగుదల 1.9%. అంటే ఈ తరుగుదల దేశ స్థాయిలో పొంచి ఉన్న ఆహార అభద్రతను తెలుపుతున్నది. 1990-91లో 171 కిలోలుగా ఉన్న తలసరి ఆహార ధాన్యాల వినియోగం 2005-06 నాటికి 150 కిలోలకు పడిపోయింది. దాదాపు 13% వినియోగం తగ్గింది. ఈ కాలంలో పప్పుధాన్యాల వినియోగం కూడా 15.3 కిలోల నుండి 12.0 కిలోలకు పడిపోయింది. 1993-05 మధ్య కాలంలో తలసరి ఆహార ధాన్యాల్లో అందిన కేలరీలు 2,153 నుండి 2,047కి తగ్గింది. పట్టణ ప్రాంతాల్లోనూ 2,071 నుండి 2,020కి తగ్గింది. తమ అవసరం కన్నా తక్కువ కేలరీలు తీసుకున్న గ్రామీణ జనాభా 87% అని జాతీయ సర్వే తేల్చింది. అవసరం కన్నా 10% తక్కువ కేలరీలు తీసుకున్న పట్టణ జనాభా 2005లో 53 శాతం. ఇది 1993లో 48 శాతం.

## ఆర్థిక సంక్షోభంపై ఫ్రెంచి కార్మికుల పోరు

ప్రపంచ ఆర్థిక సంక్షోభాన్ని ప్రతిఘటించేందుకు ప్రయత్నించడం ద్వారా ఫ్రెంచి కార్మికులు తమ నిరసనల అత్యున్నత సంప్రదాయాన్ని చాటుకుంటున్నారు. పొరుగున ఉన్న బ్రిటన్, స్పెయిన్‌లతో పోలిస్తే సంక్షోభం ప్రభావం స్వల్పంగానే ఉన్నా విదేశీ కంపెనీల్లో పని చేస్తున్న ఫ్రెంచి కార్మికులు పెద్ద ఎత్తున ఉద్యోగాలు కోల్పోతున్నారు. లాభాల్లో నడుస్తున్న కంపెనీలు కూడా లే ఆఫ్‌లు ప్రకటిస్తుంటే కార్మికులు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. ఫ్రెంచి ఆల్ఫ్స్‌లోని రెండు క్యాటర్ పిల్లర్ ఫ్యాక్టరీలు వేలమంది కార్మికులను తొలగించడాన్ని నిరసిస్తూ మూసివేసిన ఫ్యాక్టరీలను తెరిపించేందుకు తమ అమెరికా బాస్‌లతో మాట్లాడాల్సిందిగా ఆర్థిక శాఖను కోరేందుకు ఆ కార్మికులు పారిస్ చేరుకున్నారు. వివిధ పద్ధతుల్లో ఆందోళనలు చేపడుతున్నారు. విదేశీ పెట్టుబడిదారులకు కొంత నిరుత్సాహపరిచే ప్రమాదం ఉన్నప్పటికి కార్మికులను సమర్థించే ధోరణి పెరుగుతున్నదని ఫ్రెంచి మార్కెటు కంపెనీ క్సెర్ఫీలో ఆర్థిక వేత్త అలెగ్జాండర్‌లా చెప్పారు.

## ప్రపంచానికి జలవిపత్తు

ఈ ప్రపంచం జలవిపత్తులో మునిగి పోతుందనే వాదనలు నానాటికి బలం పుంజుకుంటున్నాయి. ఆర్కిటిక్ ప్రాంతంలోని సముద్ర ప్రాంతం చాలా త్వరితంగా వేడెక్కుతున్నది. ముందుగా అంచనా వేసినట్లుగా కాక చాలా దశాబ్దాల ముందుగానే అంటే 2013కు ముందుగానే ఆ ప్రాంతంలోని మంచు అదృశ్యమవుతుందని ధృవ ప్రాంత నిపుణులు అంటున్నారు. ఆర్కిటిక్‌లో మిగతా ప్రపంచంకంటే రెండు రెట్లు వేగంగా వేడి పెరుగుతుందని క్విబెక్‌లోని లావెన్ విశ్వ విద్యాలయంలోని అధ్యయన కేంద్రం డైరెక్టర్ వార్‌విక్ విన్సెంట్ తెలిపారు. అక్కడి మంచుపొర అదృశ్యమైతే అనేక తీవ్ర పరిణామాలు ఏర్పడతాయని, అపార నష్టం సంభవిస్తుందని శాస్త్రవేత్తల అంచనా.

## ఐఎంఎఫ్‌కు రుణమివ్వడంలో జాగ్రత్త సుమా

అంతర్జాతీయ ద్రవ్య నిధి(ఐఎంఎఫ్)కు రుణమిచ్చే విషయంలో చైనా జాగ్రత్తగా వ్యవహరించాలని ఒక ప్రముఖ ఆర్థికవేత్త సూచించారు. ఐఎంఎఫ్‌కు ఎక్కువ మొత్తంలో రుణమిచ్చినట్లయితే ఆ మొత్తాన్ని చైనా కన్నా ధనిక దేశాలకు బెయిలవుట్ ప్రకటిస్తుందని, చైనాకు వ్యతిరేకంగా పక్షపాతంతో వ్యవహరిస్తుందని అన్నారు. లండన్‌లో జరగబోయే జి-20 శిఖరాగ్ర సదస్సుకు హాజరుకానున్న చైనా అధ్యక్షులు హూ జింటావో ఐఎంఎఫ్‌కు భారీ మొత్తంలో రుణమిచ్చేందుకు అంగీకరించినట్లయితే ప్రపంచంలో చైనా ప్రాముఖ్యత పెరుగుతుందని సెంట్రల్ బ్యాంక్ మాజీ సలహాదారు యుయోంగ్‌డింగ్ చైనా దినపత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో పేర్కొన్నారు. అయితే అంత భారీ మొత్తంలో కాకుండా మితంగా రుణమివ్వాలన్నదే తన అభిప్రాయమన్నారు. ఒక వేళ అలా జరిగినట్లయితే పేదవాడు ధనికుడిని రక్షించినట్లవుతుందని, అలా జరక్కూడదని అన్నారు. చైనా ప్రజలు కూడా అలా కోరుకోరని చెప్పారు. తలసరి స్థూల జాతీయోత్పత్తిని బట్టి చూస్తే ఐక్యరాజ్య సమితిలోని 192 దేశాల్లో చైనా వందో స్థానంలో నిలిచింది. అయితే బెయిలవుట్ ద్వారా ఆదుకోవాలని ఐఎంఎఫ్ చూస్తున్న దేశాల్లో చాలా వరకు ఉన్నత జీవన ప్రమాణాలు కలవేనన్నారు. పైగా బెయిలవుట్ కోసం చూస్తున్న దేశాల జాబితాలో చైనా పట్ల వ్యతిరేక వైఖరులున్న కొన్ని ఐరోపా దేశాలున్నాయని తెలిపారు. కొన్ని సందర్భాల్లో ఆ దేశాలు చైనాకు వ్యతిరేకంగా పోరాడాయని కూడా చెప్పారు. కాబట్టి వాటికి సహాయన్నందించాల్సిన అవసరం లేదన్నారు. యూ చేసిన వ్యాఖ్యలు అధికారిక ఆలోచనలను ప్రతిబింబింపలేకపోవచ్చు. కానీ ప్రపంచ ఆర్థిక సంక్షోభం మరింత పెరిగినట్లయితే ప్రస్తుతం ఇచ్చే రుణాలను ప్రస్తుతం ఉన్న రెండు లక్షల 50 వేల కోట్ల డాలర్లను రెట్టింపు చేయాలని ఐఎంఎఫ్ చూస్తున్న నేపథ్యంలో దాని ఆర్థిక వనరులను బలోపేతం చేసే విషయంలో చైనా ఏ విధంగా స్పందించాలన్న విషయంపై యూ వ్యాఖ్యలు వాడీవేడీ చర్చకు తెరతీశాయి.

## సంక్షోభ నివారణకు ఛావెజ్ చర్యలు

వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్ దేశంలో ఆహార సంక్షోభ నివారణకు పలు చర్యలు చేపట్టారు. ముఖ్యంగా ఆహార పరిశ్రమను ప్రభుత్వ ఆధీనంలోకి తీసుకోవటంతో పాటు వాణిజ్య రంగంపై పట్టు సాధించేందుకు వీలుగా నియంత్రణ విధానాలకు ఆయన మెరుగులు దిద్దుతున్నారు. ప్రభుత్వం నిర్దేశించిన ధరలకు ఆహారోత్పత్తులను అందచేయని రైస్ మిల్లులపై ఆయన గత వారం కొరడా ఝుళిపించారు. భద్రతా దళాలను పంపి ఈ మిల్లులను స్వాధీనం చేసుకోవటంతో పాటు అమెరికాకు చెందిన కార్గిల్ ఆధ్వర్యంలోని మరో రైస్ మిల్లును జాతీయం చేశారు. ప్రైవేటు రంగంలో ఉత్పాదకత తగ్గిపోతూ సంక్షోభం ఏర్పడే అవకాశాలను నివారించి ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయటంతో పాటు చమురు రెవెన్యూలను పెంచుకునేందుకు వీలుగా ఆర్థిక వ్యవస్థపై ప్రభుత్వ పట్టును పెంచేందుకు ఛావెజ్ పలు విధానాలను రూపొందిస్తున్నారు. ఆహారోత్పత్తుల్లో అగ్రగామి సంస్థ అయిన ఎంప్రెస్ పోలార్ సంస్థను జాతీయం చేసేందుకు ముందడుగు వేస్తున్నారు.

# అమరజీవి వెంకటస్వామి స్ఫూర్తితో...



ఐ.వెంకటేశ్వరరావు
రాష్ట్ర ప్రధానకార్యదర్శి

చెన్నుపాటి అనుచరునిగా, ఉపాధ్యాయ ఉద్యమమే కర్తవ్యంగా, యుటియఫ్ నిర్మాణమే జీవితంగా నాలుగు దశాబ్దాల పాటు ఉపాధ్యాయ ఉద్యమానికి సేవలందించిన ఎవిఎస్ గారు నా పాఠశాల విద్య (1966-70)లో నాకు గురువు. మా స్వగ్రామమైన ఎ. వేమవరప్పాడు పాఠశాలలో దీర్ఘకాలం ఆయన ఉపాధ్యాయునిగా పని చేశారు. ఆ కాలంలో మా కుటుంబాలతో దగ్గరి అనుబంధం ఉండేది. మా ఊరి పాఠశాలను అభివృద్ధి చేసిన వారిగా, మంచి టీచరుగా గ్రామ ప్రజలలో గుర్తింపు ఉంది. సరిహద్దు గ్రామాలకు చెందిన మా నివాసాల మధ్య దూరం $1\frac{1}{2}$ కిలోమీటర్లు. అప్పటికే ఆయన ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ నాయకునిగా ఉద్యమంలో బిజీగా ఉండేవారు. తర్వాత సంఘం కోసం వాలంటరీ రిటైర్‌మెంట్ యిచ్చి విజయవాడ మకాం వెళ్ళినా రావులచెరువువారి ఇంటికి వస్తే ఖచ్చితంగా మా ఊరు వచ్చి మా కుటుంబాలను పరామర్శించి వెళ్ళేవారు.

1983లో ఉపాధ్యాయ వృత్తిలో చేరే వరకు నేను మట్టిమనిషిని. పని తర్వాతనే చదువుకు ప్రాధాన్యత. ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించిన నాటి నుండి ఎవిఎస్ గారితో సంబంధాలు మరింత దగ్గరయ్యాయి. వ్యవసాయం నుండి వృత్తికి, వృత్తి నుండి సంఘానికి దగ్గరయ్యాను. ఉపాధ్యాయునిగా ఎలా పని చేయాలో ఎవిఎస్ గారి సాహచర్యం బాగా తోడ్పడింది. ఆయన నాతో చదివించిన సాహిత్యం పూర్వపు భావాలు మార్చుకొని సామాజిక స్పృహతో ఆలోచించే దానికి, బోధించడానికి ఉపయోగపడ్డాయి. అప్పటికే జిల్లా ఉద్యమ నేతగా ఉన్న వి. సూర్యనారాయణ రాజుగారితో సహచర్యం నాలో ఉద్యమ అవగాహనను పెంచింది. ఎవిఎస్ ఆశయ నిబద్ధత, సంఘ కార్యక్రమాలు వారి కష్టాలు ప్రత్యక్షంగా చూడడం జరిగింది. సంఘ కార్యక్రమాలకు మరింతగా చేరువయ్యాను. 1986 విజయవాడ విద్యా వైజ్ఞానిక మహాసభలు ఎంతో స్ఫూర్తినిచ్చాయి. 1987లో మండలాలు ఏర్పడినప్పుడు నేను అంగీకరించక పోయినా అమలాపురం మండల ప్రధానకార్యదర్శిగా బాధ్యత అప్పగించారు.

2000 జనవరిలో కాకినాడ రజతోత్సవాల ఏర్పాట్లు ఎవిఎస్ జి. చిట్టిబాబు మార్గదర్శకత్వంలో జయప్రదంగా జరిగాయి. రాష్ట్ర నాయకుడిగాను తూర్పుగోదావరి జిల్లా నాయకత్వం, ఉపాధ్యాయులతో ఆయనకున్న సంబంధాల వలన ఏది అడిగితే అది యిచ్చారు. నాడు నాలుగు నెలల్లో నలభై లక్షల విరాళాలు సేకరించి, 15 వేలమంది సమీకరణతో జరిగిన మహాసభలు క్రొత్త తరానికి ఉద్యమ స్ఫూర్తి నిచ్చాయి. యుటియఫ్ స్థాపనలో, నిర్మాణంలో, విస్తరణలో 25 ఏండ్లు అవిశ్రాంతగా పని చేసి రాష్ట్రంలో పెద్ద సంఘంగా తీర్చిదిద్దారు. ఆంధ్రప్రదేశలో అన్ని తరగతుల ఉపాధ్యాయులను ఒకే వేదిక మీదకు తీసుకొని వచ్చి సమైక్యతను చాటారు. అన్ని పరీక్షా సమయాలలో ఉపాధ్యాయుల పక్షాన నిలబడే సంస్థగా తీర్చిదిద్దారు. వ్యవస్థాపక ప్రధానకార్యదర్శిగా ఆ బాధ్యతను సమర్థవంతంగా నిర్వహించి రజతోత్సవ మహాసభలో నూతన తరానికి నాయకత్వం అప్పగించి మరణించేవరకు ఐక్య ఉపాధ్యాయ సంపాదకునిగా ఉన్నారు.

ఉద్యమం కోసం 18 సం॥ల సర్వీసును వదులుకోవడమేకాదు. పూర్తి కాలం కార్యకర్తగా నిస్వార్థం, నిబద్ధత కలిగి నిజాయితీ, నిడాంబరంగా జీవించారు. ఆయన తయారు చేసిన కార్యకర్తలే నేటి ఉద్యమానికి ఊపిరిగా ఉన్నారు. సంఘం విస్తరణలో, కేడర్ అభివృద్ధిలో, జిల్లా ఆఫీసులు మరియు విజయవాడ, హైదరాబాదు కార్యాలయాలు వారి నేతృత్వంలో నిర్మించబడ్డాయి. రూపాయి రూపాయి పోగేసిన సొమ్ము పొదుపుగా ఖర్చు చేశారు. చింకి చాపతో ప్రారంభమైన సంఘం ఆస్తులు వారు మరణించే నాటికి కోట్లకు చేరుకొన్నాయి.

పోరాటాలు ప్రాతినిధ్యాలు, చర్చలలో, ఉత్తర్వుల సాధనలో ప్రత్యక్ష పాత్రధారి, సూత్రధారి మన ఎవిఎస్. ఈ సదుపాయాలు ఉపాధ్యాయ ఆర్థిక సాంఘిక హోదాను పెంచాయి. ఈ రోజు మనం అనుభవిస్తున్న అనేక హక్కులు, రాయితీలు ఆ 27 ఏండ్ల కాలంలో సాధించినవే. ఏ ప్రభుత్వాలు అధికారంలో ఉన్నా పోరాటాల ద్వారానే మన హక్కులు సాధించుకోగలమని చాటి చెప్పిన ఉద్యమ నేత. టిడిపి పాలనలో ఒక పోరాటం సందర్భంగా సమస్యల పరిష్కారానికి నలుగురు మంత్రుల కమిటీతో చర్చలు జరుగుతుంటే 'పోరాడి సాధించుకొన్న హక్కులను వదులుకోలేమ'ని ఎవిఎస్ చెబితే ఒక మంత్రి స్వాతంత్ర్యం కూడా పోరాడి సాధించుకున్నామని వ్యంగ్యంగా మాట్లాడారు. ప్రతి స్పందనగా "పోరాడి సాధించుకొన్న హక్కులు వదులుకోవడానికి మేము సిద్ధంగా లేము", పోరాడి సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని వదులుకోవడానికి మీరు సిద్ధంగా ఉన్నారా? అని మంత్రిని నిలదీసిన మన ఎవిఎస్ ఎంత సమయ స్ఫూర్తితో వ్యవహరించారో ఈ ఉదంతం చెబుతుంది. పోరాటం, నిర్మాణం, అధ్యయనం, ఉపన్యాసం, కేడర్ పట్ల అభిమానం, వాదనా పటిమ అన్నింటా మనకు మార్గదర్శి ఎవిఎస్.

యుటియఫ్ ఉద్యమాన్ని తీర్చిదిద్ది ఆర్థిక క్రమశిక్షణను నేర్పిన మహా మనీషి ఆయన. ఆయన బోధించిన ఆదర్శాలకు అనుగుణంగానే జీవించారు. వారి కుటుంబ సభ్యులను ఆ విధంగా తీర్చి దిద్దారు. వారికి సంస్కరణ వివాహాలు చేశారు. ఎవిఎస్ జీవితం మనకు నిరంతర ప్రేరణ కావాలి.

రీగ్రూపింగ్ స్కేలు సాధించుకోవటం వాటిపై 10,15 సం॥ల స్కేలు ఆ తర్వాత 1986 వేతన స్కేలు ద్వారా వచ్చిన ఆర్థిక పెరుగుదల సర్వీసు ఉన్న వారితోపాటుగా, 1983-1986 డిఎస్‌సి ద్వారా ఉపాధ్యాయ వృత్తిలోకి వచ్చిన వారికి యువతరానికి మంచి ఆర్థిక పెరుగుదల వచ్చింది. అందుకే ఎవిఎస్‌గారు తమ ఉపన్యాసాలతో పాత తరంలో ఉపాధ్యాయుల స్థితి గతులను ఆర్థిక ఇబ్బందులను పేర్కొంటూ యువ ఉపాధ్యాయులను ఉద్దేశించి 'వడ్డించిన విస్తరి మీ జీవితం' అని చెబుతూ మీరు అప్రమత్తంగా లేకపోతే సాధించుకున్న రాయితీలు హరించుకుపోతాయని కర్తవ్య బోధ చేసేవారు. నిజంగానే ఆ తర్వాత సరళీకరణ విధానాలు అమలు చేసిన పాలకులు ఒక్కొక్క రాయితీ వెనక్కు తీసేసుకుంటున్నారు. సామాజిక భద్రతగా పోరాడి సాధించుకొన్న పాత పెన్షన్ పథకాన్ని నేటి వైఎస్ ప్రభుత్వం 1.9.2004 నుండి రద్దు చేసింది. సంస్కరణల కాలంలో వచ్చిన పిఆర్‌సిలు గతంలో సాధించుకొన్న అనేక రాయితీలు రద్దు చేశారు. ఉపాధ్యాయ నియామకాలలో దుర్మార్గమైన అప్రెంటిస్ విధానం ప్రవేశ పెట్టారు.

ఎవరు ఏ స్థాయి నాయకులమైనా నిబంధనావళికి అనుగుణంగా పని చేయాలని ప్రమాణాలు పాటించాలని చెప్పేవారు. ఉద్యమం కార్యకర్తల నిజాయితీపై ఆధారపడి ఉంటుందనేవారు. ఉద్యమ నేతగా ఉంటూనే ప్రయాణ కాలంలో అధ్యయనం చేసే వాడినని చెబుతుండేవారు. సాహితీ ప్రియునిగా, వ్యంగ రచయితగా, మినీ కథలు, విజ్ఞాన విషయాలు స్వామి పేరుతో ఐక్య ఉపాధ్యాయ శీర్షికలోను, ఉపన్యాసాలలో చెప్పిన విషయాలు ఉపాధ్యాయుల ఆలోచనకు పదును పెట్టాయి. ఉద్యమ అవగాహన పెంచాయి. మూడుసార్లు అనారోగ్యానికి గురి అయినా ఆహార నియామాలు పాటిస్తూనే కడదాకా సంఘ సేవ చేస్తూనే 21.3.2001న మరణించారు. ఈ తరం కార్యకర్తలు ఉపాధ్యాయులు వారి విలువలను త్యాగనిరతి ఆదర్శంగా తీసుకొని ఉద్యమ కర్తవ్యానికి పునరంకితం కావాలి. ఆశయాల సాధనకు కృషి చేయాలి. *

# పిఆర్‌సితో యుటియఫ్ చర్చలు

సిహెచ్. సుభాష్‌చంద్రబోస్
గౌరవాధ్యక్షులు, యుటిఎఫ్

రాష్ట్ర ప్రభుత్వం 9వ వేతన సంఘాన్ని సి.ఎస్. రావు గారి నేతృత్వంలో నియమించింది. వీరు 27 రకాల ప్రశ్నావళిని రూపొందించి దాని ప్రకారం మన అభిప్రాయాలను, నూతన వేతనాలు, అలవెన్సులు, రిటైర్‌మెంట్ బెనిఫిట్స్ వగైరాల వివరాలను పంపమని కోరగా ది. 7.12.2008 నాడు యుటియఫ్ పక్షాన రూపొందించిన ప్రతిపాదనలు పంపించియున్నాము. వాటిపై చర్చించుటకు 3.3.2009 నాడు ఉపాధ్యాయ సంఘాలలో మొదటగా యుటియఫ్‌ను ఆహ్వానించారు. చర్చలలో సిహెచ్. సుభాష్‌చంద్రబోస్, ఎన్. నారాయణ, ఐ. వెంకటేశ్వర రావు, సిహెచ్.రవి, కె. వెంకట్రావు పాల్గొని యుటియఫ్ పక్షాన అభిప్రాయాలను తెలియజేశారు. వీటిలో 7.12.2008 నాడు యిచ్చిన ప్రతిపాదనలకు కొన్ని సవరణలను కూడా ప్రతిపాదించడం జరిగింది. అందులో ముఖ్యమైనవి ఈ క్రింద పొందుపరచుచున్నాను.

**కనీస వేతనం :-** రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల కనీస వేతనం గతంలో రు. 8120/-గా ప్రతిపాదించాము. కాని కేంద్ర ప్రభుత్వోద్యోగుల కనీస వేతనం 1.7.2008 నాటికి రు. 7650/- కాగా దానిపై డి.ఏ. 16% రు. 1224 కలుపగా మొత్తం రు. 8874/-గా ఉన్నది. అదే 1.7.2008 నాటికి రాష్ట్ర ప్రభుత్వోద్యోగి వేతనం రు. 3750/- డిఏ 42.39 గతం 1589 మొత్తం రు. 5339/- దానిపై 56% ఫిట్‌మెంట్ రు. 2989 కలుపగా మొత్తం రు. 8328/- అగుచున్నది. కావున రాష్ట్ర ప్రభుత్వోద్యోగి కనీస వేతనం రు. 8380/-గా ప్రతిపాదించడమైనది. మేగ్జిమం జీతం రు. 76130/-.

**నూతన మాస్టర్ స్కేలు**

8380-260-8900-280-9740-310-10670-330-11660-370-12770-400-13970-440-15290-480-16730-520-18290-570-20000-620-21860-680-23900-740-26120-810-28550-890-31220-970-34130-1060-37310-1160-40790-1270-44600-1390-48770-1510-53300-1660-58280-1810-63710-1980-69650-2160-76130.

**కేటగిరి -3 టీచర్ల వేతనం**

12400-370-12770-400-13970-440-15290-480-16730-520-18290-570-20000-620-21860-680-23900-740-26120-810-28550-890-31220-970-34130-1060-37310-1160-40790.

**కేటగిరి-2 టీచర్ల వేతన స్కేలు**

15770-480-16730-520-18290-570-20000-620-21860-680-23900-740-26120-810-28550-890-31220-970-34130-1060-37310-1160-40790-1270-44600-1390-48770-1510-53300-1660-54960.

**కేటగిరి-1 టీచర్ల స్కేలు**

21860-680-23900-740-26120-810-28550-890-31220-970-34130-1060-37310-1160-40790-1270-44600-1390-48770-1510-5330-1660-58280-1810-63710-1980-69650-2160-76130.

ముఖ్యంగా కేటగిరి-3 ఉపాధ్యాయులకు 1999 వేతన స్కేళ్ళలో మినిమం 3950/-కి బదులు రు. 3750/-గాను, 2005 వేతన స్కేళ్ళలో 5750/-గా నిర్ణయించవలసియుండగా రు. 5470/- నిర్ణయించబడినది. గత రెండు వేతన సవరణలలోను తీవ్రమైన అన్యాయం జరిగిందని దీనిని సరిచేయాలని సోదాహరణంగా కమీషన్ దృష్టికి తెచ్చాము. ఈ అన్యాయమును ఈ వేతన స్కేళ్ళలో సవరించే దిశగా జనరల్ స్కేళ్ళలో తదుపరి స్కేలుగా నిర్ణయించాలని కోరగా కమీషనర్ సానుకూలంగా స్పందించారు.

**ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీము :-** ప్రస్తుతమున్న 8/16/24 సం॥లుగానే ఉండాలని, టెస్టులు పాస్ కావాలనే షరతులు లేకుండా ఈ స్కీము వర్తింప జేయాలని కోరాము. కేంద్ర ప్రభుత్వంలో వలె కేడరు సర్వీస్‌గాక మొత్తం సర్వీసు పరిగణనకు తీసుకోవాలని ప్రతిపాదించడమైనది.

స్టెప్అప్ గతంలో అదనపు ఇంక్రిమెంట్లు విలీనం వలన, ఎఫ్ఆర్ 22బి అమలు వల్ల జూనియర్ ఎక్కువ పొందడం జరుగుచున్నది. ఇలాంటి సందర్భంలో జూనియర్ వేతనంతో సీనియర్ వేతనం స్టెప్అప్ చేసుకునే అవకాశం గతంలో ఉండెడిది. ఇటీవల ఈ అవకాశం రద్దు చేశారు. అలాగే జూనియర్ ఇంక్రిమెంటుతో సీనియర్ ఇంక్రిమెంటును (ఇద్దరి వేతనాలు సమానంగా ఫిక్స్ అయినచో) ప్రీపోన్‌మెంట్ చేసుకునే అవకాశం ఉండెడిది. దీనిని ఈ పిఆర్‌సిలో పునరుద్ధరించాలని కోరడం జరిగింది.

**స్పెషల్ పే అలవెన్సెస్**

| | ప్రస్తుతం | నూతన ప్రతిపాటన |
|---|---|---|
| ప్రైమరీ స్కూలు హెచ్ఎం | రు. 60/- | రు. 200/- |
| యుపి స్కూలు హెచ్ఎంల | రు. 75/- | రు. 300/- |
| అప్‌గ్రేడెడ్ హైస్కూల్స్ హెచ్ఎం | రు. 75/- | రు. 400/- |
| ఉన్నత పాఠశాలలో పై తరగతులు బోధించు సె॥గ్రే/పండిట్స్ | రు. 75/- | రు. 300/- |
| స్కాట్ అలవెన్స్ | రు. 50/- | రు. 200/- |

షెడ్యూల్డ్ ఏరియాలో పని చేయుచున్న ఉద్యోగులకు ఎస్‌సిఏ, ఏహెచ్ఆర్ఏలను 100% పెంపుదల చేసి కొనసాగించాలి.

వికలాంగులకు యిచ్చే కన్వేయన్స్ అలవెన్స్‌ను రు. 600/- నుండి రు. 1000/-కి పెంచాలి.

ట్రాన్స్‌పోర్ట్ అలవెన్సును కేటగిరి -1 వారికి 1500/- కేటగిరి-2 వారికి రు. 1000/-, కేటగిరి-3 వారికి రు. 800/-గా నిర్ణయించి అమలు చెయ్యాలి. మెడికల్ రీయింబర్స్‌మెంట్ చెల్లించే సందర్భంలో ఎలాంటి పరిమితులు లేకుండాను, ఉద్యోగి ముందు డబ్బు చెల్లించి తదుపరి క్లెయిమ్ చేసే పద్ధతిని మార్చాలని నేరుగా సంబంధిత ఆసుపత్రులు బిల్లులు ప్రభుత్వానికి పంపి రాబట్టుకొనే విధానాన్ని అమలు చేయాలని కోరడం జరిగింది.

ఎల్‌టిసి వినియోగంలో దుర్వినియోగాన్ని అరికట్టడం కోసం నిర్ణీత మొత్తాన్ని నగదుగా చెల్లించాలని, 10 సం॥లకు ఒకసారి దేశంలో ఎక్కడికైనా విజ్ఞాన యాత్రకు ఎల్‌టిసి కల్పించాలని కొరడం జరిగింది. అడిషనల్ ఇంక్రిమెంట్లు, ఫ్యామిలీ ప్లానింగ్ ఇంక్రిమెంట్లు పునరుద్ధరించాలని కోరడం సూచించనైనది.

రిటైర్‌మెంట్ వయస్సు 60 ఏళ్ళుగా ఉండాలని, కనీస పెన్షన్ రు. 6285/-గా నిర్ణయించాలని కమ్యూట్ చేయబడిన పెన్షన్‌ను తిరిగి 10 సం॥ల తర్వాత పూర్తిగా చెల్లించాలని, గ్రాట్యుటీ 10 లక్షలకు పెంచాలని, అంత్యక్రియలకు యిచ్చే సొమ్మును 10 వేలకు పెంచాలని ప్రతిపాదించాము. *

# UTF రాష్ట్ర మహాసభలు

పీడిత, తాడిత ప్రజల విముక్తి కోసం సాగిన వీర తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటంలో వీరోచిత పాత్ర పోషించిన ఉద్యమాల ఖిల్లా నల్గొండ జిల్లాలో ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 11వ రాష్ట్ర మహాసభలు స్థానిక నాగార్జున డిగ్రీ కళాశాలలో ఫిబ్రవరి 20,21,22 తేదీలలో అట్టహాసంగా జరిగాయి. మహాసభల మొదటి రోజు ఉత్తేజం... ఉత్సాహంగా సాగాయి. ఈ మహాసభలకు రాష్ట్రం నలుమూలల నుంచి పదివేలమంది ఉపాధ్యాయులు తరలి వచ్చారు. ప్రముఖ విద్యావేత్తలు, ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, వివిధ రాజకీయ పక్షాల నేతలు, కవులు, కళాకారులు హాజరయ్యారు. ముందుగా గత 10 మహాసభలకు గుర్తుగా 10 పతాకాలను ఆయా జిల్లాల బాధ్యులు తీసుకురాగా, రాష్ట్ర నాయకులు వాటిని స్వీకరించారు. తరువాత ఎస్‌టిఎఫ్ఐ పతాకాన్ని యుటియఫ్ రాష్ట్ర గౌరవాధ్యక్షులు సుభాష్‌చంద్రబోస్, యుటియఫ్ పతాకాన్ని సీనియర్ నాయకులు కె. కృష్ణమూర్తి ఆవిష్కరించారు. మహాసభ ప్రాంగణంలో ఏర్పాటు చేసిన అమరవీరుల స్థూపం వద్ద పూలు చల్లి జోహార్లు అర్పించారు. ప్రముఖ విద్యావేత్త, ఎమ్మెల్సీ చుక్కారామయ్య మహాసభలను ప్రారంభించి ప్రసంగించారు. ఈ ప్రారంభ సభలో యుటియఫ్ మహాసభల ప్రాధాన్యత, నల్గొండ జిల్లా పోరాటాల చరిత్రను నొక్కి చెబుతూ పాఠశాల విద్య పరిస్థితి రాష్ట్ర విద్యాసదస్సులో పాఠశాల విద్యాభివృద్ధికి వచ్చే ఎన్నికల్లో తమ మ్యానిఫెస్టోలో ప్రధాన ఎజెండా చేరుస్తామనే హామీ లభించింది. అనంతరం వేలాదిమంది ఉపాధ్యాయులు పట్టణ పురవీధుల్లో సుమారు 10 కి.మీ. దూరం వరకు నిర్వహించిన భారీ ప్రదర్శన ప్రతినిధుల్లో ఉత్తేజం, ఉత్సాహాన్ని నింపింది. అనేక ప్రజా సంఘాలు ప్రధాన కూడళ్ళలో పూలు చల్లుతూ మద్దతు ప్రకటిస్తుంటే కార్యకర్తలు పులకించి పోయారు. బహిరంగ సభలో ఉపాధ్యాయుల సమస్యలు, విద్యారంగంలో వస్తున్న మార్పులు, ప్రభుత్వ విధానాలపై ప్రధానంగా చర్చ సాగింది. రాత్రి ప్రజానాట్యమండలి కళాకారులు ప్రదర్శించిన వీర తెలంగాణా వీధి నాటిక, నల్గొండ ఉపాధ్యాయులు ప్రదర్శించిన 'పల్లెసుద్దులు' సభికుల్ని ఉద్యమాలకు ఉద్యుక్తుల్ని చేసింది. ప్రముఖ సినీ రచయిత, గాయకులు సుద్దాల అశోక్‌తేజ పాటలు, మాటలతో పీడిత, తాడిత ప్రజా పోరాటాల గొప్పతనాన్ని తెలియజేశారు.

**పోరాటాల చరిత్ర చెప్పి ఉత్తేజ పరిచిన చుక్కా:-** ఆర్థిక సంక్షోభాలతో ధ్వంస మవుతోన్న విద్యారంగాన్ని పరిరక్షించుకునేందుకు ఉపాధ్యాయులు ఉద్యమించాల్సిన అవసరముందని ప్రముఖ విద్యావేత్త ఎమ్మెల్సీ డాక్టర్ చుక్కారామయ్య పిలుపునిచ్చారు. విప్లవాల ఖిల్లా నల్లగొండ జిల్లాలో జరుగుతున్న మహాసభలు చారిత్రాత్మక కర్తవ్యాల రూపకల్పనకు వేదిక కావాలని ఆకాంక్షించారు.

**మ్యానిపెస్టోలో విద్యనే ప్రధాన ఎజెండా :-** వచ్చే సార్వత్రిక ఎన్నికల మ్యానిపెస్టోలో పాఠశాల విద్యనే ప్రధాన ఎజెండాగా చేరుస్తామని అధికార, ప్రతిపక్ష పార్టీల నేతలు స్పష్టమైన హామీ ఇచ్చారు. మహాసభల సందర్భముగా నిర్వహించిన పాఠశాల విద్య పరిస్థితిపై అధికార కాంగ్రెస్ పార్టీ నుంచి పాల్గొన్న పిసిసి అధికార ప్రతినిధి ఎన్. తులసి రెడ్డి విద్యారంగ ప్రాధాన్యతను నొక్కి చెప్పారు. ఉపాధ్యాయుల సమస్యలతోపాటు విద్యారంగ అభివృద్ధికి చేయాల్సినది ఎంతో ఉందని సభలో అంగీకరించారు. చేసిన దానికంటే చేయాల్సిందే అధికంగా ఉందని అంగీకరిస్తూనే కొద్దిపాటిగా చేసిన దానినే అతిగా చెప్పే ప్రయత్నం చేశారు.

మాజీ విద్యామంత్రి టిడిపి రాష్ట్ర నాయకులు మండవ వెంకటేశ్వర రావు తమ పాలనలో విద్యారంగం విషయంలో జరిగిన నిర్లక్ష్యాన్ని అంగీకరిస్తూ పశ్చాత్తాపాన్ని ప్రకటించారు. టిడిపి అధికారంలోకి వస్తే అన్నీ చేస్తామని భరోసా ఇచ్చారు.

సిపిఎం రాష్ట్ర కార్యదర్శి బి.వి. రాఘవులు మాట్లాడుతూ సమస్యల పరిష్కారం కోసం రాజీ ధోరణి కాకుండా పోరాటాలే శరణ్యమని పిలుపునిచ్చారు. ఉపాధ్యాయుల్లో కూడా పెడ ధోరణలు వస్తున్నందున యుటియఫ్ వారిని చైతన్య పరిచే బాధ్యతను నిర్వర్తించాలని కోరారు. సిపిఐ ప్రతినిధి ఆది రెడ్డి మాట్లాడుతూ యుటియఫ్ క్రమశిక్షణను ప్రశంసించారు.

**విద్యారంగ పరిరక్షణకు ఐక్య ఉద్యమాలు - ఎమ్మెల్సీలు:-** ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాల వల్లే విద్యారంగం సంక్షోభంలోకి నెట్టబడిందని ఎమ్మెల్సీలు డి. రామిరెడ్డి, జార్జివిక్టర్, యస్. లక్ష్మణ్‌రావు, కె. నాగేశ్వర్‌లు అభిప్రాయపడ్డారు. యుటియఫ్ ఉద్యమాల ఫలితంగానే ప్రభుత్వం దిగొచ్చిందన్నారు. ఐక్య ఉద్యమాలను దెబ్బతీసే విధంగా జాక్టో సమ్మె సందర్భంగా చీలిక తెచ్చేందుకు ప్రభుత్వం కుట్ర చేసిందన్నారు.

ప్రారంభ సభకు యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఐ. వెంకటేశ్వర రావు, విద్యా సదస్సుకు ఎమ్మెల్సీ డి. రామిరెడ్డి, బహిరంగ సభకు సీనియర్ నాయకులు కె. కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. వివిధ రంగాలకు సంబంధించిన ఫోటో ఎగ్జిబిషన్, పుస్తక ప్రదర్శన వంటి కార్యక్రమాలతో మహాసభలు అట్టహాసంగా ప్రారంభమయ్యాయి. మహాసభలకు అతిథులుగా ఎమ్మెల్యేలు జూలకంటి రంగారెడ్డి, మాజీ ఎం.పి. గుత్తా సుఖేందర్ రెడ్డి, మాజీ ఎమ్మెల్యే నంద్యాల నరసింహా రెడ్డి, అధ్యాపక సంఘం నాయకులు అందే సత్యం హాజరవ్వగా యుటియఫ్ రాష్ట్ర ఆఫీసు బేరర్లు, 23 జిల్లాల ప్రతినిధులు, సీనియర్ నాయకులు పాల్గొన్నారు.

మహాసభల రెండవ రోజు ప్రతినిధుల సభ ఐ. వెంకటేశ్వర రావు, సిహెచ్. సుభాష్‌చంద్రబోస్, సి. కమలకుమారి అధ్యక్షవర్గంగా వ్యవహరించారు. సిఐటియు రాష్ట్ర అధ్యక్షులు ఎస్. వీరయ్య ప్రారంభిస్తూ ప్రస్తుతం ప్రపంచం పెద్ద సంక్షోభంలో కూరుకుపోయి లక్షలాది ఉద్యోగాలు ఊడిపోయాయన్నారు. సమాజంలో సంఘటిత, అసంఘటిత రంగ కార్మికులు విడివిడిగా పోరాటాలు నిర్వహిస్తున్నారని, రాష్ట్రంలో ఎన్నో ఉద్యమాలు నిర్వహించాల్సిన బాధ్యత ఉపాధ్యాయులపైనే ఉందని పిలుపునిచ్చారు. రాష్ట్ర వ్యాపితంగా లక్షా 20వేల మంది సభ్యులకు ప్రాతినిధ్యం వహిస్తూ వచ్చిన 570 మంది ప్రతినిధులనుద్దేశించి ఉత్తరాంధ్ర పట్టభద్రుల నియోజకవర్గ ఎమ్మెల్సీ ఎంవిఎస్ శర్మ మాట్లాడుతూ ఉపాధ్యాయ ఉద్యమంలో సైద్ధాంతికమైన స్పష్టతను ప్రచారం చేయాలని కోరారు.

రాష్ట్రంలో సంఘం నిర్వహించిన ఆందోళన – పోరాటాలకు సంబంధించిన నివేదికను సంఘం రాష్ట్ర ప్రధానకార్యదర్శి నాగటి నారాయణ ప్రవేశ పెట్టారు. గత మహాసభ నుంచి నేటి మహాసభ వరకు సంఘం నిర్వహించిన కార్యక్రమాలను, ఉద్యమ నిర్మాణానికి సంబంధించిన కార్యక్రమాలను వివరిస్తూ విద్యారంగ పరిరక్షణ, ఉపాధ్యాయ సమస్యలపై ఐక్య ఉద్యమాలు నిర్వహించడంలో యుటియఫ్ కీలక పాత్ర పోషించిందన్నారు. జాక్టో ఉద్యమంలో నిర్వహించిన సమరశీల దృక్పధాన్ని రాబోయే కాలంలో కూడా కొనసాగించాలని పిలుపునిచ్చారు. సమరశీల వైఖరిని తట్టుకోలేని ప్రభుత్వం యుటియఫ్‌ను ఒంటరిపోరాటం చేసేందుకు ప్రయత్నం చేస్తుందన్నారు. వాస్తవ పరిస్థితిలో మాత్రం ఉపాధ్యాయ లోకం యుటియఫ్‌నే తమకు అసలైన ప్రతినిధిగా భావిస్తున్నారన్నారు. సమస్యల పరిష్కారం కోసం ఉద్యమాలను మరింత ఉధృతం చేస్తామని ఆ దిశగా ఈ మహాసభ తగిన నిర్ణయాలు తీసుకొంటుందన్నారు. వచ్చే మహాసభల నాటికి 1 లక్ష 50వేల సభ్యత్వానికి చేరుకునే లక్ష్యంతో ముందుకు సాగాలన్నారు.

అనంతరం రాష్ట్ర కోశాధికారి ఎం. సంయుక్త ఆర్థిక నివేదికను ప్రవేశ పెట్టారు. అదే విధంగా సంఘం అధికార మాసపత్రిక ఐక్య ఉపాధ్యాయ నివేదికను ప్రధాన సంపాదకులు చావ రవి ప్రవేశ పెట్టారు.

# పే రివిజన్ కమీషనర్‌కు పిడిఎఫ్ ఎమ్మెల్సీల మెమోరాండమ్

పిఆర్‌సి ప్రతిపాదనలపై చర్చల కోసం ఆహ్వానం మేరకు మార్చి 2న పిడిఎఫ్ ఎమ్మెల్సీలు సి. రామయ్య, డి. రామిరెడ్డి, వి. బాలసుబ్రహ్మణ్యం, ఎంవిఎస్. శర్మ, డా॥ కె. నాగేశ్వర్‌లు పే రివిజన్ కమీషనర్ సి.ఎస్. రావుతో సమావేశమై చర్చించారు. ఈ సందర్భంగా సమర్పించిన మెమోరాండమ్...

రాష్ట్రంలో 1956 నుండి పే రివ్యూ చేయుటకు స్థిరమైన విధానం అనుసరించలేదు. అందువల్లనే మన రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు, కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు మధ్య అనేక అంశాలలో తేడాలొస్తున్నాయి.

ముఖ్యంగా కనీస వేతనం నిర్ణయించుటలోను, ఫిట్‌మెంట్ ఫార్ములా అనుసరించుటలోను, కరువు భత్యం మంజూరు చేయుటలోను, ఇంటి అద్దె అలవెన్సు నిర్ణయించుటలోను, వ్యత్యాసాలు వస్తున్నాయి.

కావున ప్రత్యేక అంశములలో తప్ప మిగిలిన అన్ని అంశాలలో ఆరవ కేంద్ర పే కమిటి సిఫారసులను యధాతథంగా అమలు జరపాలని దానికి అనుగుణంగా మాస్టర్ స్కేలు విధానాన్ని సవరించాలని కోరుచున్నాము.

గతంలో సీనియర్ వేతనానికి, జూనియర్ వేతనానికి మధ్య తేడా వస్తే ఆ తేడాను తొలగించుటకు Step-Up, Increment Preponement సౌకర్యం ఉండేది దానిని గత పే కమిటి సిఫారసులలో తొలగించారు. ఈ సౌకర్యాన్ని పునరుద్ధరించాలని కోరుచున్నాము.

ఆటోమెటిక్ అడ్వాన్స్‌మెంటు స్కీమ్‌లో కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న 8/6/24 సం॥ల విధానాన్ని కొనసాగించాలి. 24 సం॥ లకు ఒక యింక్రిమెంట్ ఇచ్చే విధానం కొనసాగించాలి. దీనిలో ఫిక్సేషన్ లేదు కాబట్టి నార్మల్ ఇంక్రిమెంట్ తేదికి నార్మల్ ఇంక్రిమెంట్ ఇవ్వాలి. 16/24 స్కేలు తీసుకొని పై పోస్టులో ప్రమోట్ అయిన వారు ప్రస్తుతం తీసుకొనే స్కేలుతో నిమిత్తం లేకుండా ప్రమోషన్ పోస్టులో సర్వీసును బట్టి 8/16/24 సం॥ స్కేలు ఇవ్వాలి. మొత్తం సర్వీసు పరిగణించాలి.

యు.జి.సి స్కేలు పొందుతున్న యూనివర్సిటీ, కాలేజి లెక్చరర్‌లకు, ప్రిన్సిపాల్స్ మొదలగు అందరికి కేంద్ర ప్రభుత్వ స్కేళ్ళతో పాటు రిటైర్మెంట్ వయస్సు పెంచాలి. ఇంటి అద్దె పెంచుటకు పట్టణ జనాభా ప్రతి సంవత్సరం సర్వే చేయించి సర్వే ప్రకారం పెరిగిన జనాభాను బట్టి ఇంటి అద్దె అలవెన్సు మార్పు చేయాలి. ప్రతి నెల మెడికల్ అలవెన్సు రూ॥ 500లు ఇవ్వాలి. దానికి మించి వైద్యానికి ఖర్చు పెట్టినప్పుడు అదనపు మొత్తానికి మెడికల్ రియంబర్స్ ఇవ్వాలి. ఏజెన్సీ ప్రాంతాలలో పని చేసే వారికి ఏజెన్సీ అలవెన్సును కొనసాగించాలి. ప్రభుత్వ క్వార్టర్ల ఇంటి స్లాబ్ రేట్లను నిర్ణయించి దాని ప్రకారమే ఇంటి అద్దె అలవెన్సు తగ్గించాలి.

విద్యా వాలంటీర్లు, కాంట్రాక్టు లెక్చరర్లు, క్యాజువల్ లేబరు మొదలగు రెగ్యులర్ స్కేలు లేని ఉద్యోగులందరికి కనీస వేతనం ఇవ్వాలి. కరువు భత్యం కూడా చెల్లించాలి. వరుసగా 5 సం॥ ల సర్వీసు (బ్రేకులతో సహా) పూర్తి చేసిన పై ఉద్యోగులకు రెగ్యులర్ స్కేళ్లు వర్తింపచేయాలి. వారి కొరకు అవసరమైనప్పుడు అదనపు పోస్టులు మంజూరు చేయాలి. గత రెండు పి.ఆర్.సిలలో ఉపాధ్యాయులకు అదనపు విద్యా అర్హతలకు అదనపు ఇంక్రిమెంట్ సౌకర్యం తొలగించారు. దానిని పునరుద్ధరించాలి.

ఉద్యోగ, ఉపాధ్యాయులు 25 సం॥ సర్వీసు పూర్తి చేసినవారికి పూర్తి పింఛను ఇవ్వాలి. గ్రాట్యుటి, కమ్యూటేషన్ కేంద్ర ఉద్యోగులతో సమానంగా ఇవ్వాలి. వారి వృద్ధాప్యాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రతి నెల మెడికల్ అలవెన్సు ఇవ్వాలి. 12 సం॥లు పెన్షన్ తీసుకొన్న తరువాత కమ్యూటేషన్ మొత్తాన్ని రెస్టోర్ చెయ్యాలి. పెన్షనర్‌లకు మెడికల్ రియంబర్స్‌మెంటు పొందుటకు గుర్తింపు కార్డులు యిచ్చే విధానం ఏర్పాటు చెయ్యాలి. అడ్వాన్సుగా వైద్య సౌకర్యం పొందేలాగ సౌకర్యం కల్పించాలి.

గతంలో స్కేళ్ళు నిర్ణయించినప్పుడు తక్కువగా నిర్ణయించిన స్కేళ్ళను సరిచేయాలి. సాంకేతిక బాధ్యతలు నిర్వహిస్తున్న అందరు ఉద్యోగులకు ప్రత్యేకమైన స్కేళ్ళు సిఫారసు చేయాలి. మున్సిపల్ పట్టణాలలో ఇంటి అద్దె అలవెన్సు నిర్ణయించుటకు ప్రస్తుతము యున్న 8 కి.మీ పరిధిని 10 కి.మీ. పరిధికి పెంచాలి. ఎల్.టి.సి కొరకు బిల్లులు పెట్టే విధానం బదులుగా ఏక మొత్తం యిచ్చే పద్ధతి ప్రవేశ పెట్టాలి. మెడికల్ రీ అంబర్స్‌మెంటుతో పాటు నెలసరి మెడికల్ అలవెన్సు యివ్వాలి. దహన క్రియలకు కనీస మొత్తం రూ॥ 10,000 లేక పెన్షన్‌లలో ఏది అధికంగా యుంటే దానిని ఇవ్వాలి. కనీసపెన్షన్ చివరినెల జీతంలో 75%గా నిర్ణయించాలి. (మొదటి ఏడు సం॥ లు) ఆపైన 50% గా పెన్షన్ యివ్వాలి). వాలంటరీరిటైరుమెంటుకు కనీస సర్వీసు (అప్రెంటీస్ సర్వీసుతో సహా 20 సం॥ నుండి 15 సం॥ లకు తగ్గించాలి. పెన్షన్ మంజూరు అధికారం జిల్లా స్థాయి అధికార్లకే యివ్వాలి. పెన్షనర్ల మెడికల్ రీ అంబర్స్‌మెంటు సర్వీసులోని ఉద్యోగులతో సమానంగా యివ్వాలి. సమర్ధులను ఆకర్షించటానికి విద్యాశాఖలో ఆకర్షణీయమైన వేతనాలు అదనపు అర్హతలకు అదనపు యింక్రిమెంట్లు యివ్వాలి. ప్రభుత్వ ఖర్చులు తగ్గించటానికి అనేక మార్గాలు వున్నాయి. వాటిలో ప్రకటనలపై ఖర్చు తగ్గించటం, విదేశీ ప్రయాణాలు తగ్గించటం, పెద్ద ఉద్యోగుల జీతాలు సవరణ మొదలగునవి. బస్సుపాస్‌లు అందరు ఉద్యోగులకు ఇవ్వాలి. *

---

**ఉత్సాహం, ఉత్తేజం నింపిన....**

విద్యారంగం ఎదుర్కొంటున్న ఉపాధ్యాయ సమస్యలపై తీర్మానాల కమిటీ ప్రతిపాదించిన అనేక తీర్మానాలను మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. కార్యదర్శి ప్రవేశ పెట్టిన నివేదికపై జిల్లాల వారీగా చర్చలు జరిపారు. 48 మంది ప్రతినిధులు చర్చలలో పాల్గొన్నారు. వారందరూ సంఘం నిర్వహించిన ఉద్యమాల పట్ల అసంతృప్తిని ప్రకటిస్తూ నిర్మాణపరంగా కొన్ని సూచనలు చేశారు. సమాధానాల అనంతరం నివేదికలను ఏకగ్రీవంగా ఆమోదించారు.

**సమస్యలపై సమరశీల పోరాటాలు :-** విద్యారంగం, ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారం కోసం సమరశీల పోరాటాలు నిర్వహించే దిశగా మహాసభ భవిష్యత్ కర్తవ్యాలను ఎంచుకుంటుందని సంఘం రాష్ట్ర అధ్యక్షులు ఐ. వెంకటేశ్వర రావు ప్రతినిధుల సభలో అధ్యక్షోపన్యాసంలో పేర్కొన్నారు. ఉద్యమ అనుభవాలను సమీక్షించుకొని మరో ముందడుగు వేసేందుకు సిద్ధం కావాలని పిలుపునిచ్చారు.

మహాసభల ముగింపు రోజున అతిథులుగా విచ్చేసిన సిపిఎం శాసన సభాపక్షనేత నోముల నరసింహ్మయ్య మాట్లాడుతూ జాతి భవిష్యత్తు పునాదులు వేసే ఉపాధ్యాయులను విస్మరిస్తే చరిత్ర క్షమించదని ప్రభుత్వాన్ని హితవు పలికారు. సమస్యలు పరిష్కరించాలని ఉపాధ్యాయులు ఆందోళన చేస్తే బ్రిటీష్ నీతిని ఉపయోగించి సంఘాల మధ్య చీలికలు తీసుకురావడం సిగ్గు చేటన్నారు. ఇలాంటి దుర్మార్గపు చర్యలకు పాల్పడితే బ్రిటీష్ వారికి పట్టిన గతే ప్రభుత్వానికి పడుతుందని హెచ్చరించారు.

జెఏసి చైర్మన్ గోపాల్‌రెడ్డి, ఏపిఎన్‌జిఓల సంఘం రాష్ట్ర ప్రధానకార్యదర్శి అశోక్‌బాబు, జెఏఎల్ హైదరాబాద్‌నగర చైర్మన్ పి. సత్యనారాయణ, ప్రధానోపాధ్యాయుల సంఘం రాష్ట్ర అధ్యక్షులు రహీమ్, ఎస్ఎఫ్ఐ రాష్ట్ర ప్రధానకార్యదర్శి భాస్కర్, డివైఎఫ్ఐ రాష్ట్ర అధ్యక్షులు ప్రసాద్ తదితరులు అతిధులుగా విచ్చేసి సందేశాలిచ్చారు. చివరగా రాష్ట్ర సీనియర్ నాయకులు పి. కృష్ణమూర్తి ఎన్నికల అధికారిగా, టి. కొండాచారి సహాయకులుగా రాష్ట్ర కార్యవర్గానికి జరిగిన ఎన్నికలలో 116 మంది కార్యవర్గ సభ్యులు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. నూతన కార్యవర్గ సభ్యులు విడిగా సమావేశం నిర్వహించి రాష్ట్ర ఆఫీస్ బేరర్లను, ఆడిట్ కమిటీని ఎన్నుకున్నారు. ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గాన్ని నామినేట్ చేశారు. ఈ విషయాన్ని మరల ప్రతినిధుల సభలో ప్రకటించి, ఎన్నికల అధికారి నూతన సభ్యుల చేత ప్రతిజ్ఞ, ప్రమాణస్వీకారం చేయించారు.

అనంతరం నూతన అధ్యక్షులు ఎన్. నారాయణ అధ్యక్షతన ముగింపు సభ జరిగింది. రాష్ట్ర కమిటీ నుండి రిలీవైన వారికి, మహాసభలకు ఆతిథ్యమిచ్చిన నల్లగొండ జిల్లా శాఖకు, ఏర్పాట్లలో సహకరించిన వాలంటీర్లకు ధన్యవాదాలు తెలిపి జ్ఞాపికలను బహుకరించటంతో మహాసభ ముగిసింది. *

# సాధారణ ఎన్నికలు ఉపాధ్యాయుల కర్తవ్యం



ఎం.వి.ఎస్. శర్మ
ఎమ్మెల్సీ

2009 ఏప్రిల్‌లో జరిగే ఎన్నికలు కొన్ని ప్రత్యేక పరిస్థితులలో జరుగుతున్నాయి. సాధారణంగా ఉపాధ్యాయులు, మధ్య తరగతి ఉద్యోగులు ఎన్నికలలో రాజకీయ నాయకుల చవకబారు విన్యాసాలు, ప్రజల ముందుంచే ప్రలోభాలు చూసి ఏవగించుకుంటారు. ఆచరణతో సంబంధంలేని వాగ్దానాలతో, విపరీత ప్రచారంతో ఓటర్ల ముందు జరిగే హైడ్రామాను చీదరించుకుంటారు. అవకాశవాద పొత్తులు, పార్టీల ఫిరాయింపులు, విచ్చలవిడిగా వెదజల్లే డబ్బు, పరస్పర ఆరోపణలు దూషణ భూషణ తిరస్కారాలు, సవాళ్లు, కుల మత ప్రాంతీయ సంకుచిత తత్వాలు పవిత్రమైన ప్రజాస్వామ్య ప్రక్రియను అవహేళన చేస్తున్న వైనాన్ని చూసి అసహ్యించుకుంటారు. 'ఏరాయైతేనేం పళ్లూడగొట్టుకోడానికి' అన్నట్టు ఉండే అభ్యర్థుల, పార్టీల చరిత్రలను చూసి అసలు మనం ఓటెయ్యడం అనవసరం అనుకుంటారు. ఎటుతిరిగీ మనకు ఎలక్షన్ డ్యూటీలు వేస్తారు గనుక ఓటెయ్యాల్సిన బాధే లేదనుకునే వారు కూడా చాలామంది ఉంటారు.

**మనం ఓట్లు వేస్తేనే మనని ఖాతరు చేస్తారు :** ఐతే మనం ఓటేసినా, వెయ్యక పోయినా ఎన్నికల ప్రక్రియ జరుగుతుంది. ఎవరికి మెజార్టీ వచ్చినా రాకపోయినా ఏదో విధంగా ప్రభుత్వాలు ఏర్పడతాయి. ఆ ప్రభుత్వాలు మన జీతాల గురించి, జీవితాల గురించి నిర్ణయాలు చేస్తాయి. మనకు నచ్చినా, నచ్చకపోయినా ఆ నిర్ణయాల పర్యవసానాల్ని మనం భరించక తప్పదు. ఎప్పుడూ ప్రజలంటే భయపడని పార్టీలు సైతం ఎన్నికల సమయంలో ఓటర్ల తీర్పు ఎలా వస్తుందోనని భయపడతాయి. వివిధ తరగతుల ప్రజల మనోభావాల కనుగుణంగా వ్యవహరించడానికి ప్రయత్నిస్తాయి. రైతుల గురించి, కూలీల గురించి, మహిళల గురించి, నిరుద్యోగుల గురించి, దళితుల గురించి, గిరిజనుల గురించి, బిసిల గురించి, మైనార్టీల గురించి తాపత్రయం వ్యక్తం చేసే ఈ పార్టీల ఎజెండాలో, ఎన్నికల మానిఫెస్టోలలో ఉపాధ్యాయుల గురించి మాత్రం ఏ ప్రస్తావనా ఉండదు. ఎందుకని? మనం ఎటుదిరిగీ పోలింగ్ డ్యూటీ చేస్తూ ఓటేసేది లేదు గనుక మనని ఖాతరు చెయ్యనవసరం లేదని వాళ్లు భావిస్తున్నారు. ఈ పరిస్థితిని సృష్టించుకున్నది మనమే. కనుక దీనిని మార్చాల్సిందీ మనమే. అందుకే ఎలక్షన్ డ్యూటీ ఉంటే పోస్టల్ బ్యాలెట్, లేకుంటే డైరెక్ట్ బ్యాలెట్ - మొత్తానికి లక్షలాది ఉపాధ్యాయులు ఈ ఎన్నికల్లో ఓటు వేసి తీరాలి. ఈసారి ముక్కోణపు పోటీ మన రాష్ట్రంలోను, దేశం మొత్తం మీద జరుగుతుంది. చాలా తక్కువ తేడాతో ఎన్నికల ఫలితాలు నిర్ణయమవుతాయి. అంటే మన ఉపాధ్యాయులు వేసే ఓట్లు కీలకమౌతాయి. అందుకే మనకు ఎనలేని హాని చేసిన పాలక పార్టీ మనం ఓట్లెయ్యకపోతే బాగుండునని ప్రార్థిస్తోంది. కాబట్టి మనం ఓటువేసి తీరాలి.

**నయవంచకులకు బుద్ధి చెప్పదాం :** ప్రస్తుత ప్రభుత్వం రాష్ట్రంలో గత ఐదేళ్లుగా ప్రభుత్వ విద్యా వ్యవస్థను అస్తవ్యస్తం చేసింది. మన ఉపాధ్యాయుల ఐక్యతను దెబ్బతీసింది. ఎయిడెడ్ విద్యా వ్యవస్థను చావుదెబ్బ కొట్టింది. 2004 ఎన్నికలకు ముందు మన ఉపాధ్యాయులకు రాజశేఖరరెడ్డి ఇచ్చిన హామీ లేమిటో గుర్తుకు తెచ్చుకుంటే ఈ ఐదేళ్లలో జరిగిన మోసమేమిటో, ఈ ప్రభుత్వపు నయవంచ ఎంతటిదో అవగతమౌతుంది. నయవంచకులకు పాఠం చెప్పడానికి ఈ ఎన్నికలొక మంచి అవకాశం.

**మతోన్మాదానికి మన మధ్య తావులేదు :** ఉపాధ్యాయుడు బోధించేటప్పుడు విద్యార్థికి అర్థమౌతోందా లేదా అన్నదీ చూస్తాడు. అంతే తప్ప ఆ విద్యార్థి కులాన్ని బట్టో, మతాన్ని బట్టో, ప్రాంతాన్ని బట్టో, ఆర్థిక స్థితి గతుల్ని బట్టో బోధనా పద్ధతిని గాని, సిలబస్‌నుగాని, పరీక్షా పత్రాన్ని గాని మార్చెయ్యడు. అంటే విద్యాబోధన స్వభావమే సెక్యులర్ అని అర్థమౌతుందికదా. జ్ఞానం ఈ కుల, మత, ఆర్థిక, సంకుచిత అడ్డుగోడల్ని ఛేదించే సుసంపన్న, శక్తివంతమైన సాధనం. అందుకే ఉపాధ్యాయ లోకం ఈ ఎన్నికల్లో మతోన్మాదపు నినాదాలతో, ముందుకొస్తున్న శక్తులను తిరస్కరించడం మన ముందున్న మరో కర్తవ్యం.

**ఆర్థిక సంక్షోభం నేపథ్యంలో ఎన్నికలు :** ముఖ్యమైనది మరొకటుంది. ఈ ఎన్నికలు జరుగుతున్న పూర్వరంగం చాలా ముఖ్యం. పెట్టుబడి దారీ ప్రపంచం యావత్తూ తీవ్ర ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోతున్న నేపథ్యంలో ఈ ఎన్నికలు జరుగుతున్నాయి. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ వంటి సంపన్న దేశాలు సైతం తీవ్రంగా ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నాయంటే భారత్ వంటి దేశాలకు సంక్షోభం తాకిడి ఎంత తీవ్రంగా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు. 9% ఉంటుందనుకున్న వృద్ధి రేటు 2008-09 చివరికొచ్చేసరికి 3.5% దిగిపోయిందంటే దాని తీవ్రత ఏమిటో తెలుస్తున్నది. ప్రపంచం మొత్తం మీద 5 కోట్ల ఉద్యోగాలు పోతాయని, అందులో ఒక కోటి ఉద్యోగాలు మన దేశంలోనే పోతాయని అంతర్జాతీయ కార్మిక సంస్థ అంచనావేసింది. దేశంలోకి వస్తాయనుకున్న పారిశ్రామిక పెట్టుబడులు ఆగిపోయాయి. ఒక్క సెప్టెంబరు 2008లోనే రు. 40,000 కోట్ల విదేశీ పెట్టుబడి మన రియల్ ఎస్టేట్ రంగం నుండి వెనక్కి తరలిపోయింది. వ్యవసాయం, భవన నిర్మాణం, రిటైల్ వ్యాపారం, ఐటి, టూరిజం, టెక్స్‌టైల్స్ - ఒకటేమిటి అన్ని రంగాలకూ ఈ సంక్షోభం వ్యాపించింది. ఇప్పటికే 20 లక్షల మంది ఉద్యోగాలు పోయాయి. 1929-39 మధ్య ప్రపంచాన్ని ఆవరించిన 'గ్రేట్ డిప్రెషన్' కన్నా తీవ్రమైనదిగా ప్రస్తుత సంక్షోభాన్ని ఆర్థిక శాస్త్రవేత్తలు అభివర్ణిస్తున్నారు.

**ఎందుకొచ్చింది సంక్షోభం :** గత కొన్నేళ్ళుగా అమలు జరుగుతున్న నయా ఉదారవాద విధానాల ఫలితమే, ప్రపంచీకరణ ఫలితమే ఈ సంక్షోభం. ఈ విధానాలు ఉపాధి రహిత అభివృద్ధికి దారితీశాయి. కొద్దిమంది చేతుల్లో సంపద విపరీతంగా పోగుపడింది. అనేకమందిని పేదరికంలోకి నెట్టింది. తాత్కాలిక, కాంట్రాక్ట్ పద్ధతి ఉద్యోగాలు పెరిగి రెగ్యులర్, పర్మనెంట్ ఉద్యోగాలు తరిగిపోయాయి. ఇవన్నీ ప్రజల కొనుగోలు శక్తిని హరింపజేశాయి. ఇంకోపక్క మార్కెట్లోకి సరుకులు విపరీతంగా వచ్చిపడ్డాయి. ఈ సరుకులను కొనే శక్తి ప్రజలలో మెజార్టీకి లేకుండా పోయింది. ఎలాగైనా సరుకులను చెల్లగొట్టుకోడానికి రుణాలను పెంచారు. క్రెడిట్ కార్డులిచ్చారు. వినిమయతత్వాన్ని విచ్చలవిడిగా రెచ్చగొట్టారు. ఇచ్చిన అప్పులు వసూలుకాక ఆర్థిక సంస్థలు, తెచ్చిన అప్పులు తీర్చలేక ప్రజలు చతికిలబడ్డారు. ఫలితంగా కొమ్ములు తిరిగిన అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు దివాలా తీశాయి. స్టాక్ మార్కెట్ కుప్పకూలింది. మదింపుదార్లు లక్షల కోట్లు నష్టపోయారు. ఇప్పుడా దివాలాతీసిన కంపెనీలను తిరిగి నడిపించడానికి లక్షల కోట్ల ప్రజాధనాన్ని మళ్లిస్తున్నారు. ఉద్యోగులను కుదించి ఖర్చులు తగ్గిస్తున్నారు. విద్య, వైద్యం, పెన్షన్‌లు తదితర సంక్షేమ కార్యక్రమాలకు భారీ కోత పెడుతున్నారు. అంతే తప్ప సంక్షోభానికి మూల కారణమైన నయా ఉదారవాద విధానాలను, ప్రపంచీకరణ విధానాలను విడనాడేందుకు ప్రయత్నం చేయడం లేదు. సంక్షోభాన్ని సృష్టించిన పెట్టుబడి దారులను కాపాడటానికే బెయిల్ అవుట్ ప్యాకేజీల ప్రకటిస్తున్నారు. వారిని రక్షించడానికి ఉద్యోగులను, ప్రజలను బలిపెడుతున్నారు.

**మన వారికి ఆకుల్లో, అమెరికన్లకి కంచాల్లో వడ్డించే మన్మోహన్ :** మన్మోహన్ సింగ్ ప్రభుత్వం కూడ ఇదే తీరుగా వ్యవహరిస్తోంది. అంతేగాదు, మన దేశ ప్రయోజనాలను, ప్రజలను బలిపెట్టైనాసరే అమెరికన్ ప్రయోజనాలను,

అమెరికాలోని బహుళజాతి కంపెనీలను కాపాడటానికి యుపిఎ సర్కారు కంకణం కట్టుకుంది. ఇండియావంటి దేశాల నుండి హెచ్-1 వీసాలతో అమెరికాలో ఉద్యోగాలు చేసే వారిని తొలగిస్తేనే ప్రభుత్వ ఆర్థిక సహాయాన్ని కంపెనీలు పొందగలుగుతాయని అమెరికా అధ్యక్షుడు షరతులు విధించాడు. అమెరికాలో అమెరికన్ల ఉద్యోగాలు కాపాడాలని అమెరికా అధ్యక్షుడు ప్రయత్నించడంలో వింతేమీ లేదు. కాని మన ప్రధాని, మన ప్రభుత్వం మాత్రం మన ప్రజల్ని బలిపెట్టైనా అమెరికాకు సేవ చేయాలని ప్రయత్నిస్తున్నది. ఇదే మనం సహించరాని దుర్మార్గం.

రు. 4 లక్షల కోట్లకుపైగా ఖరీదు చేసే అణురియాక్టర్లను అమెరికా నుంచి కొనుగోలు చేయనుంది మన ప్రభుత్వం. పైగా ఆ రియాక్టర్లలో ఉపయోగించే యురేనియంను అమెరికా సరఫరా చేయాలంటే ఆదేశం పెట్టే నిబంధనలన్నింటినీ మనం అమలు చేసి తీరాల్సిందే. అమెరికా నుండి దిగుమతులని పెంచాలి. అమెరికా మన ఎగుమతులని తగ్గించినా కిమ్మనకూడదు. మన ఇన్స్యూరెన్స్, బ్యాంకింగ్ రంగాలలోకి అమెరికన్ ప్రైవేటు కంపెనీల పెట్టుబడులను పెట్టుకోడానికి అవకాశాలు పెంచాలి. అక్కడ దివాలా తీసిన ఆ కంపెనీలను ఇక్కడికి వచ్చి మన డిపాజిట్లను సమీకరించి తమ దేశాలకు యద్ధేచ్ఛగా తరలించుకుపోవడానికి వీలుగా రూపాయి పూర్తి మారకాన్ని అనుమతించాలి. అమెరికన్ కంపెనీలను మన ఆహార ధాన్యాల మార్కెట్‌లోకి, వ్యవసాయాలోకి, విద్యారంగంలోకి, రిటైల్ వ్యాపారంలోకి అనుమతించాలి. వేలకోట్లు వెచ్చించి అమెరికా నుంచి యుద్ధ పరికరాలను, ఆయుధాలను అవసరమున్నా లేకున్నా కొనాలి. వీటన్నింటికీ డబ్బులేకపోతే సంక్షేమ రంగాలకి కోత పెట్టాలి. ఇంకా చాలకుంటే ప్రపంచబ్యాంకు దగ్గర్నుండి (అంటే ఆ అమెరికానుండే) అప్పులు తేవాలి. ఆ విషమ షరతులని అమలు చేయాలి. ఈ దుర్మార్గాన్ని వ్యతిరేకించిన వామ పక్షాలను తోసిరాజని అవకాశవాద ఎంపీలను కొనుగోలు చేసి మరీ యుపిఎ ప్రభుత్వం బరితెగించి వ్యవహరిస్తోంది. ఈ విధానాల ఫలితంగానే విద్యా వైద్య రంగాలకు, సంక్షేమ రంగానికి, వ్యవసాయానికి, ఉపాధికల్పనకు నిధులు లేకుండా పోతున్నది. ఆహారధాన్యాల ధరలు అదుపులేకుండా పెరిగిపోతున్నాయి.

గత రెండు దశాబ్దాలుగా ఈ సరళీకరణ విధానాలను ఎదిరించి మనం పోరాడుతున్నాం. మన పోరాటాలకు, వామపక్షాలు యుపిఎ ప్రభుత్వంపై పెట్టిన వత్తిడి తోడైంది. ఫలితంగా ఒక మేరకైనా కార్మిక హక్కుల్ని, ప్రభుత్వ రంగ సంస్థల్ని ప్రభుత్వ ఆర్థిక రంగాన్ని కాపాడుకోగలిగాం. కనుకనే ఈ మేరకన్నా మిగిలి వున్నాం. యుపిఎ ప్రభుత్వ విధానాలే గనుక విచ్చలవిడిగా కొనసాగి వుంటే ఈ సంక్షోభ సమయంలో మన గతి అధోగతే.

**దేముడి పాలనలో రాష్ట్ర ఖజానా ఖాళీ :** రాష్ట్ర ఆర్థిక పరిస్థితి మరీ ఆందోళనకరంగా దిగజారింది. గత ఐదేళ్లలోనూ తాత్కాలికంగా వచ్చిన ఎకనామిక్ బూమ్ వలన మన రాష్ట్రానికి రెండు లక్షల కోట్ల రూపాయల అదనపు ఆదాయం వచ్చింది. ఆ సంపదను సద్వినియోగం చేయకుండా ప్రాజెక్టుల పేరుతో, రకరకాల పథకాల పేరుతో కైంకర్యం చేసేశారు. అవినీతి కుంభకోణాలలో వైఎస్ సర్కారు కొత్త రికార్డులు సృష్టించింది. రాష్ట్రాన్ని అభివృద్ధి చేయడానికి అవసరమైన అదనపు వనరులు సమకూరితే వాటిని దిగమింగి రాష్ట్రాన్ని శాశ్వతంగా అభివృద్ధికి దూరం చేసి అధోగతి పాలు చేశారు. ఈ సంవత్సరం రాష్ట్ర ఆదాయం రు. 30,000కోట్ల మేరకు పడిపోయింది. బిల్లులు చెల్లించడానికి నిధులు లేవు. ఖజానా ఖాళీ అయింది. ఇంత జరిగినా ఇంకా ఆ సరళీకరణ విధానాలే కొనసాగితే రాబోయే కాలంలో మన గతిఏమిటి? ప్రమోషన్లు ఇవ్వడానికి 25,000 ఉపాధ్యాయ పోస్టులను రద్దు చేసిన ప్రభుత్వం, రేషనలైజేషన్ పేరుతో మరిన్ని పోస్టులను కుదించడానికి సిద్ధంగా ఉంది. పిఆర్‌సి ఎలా అమలు జరుగుతుందో, డిఎస్సీలో ప్రకటించిన పోస్టులను భర్తీ చేస్తారో లేదో, లక్షలాది తాత్కాలిక, దినసరి కాంట్రాక్టు ఉద్యోగులు, విద్యావాలంటీర్ల గతి ఏం కానున్నదో తల్చుకోడానికే ఆందోళనకలిగిస్తోంది.

**మూడో కూటమి అవసరం :** ఈ పరిస్థితులలో ఈ సంక్షోభాన్ని పెంచే విధానాల నుంచి దారి మళ్లించి ఉపాధి కల్పన, మౌలిక వసతులకన్న, ప్రజా సంక్షేమం వైపు ప్రభుత్వాలను నడిపించే శక్తులను గెలిపించుకోవడం, మన కర్తవ్యం. యుపిఎ కూటమి వద ఆ విధానాలు లేవు. ఎన్డీయేను గెల్పించడమంటే ఎడం చెయ్యి తీసి పుర్రచెయ్యి పెట్టడం వంటిదే. అమెరికా భక్తిలో, ప్రైవేటీకరణ విధానాలలో యుపిఎ కన్న ఎన్డీయే ఇంకొక ఆకు ఎక్కువే చదివింది.

అందువల్ల మూడో శక్తి అవసరం. మొదటినుంచీ ప్రపంచీకరణ విధానాలను ఎదిరించి నిలవరించడానికి ప్రయత్నిస్తున్నవి వామ పక్షాలు. వాటి శక్తి మేరకు యుపిఎకు పగ్గం వేయడానికి కృషి చేశాయి. ఇక సాధ్యపడనప్పుడే మద్దతు ఉపసంహరించుకున్నాయి. వాటి మద్దతు పుణ్యమే గ్రామీణ ఉపాధి హామీ చట్టం. వాటి పుణ్యమే పెన్షన్ ప్రైవేటీకరణను ఇప్పటి వరకూ ఆపింది. మన జాతీయ బ్యాంకులను, ఇన్స్యూరెన్స్ రంగాన్ని కాపాడింది. ప్రజానుకూల ప్రత్యామ్నాయ విధానాలు వామ పక్షాల వద్దే ఉన్నాయి.

ఐతే వామ పక్షాలకు స్వతంత్రంగా మూడో శక్తిగా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగల బలం ప్రస్తుతం లేదు. కాని కొన్ని పార్టీలు ఈ వామపక్షాలతో కలిసి మూడో కూటమి ఏర్పాటుకు సంసిద్ధత వ్యక్తం చేస్తున్నాయి. ఆ ప్రాంతీయ పార్టీల గత చరిత్ర ప్రజావ్యతిరేక స్వభావం కలిగినట్టిదే. ఇప్పటికి కూడ ఆ పార్టీల వైఖరుల్లో మౌలికమైన మార్పులు వచ్చేశాయని అనుకోలేం. కాని ఇంగువ కట్టిన గుడ్డకు ఆ వాసన అబ్బినట్టు వామపక్షాలతో ఈ పార్టీలు కలిసి నడవాలనుకున్నప్పుడు తప్పనిసరిగా కొన్ని ప్రజానుకూల విధానాలు అనుసరించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. బుష్‌ను గాఢంగా ప్రేమించిన మన్మోహన్ సింగ్ చేతనే కొన్ని సానుకూల చట్టాలను, విధానాలను వామ పక్షాలు అమలు చేయించగలిగాయంటనే, అదీ వెలుపలి నుంచి మద్దత్తు ఇస్తూ చేయించగలిగాయంటే ఆ పార్టీలకున్న చేవ, సామాన్య ప్రజల పట్ల వాటికి ఉన్న నిబద్ధత అర్థం అవుతుంది. అటువంటప్పుడు మూడో కూటమికి కేంద్రంగా వామ పక్షాలు ఉండి, వాటితో కలిసి కొన్ని ఇతర పార్టీలు నడవడానికి సిద్ధమైనప్పుడు యుపిఎ, ఎన్డీయే కూటములకన్న నిస్సందేహంగా ఆ మూడో కూటమే మెరుగైనదవుతుంది. ప్రస్తుత కల్లోల ఆర్థిక సంక్షోభం నుంచి మనకు ఈ మూడో కూటమే ఏదో మేరకు ఊరట కలిగించగలుగుతుంది. మనం నడిపే ఉద్యమాలకు మెరుగైన ఫలితాలు వస్తాయి.

మూడో కూటమిని ఎద్దేవా చేస్తున్న వాళ్లు, అసలు మూడవ కూటమే సాధ్యం కాదంటున్నవాళ్లు, మూడో కూటమిలో చేరుతాయో లేదో చెప్పడానికి నిరాకరించిన వాళ్లు, ఆ తర్వాత మాటమార్చి నాలుగోకూటమి పెడతామన్న వాళ్లు ఎవరు! మనం ప్రపంచీకరణ విధానాలపై, ప్రభుత్వ వ్యతిరేక విధానాలపై పోరాడుతున్నప్పుడు, ప్రభుత్వం మనపై దుర్నీతిని, దమనకాండను ప్రయోగిస్తున్నప్పుడు, వీరంతా ఎటువైపు ఉన్నారో! ఎవరిని సమర్థించారో పరిశీలిస్తే వీరి అసలు రంగేమిటో మనకు అర్థ మౌతుంది.

నమ్మకమైన మిత్రుల బలాన్ని పెంచాలి : వామపక్షాలు అన్ని వేళలా మనతో ఉన్నాయి. మన కష్టాలను తమవిగా భావించి స్పందించాయి. మన ఉద్యమాలకు తోడునీడగా నిలిచినడిచాయి. ఇప్పుడు ఆ పార్టీలను బలోపేతం చేయడం, చట్ట సభల్లో వాటి సంఖ్యా బలాన్ని పెంచడం మన కనీస కర్తవ్యం. రానున్న రోజుల్లో మనం ఈ ఆర్థిక సంక్షోభం తాకిడిని తట్టుకొని నిలవాలంటే వామ పక్షాలు కేంద్రంగా ఉండి ఏర్పడే మూడో కూటమిని జాతీయ స్థాయిలో బలోపేతం చేయడం మన అవసరం. మనకే అవసరం.

నిత్యం పాఠాలు చెప్పే మన ఉపాధ్యాయులు రానున్న ఎన్నికలలో దేశాన్ని, రాష్ట్రాన్ని ప్రజా సంక్షేమం వైపు నడిపించే శక్తులను, మూడో కూటమిని గెలిపించాలి. 'వీళ్లు బతకలేని బడిపంతుళ్లు కారు; బతుకుతెరువును కాపాడే మార్గాన్ని చూసే బడిపంతుళ్లు' అని సోదర సామాన్య ప్రజలు అనుకునేలా చేయాలి.

*

## పాఠకులకు గమనిక

యుటియఫ్ 11వ రాష్ట్ర మహాసభలను పురస్కరించుకొని మార్చి నెల ఐక్య ఉపాధ్యాయ ప్రత్యేక సంచికగా ఎక్కువ పేజీలతో ఆలస్యంగా వెలువడింది. అందువలన ఏప్రిల్ నెల పత్రికను వెలువరించలేకపోతున్నాము. మే నెల పత్రిక యధావిధిగా మే 12 తేదీన పోస్ట్ చేయబడుతుంది. కావున పాఠకులు, చందాదారులు గమనించాలని కోరుతున్నాము.

# పాఠశాల విద్య - అభ్యసనలో ఇబ్బందులు

Public Report on Basic Education (PROBE) పబ్లిక్ రిపోర్టు బృంద సభ్యులైన A.De., J. Dreze, M. Samson మరియు A.K.Shiva Kumar లు పాఠశాల విద్యావిధానంపైన నిర్వహించిన సర్వేలోని విషయములు ఫిబ్రవరి 20న హిందూ పత్రికలో ప్రచురించబడ్డాయి. ఆ వ్యాసాన్ని ప్రకాశం జిల్లా వలేటివారిపాలెంలో ఉపాధ్యాయులు జి. నరసింహాచారి అనువదించారు. దానిన యదాతథంగా ప్రచురిస్తున్నాము.



జి. నర్సింహాచారి
ప్రకాశం జిల్లా

నిత్యం తిరుగుతున్న బస్సులు, రైళ్ళలో సగం వరకు ఒక రోజు రద్దయినాయనుకోండి. అలాగే ప్రతిరోజు రద్దయినాయనుకోండి. ఏమౌతుంది? మీరు విమాన ప్రయాణం చేయగలిగితే తప్ప ఊహించుకోవటానికే భయంగా ఉంది కదూ. ఉత్తర భారత దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో గల పాఠశాలల్లో సగటున సగంపైగా పాఠశాలల్లో బోధనే జరగడం లేదంటే విద్యార్థుల నిత్య జీవితంలో ఎంత అన్యాయం జరుగుతుందో చూడండి.

**అనుకూల మార్పులు :-** PROBE బృంద సభ్యులు 1996-97లో బీహార్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ మరియు ఉత్తర ప్రదేశ్‌లలోని 200 గ్రామాలలో గల పాఠశాలలను సర్వే చేయడం జరిగింది. పది సంవత్సరాల వ్యవధిలో వచ్చిన మార్పులను గమనించడానికి తిరిగి అదే బృందం 2006లో కూడా అవే పాఠశాలలను సందర్శించడం జరిగింది. వారు గమనించిన వాటిలో అనుకూల మార్పులు

1. 6 నుండి 12 సంవత్సరాల మధ్య వయస్సుగల బాలబాలికలలో పాఠశాల నమోదు 80 నుండి 90 శాతం వరకు పెరిగింది. సార్వత్రిక పాఠశాల భాగస్వామ్య గమ్యం అందుబాటులో ఉంది.
2. సాంఘిక అసమానతలు బాగా తగ్గాయి. బాలబాలికల మధ్య అంతరం ప్రాథమిక పాఠశాలల్లో పూర్తిగా తొలగింది. షెడ్యూల్డ్ కులాల, ముస్లిం విద్యార్థుల నమోదు 95 శాతం వరకు పెరిగింది. షెడ్యూల్డ్ తెగల విద్యార్థుల నమోదు 89 శాతం మాత్రమే ఉంది.
3. పాఠశాల భౌతిక వనరులు బాగా పెరిగినాయి. 1996లో రెండు పక్కా గదులు కలిగిన పాఠశాలలు 20% కాగా అవి 2006 నాటికి 84 శాతం వరకు పెరిగాయి. 3/4 వంతు పాఠశాలల్లో త్రాగునీటి సౌకర్యం ఉంది. 60 శాతం పాఠశాలల్లో టాయిలెట్ సౌకర్యం ఉంది.
4. 1996లో 10% మంది విద్యార్థులకు మాత్రమే పాఠశాల యూనిఫామ్ ఉండగా 2006లో అది 50% వరకు పెరిగింది. 1996లో 50% విద్యార్థులకు మాత్రమే ఉచిత పాఠ్య పుస్తకాలు ఇవ్వగా అది 2006లో 100% మంది విద్యార్థులకు పంపిణీ చేయడం జరిగింది.
5. మధ్యాహ్న భోజన పథకం 84% పాఠశాలలకు అందుబాటులో ఉంది. ఈ పథకం అమలు బీహార్ రాష్ట్రంలో బాగా వెనుకబడి వుంది. 2006లో ఈ సర్వే చేపట్టే నాటికి ఇంకా అమలుకు నోచుకోలేదు.

ఆర్థిక పెరుగుదల, తల్లిదండ్రుల అక్షరాస్యత, గ్రామీణ ప్రాంత అభివృద్ధి ఈ మార్పుకు కారణంగా కనబడుతున్నాయి. సర్వశిక్షా అభియాన్, మధ్యాహ్న భోజన పథకంపై సుప్రీం కోర్టు ఉత్తర్వులు, 'అందరికీ విద్య'పైన అవగాహన లాంటివి ఈ సార్వత్రిక ప్రాథమిక విద్యను బలోపేతం చేయడానికి ప్రధాన పాత్ర పోషించాయని చెప్పవచ్చు.

గత పది సంవత్సరాలలో పాఠశాల విద్యా విధానంలో చాలా మార్పులు వచ్చాయి. కానీ భారతీయ విద్యార్థుల్లో చాలా మంది సరియైన నాణ్యతగల విద్యను పొందలేకపోతున్నారు. దీనిని ఆపవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**తరగతి గదులలో స్థబ్ధత:-** భారతీయ విద్యార్థులలో అత్యధిక శాతం మందికి నాణ్యమైన విద్య అందటం లేదనే విషయం మనము మరువకూడదు. పాఠశాల నమోదుకు, రోజువారీ హాజరుకు చాలా తేడా ఉంటున్నది. దాదాపు ప్రతిచోట రోజువారీ హాజరు, పాఠశాల నమోదు కంటే చాలా తక్కువగా ఉంటున్నది. పరిశీలకులు గమనించినప్పుడు వాస్తవ హాజరు శాతం ఇంకా చాలా తక్కువగా వుంది.

తరగతి గదులలో విద్యా బోధన చాలా తక్కువగా వుంది. ఉపాధ్యాయుల కొరత ఒక సమస్యగా కనబడుతుంది. ఉపాధ్యాయుల నియామకాలు చేపట్టినప్పటికీ ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిలో పెరుగుదల చాలా తక్కువగా వుంది. దాదాపు 12 శాతం పాఠశాలలు ఏకోపాధ్యాయునితోనే నడుస్తున్నాయి. 2006లో సర్వే చేసినప్పుడు 21 శాతం పాఠశాలలు ఒకే ఒక ఉపాధ్యాయునితో నడుస్తున్నాయి. ఉపాధ్యాయుల గైర్హాజరు కూడా ఒక కారణముగా ఉన్నది. ఉపాధ్యాయులు ఆలస్యంగా పాఠశాలకు రావటము మరియు సమయమునకు ముందే పాఠశాలకు విడిచి వెళ్ళడం అనేది వాస్తవంగా కనబడుతున్నది. ఒక వేళ పాఠశాలకు హాజరైనప్పటికీ వారు బోధన చేయడం లేదు. 1996లో మరియు 2006లో రెండుసార్లు పరిశీలకులు వచ్చినప్పుడు కూడా సగం పాఠశాలల్లో విద్యా బోధన జరగడం లేదని గుర్తించారు.

విద్యాబోధన జరిగిన తరగతి గదులలో విద్యార్థులు సాధించిన ఫలితములు చాలా తక్కువగా ఉన్నాయి. బోధనా పద్ధతులలో ఇప్పటికి కూడా బట్టీ పట్టించడం, గణిత పట్టికలు వల్లెవేయుట, పాఠ్యాంశ అవగాహన లేకుండా అప్పచెప్పుట వంటివి ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. ఆశ్చర్యకరమైన అంశమేమిటంటే చాలా పాఠశాలల్లో విద్యార్థులు నేర్చుకున్నది చాలా స్వల్పంగా ఉంది. ఉదాహరణకు 4,5 తరగతుల విద్యార్థులలో సగం మంది ఒక అంకె గుణకారం కానీ లేదా ఏదైనా అంకెను 5తో భాగహారం చేయటం కానీ చేయలేని స్థితిలో నున్నారు.

**కొనసాగుతున్న ప్రయత్నాలు :-** ఈ సమస్యలను అధిగమించడానికి ఎన్నో రకాల ప్రయత్నాలు చేసినప్పటికీ అతి తక్కువ ఫలితాలను మాత్రమే సాధించడం జరిగింది. అందులో ఒకటి కాంట్రాక్టు ఉపాధ్యాయుల నియామకం. ఉపాధ్యాయుల సంఖ్యను పెంచడానికి రాష్ట్ర ప్రభుత్వాలు తక్కువ ఖర్చుతో అనుసరిస్తున్న విధానము ఇది. మొత్తం ఉపాధ్యాయులలో 40% మంది కాంట్రాక్టు ఉపాధ్యాయులు ఉన్నారు. వారి నియామకాలు కాంట్రాక్టు పద్ధతిపై ఉండటం, గ్రామ పంచాయితీల ద్వారా ఎంపిక కాబడి స్థానికులు కావడం వంటి అంశాలు మిగిలిన ఉపాధ్యాయుల కన్నా ఎక్కువ ఫలితాలు సాధిస్తాయి అనుకున్నప్పటికీ అది సాధ్యం కాలేదు. సరియైన శిక్షణ లేకపోవడం, తక్కువ వేతనాలు వంటి అంశాలు వారి బోధనలో నాణ్యత లేకుండా చేశాయి. కొన్ని పాఠశాలల్లో వీరి బోధన పర్మినెంట్ ఉపాధ్యాయుల కన్నా నాణ్యతగా ఉన్నప్పటికీ కొన్ని పాఠశాలల్లో గ్రామాల్లో వారికున్న పలుకుబడి వల్ల సరిగా బోధించక బోధనలో నాణ్యత కొరవడింది.

పాఠశాలల్లో నాణ్యతను పెంచడానికి సమాజ భాగస్వామ్యం మరియు పాఠశాల నిర్వహణ వికేంద్రీకరణ తోడ్పడతాయి. PROBE నిర్వహించిన సర్వేలో చాలా పాఠశాలల్లో గ్రామ విద్యా కమిటీ లేదా దానికి సమానమైన కమిటీలు ఉన్నాయి. చాలా సందర్భాల్లో ఇవి పాఠశాల భౌతిక వనరుల కల్పన, కాంట్రాక్టు ఉపాధ్యాయుల నియామకం, మధ్యాహ్న భోజన పథక పరిశీలన వంటి అంశాల్లో ప్రధానపాత్ర పోషించినప్పటికీ, బోధనా నాణ్యతను పెంచటంలో విఫలమైనాయి. చాలా చోట్ల గ్రామ సర్పంచ్ మరియు పాఠశాల ప్రధానోపాధ్యాయుడు మాత్రమే ప్రధానపాత్ర పోషిస్తున్నారు. Parent Teacher

తరువాయి 12వ పేజీలో

# యుటియఫ్ బలపరచిన ఎమ్మెల్సీల ఘన విజయం



రాష్ట్రంలో ఫిబ్రవరి 6న ఎన్నికలు జరిగిన 2 ఉపాధ్యాయ, 2 గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీల స్థానాలలో యుటియఫ్ బలపరచిన అభ్యర్థులు 3 స్థానాలలో ఘన విజయం సాధించారు. కృష్ణా, గుంటూరు జిల్లాల ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి యుటియఫ్ అభ్యర్థి కె.ఎస్. లక్ష్మణరావు, ప్రైవేటు విద్యా సంస్థల ప్రతినిధి కె.వి. రంగారావుపై రికార్డు స్థాయిలో 5697 ఓట్ల భారీ మెజార్టీతో మొదటి లెక్కింపులోనే విజయం సాధించారు. ప్రధానోపాధ్యాయుల సంఘం, ఎన్‌టియు, టిఎన్‌యుఎన్, వ్యాయామోపాధ్యాయుల సంఘం, గురుకుల పాఠశాల ఉపాధ్యాయ సంఘాలు మరియు కళశాల అధ్యాపక సంఘాలు తదితర సంఘాలు లక్ష్మణరావుకు మద్దతునిచ్చాయి. ఏపిటిఎఫ్ (257), డిటిఎఫ్‌లు రంగారావును బలపరిచాయి. ఏపిటిఎఫ్(1938) అభ్యర్థి జి. సత్యనారాయణకు 261 ఓట్లు లభించాయి.

2007లో జరిగిన ఎన్నికలలో మంచి మెజార్టీతో గెలిచిన లక్ష్మణరావు ఈ ఎన్నికలలో అంతకుమించిన స్థాయిలో ఉపాధ్యాయులు మద్దతును సాధించి దాదాపు 78% ఓట్లతో శాసనమండలి చరిత్రలోనే రికార్డు సృష్టించారు.

మహబూబ్‌నగర్-రంగారెడ్డి-హైదరాబాద్ జిల్లాల పట్టభద్రుల నియోజక వర్గం నుండి యుటియఫ్‌తోపాటు పలు ప్రజా సంఘాలు, వివిధ రాజకీయ పార్టీలు బలపరచిన ప్రముఖ మీడియా విశ్లేషకులు డా॥ కె. నాగేశ్వర్ తిరిగి 436 ఓట్ల మెజార్టీతో బిజెపి అభ్యర్థి కె.ఎస్. రామచందర్‌రావుపై విజయం సాధించారు. పట్టభద్రులు ఓటింగ్ పట్ల ఆసక్తి చూపకపోవడం వల్ల ఈ నియోజక వర్గంలో అతి తక్కువ పోలింగ్ జరిగింది. బిజెపి మతోన్మాదాన్ని రెచ్చగొట్టి నాగేశ్వర్‌పై వ్యక్తిగత దుష్ప్రచారాన్ని నిర్వహించింది. వీటన్నింటినీ త్రోసిరాజని నాగేశ్వర్‌ను గెలిపించడం ద్వారా ఓటర్లు లౌకిక, ప్రజాస్వామిక ఉద్యమాలకు ఊతమిచ్చారు.



వరంగల్-ఖమ్మం-నల్లగొండ జిల్లాల పట్టభద్రుల నియోజకవర్గం నుండి యుటియఫ్, మహా కూటమి బలపరచిన టిఆర్ఎస్ అభ్యర్థి కపిలవాయి దిలీప్ కుమార్ తిరిగి ఎన్నికయ్యారు. ఆయన బిజెపి అభ్యర్థి అశోక్ రెడ్డిపై 22,233 ఓట్ల భారీ మెజార్టీ సాధించారు.

ఉభయగోదావరి జిల్లాల ఉపాధ్యాయ ఎమ్మెల్సీగా యుటియఫ్ అభ్యర్థి సిహెచ్. సుభాష్‌చంద్రబోస్‌పై 313 ఓట్ల స్వల్ప ఆధిక్యంతో కార్పొరేట్ అభ్యర్థి (జాక్టో & కాంగ్రెస్ పార్టీల ఉమ్మడి అభ్యర్థి) కెవిపి సత్యనారాయణ రాజు ఎన్నికయ్యారు. ఉపాధ్యాయ ఉద్యమాలతో ఏ మాత్రం సంబంధం లేని అభ్యర్థి ఎన్నికలలో గెలుపు కోసం కోట్లాది రూపాయాలను ఖర్చు చేసి వెండి గ్లాసులు, డబ్బును విచ్చిలవిడిగా పంపిణీ చేసి ఓటర్లను ప్రలోభ పెట్టి ఉపాధ్యాయుల ఆత్మగౌరవాన్ని దిగజార్చినట్లు ప్రచారం జరుగుతున్నది. ఈ నియోజక వర్గంలో డిటిఎఫ్, ఎస్ఎల్‌టిఏ, రెసిడెన్షియల్ పాఠశాలల ఉపాధ్యాయ సంఘాలు సంపూర్ణంగాను, కళాశాల అధ్యాపక సంఘాలు, హెచ్ఎంఏ, పిఇటిఏలు పాక్షికంగాను సుభాష్ చంద్రబోస్‌కు మద్దతు తెలిపాయి.

# భగత్‌సింగ్ జీవితం - పోరాటం

## (23.03.2009 భగత్‌సింగ్ వర్ధంతి సందర్భంగా...)



ఎం. నిర్మల్ కుమార్
సత్తుపల్లి, ఖమ్మం

మన దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడి తమ ప్రాణాలతో సహా సర్వస్వాన్ని త్యాగం చేసిన ఎందరో మహనీయులలో భగత్‌సింగ్ విశిష్టుడు. కేవలం బ్రిటీష్ వారి పరిపాలనను అంతమొందించి భారతీయుల పరిపాలనను నెలకొల్పడం మాత్రమే లక్ష్యంగాకాక, దోపిడికి, అసమానతలకు, వెనుకబాటు తనానికి తావులేని స్వతంత్ర భారతాన్ని స్థాపించేందుకు ప్రయత్నించిన విప్లవ కారుడు భగత్‌సింగ్. భారత జాతీయోద్యమానికి "విప్లవం వర్ధిల్లాలి" అనే నినాదాన్నిచ్చి దాన్ని విస్తృతంగా జనబాహుళ్యంలో ప్రచారం చేసాడు. అసమాన ధైర్యంతోనూ, ధృడ సంకల్పంతోనూ రాజకీయ పరిణితితోనూ, శాస్త్రీయ దృక్పధంతోనూ ఆనాటి విప్లవకారులను, జాతీయ నాయకులను, ప్రజలను గొప్పగా ప్రభావితం చేసిన వీరుడు భగత్‌సింగ్. ఆనాటి బ్రిటీష్ సామ్రాజ్య వాదులు ఇతనిని హింసావాదిగా చిత్రించి కళంకితుణ్ణి చేయాలని ప్రయత్నించినా "షహీద్ ఎ ఆజమ్" (అమర వీరులలో అగ్రగణ్యుడు)గా నీరాజనాలందుకున్న దేశ భక్తుడు భగత్‌సింగ్. రాజకీయ జీవితం మొత్తం ఏడేళ్ళే అయినా (1924-31) ఈ కొద్ది సమయంలోనే చిరస్మరణీయ జీవితాన్ని గడిపి భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ధృవతారగా నిలిచినవాడు భగత్‌సింగ్.



భగత్‌సింగ్‌కు దేశభక్తిని ప్రేరేపించే ఘనమైన కుటుంబ నేపథ్యం ఉంది. 2 సెప్టెంబర్ 1907న పంజాబ్ రాష్ట్రంలో బంగా గ్రామంలో ఇతడు జన్మించాడు. భగత్‌సింగ్ తాత అర్జున్‌సింగ్ కుల, మత, స్వార్థ సంకుచిత భావాలకు అతీతమైన వ్యక్తి. లాలాలజపతిరాయ్, మహాత్మా హంసరాజ్ వంటి ప్రముఖ నాయకులతో వీరికి సన్నిహిత సంబంధాలుండేవి. భగత్‌సింగ్ జన్మించే నాటికే తండ్రి కిషన్‌సింగ్ దేశ బహిష్కరణ శిక్ష వల్ల నేపాల్‌లో ఉన్నాడు. పిన తండ్రి అజిత్‌సింగ్ బర్మాలో మాండలే జైలులో శిక్ష అనుభవిస్తున్నాడు. మరో పిన తండ్రి స్వరణ్‌సింగ్ రాజద్రోహిగా ప్రకటింపబడి జర్మనీలో ప్రవాసిగా నున్నాడు. ఈ ముగ్గురికీ గదర్ వీరులతో సంబంధాలున్నాయి. తాత అర్జున్‌సింగ్ వ్యక్తిత్వంలోని నిరాడంబరత్వం, ధైర్య గుణం, విశాల మనస్తత్వం భగత్‌సింగ్ పసి మనస్సుపై ముద్ర వేశాయి. విద్యార్థిగా ఉన్న సమయంలో జలియన్ వాలాబాగ్ మారణకాండ, గదర్ ఉద్యమాల ప్రభావం ఇతనిపై తీవ్రంగా పడింది. 1915 నవంబర్ 16న ఉరితీయబడ్డ గదర్ వీరుడు కర్తార్‌సింగ్ ఫోటో జీవితాంతం ఇతని జేబులో ఉండేది. జలియన్ వాలా బాగ్ మారణకాండ జరిగినప్పుడు భగత్‌సింగ్ 7వ తరగతి చదువుతున్నాడు. ఆ సంఘటన జరిగినప్పుడు ఇతని హృదయం ఆవేశంతో రగిలిపోయింది. వెంటనే అమృతసర్ చేరుకొని ఆ ప్రదేశంలో అమరవీరుల రక్తంతో తడిసిన కొంత మట్టిని ఒక సీసాలో భద్రపర్చి ఇంటికి తెచ్చాడు. దాన్ని పూజగదిలో ఉంచి ప్రతిరోజూ ఉదయం పూలతో పూజించేవాడు. 9వ తరగతి చదువుతున్నప్పుడే స్కూల్ మాని 1921 నాటి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు. గాంధీజీ ఆ ఉద్యమాన్ని విరమించినప్పుడు చిత్తరంజన్‌దాస్, లాలాలజతిరాయ్, మోతీలాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్ వంటి నాయకులు ఈ నిర్ణయాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. భగత్‌సింగ్ కూడా గాంధీ నిర్ణయంతో విభేదించాడు. మన జాతీయ నాయకులు నడుపుతున్న నేషనల్ కాలేజీలో చదువుతున్నప్పుడే ఫ్రాన్స్, ఇటలీ, రష్యా విప్లవాల గురించి, తత్వ శాస్త్రాన్ని, సామాజిక శాస్త్రాలను అధ్యయనం చేశాడు. ఈ కాలేజీలోనే భగత్‌సింగ్‌కు సుఖదేవ్, భగవతీచరణ్ వంటి విప్లవ కారులతో పరిచయం ఏర్పడింది.

యవ్వనంలోకి ప్రవేశించిన భగత్‌సింగ్‌కు పెళ్ళి చేయాలని కుటుంబ సభ్యులు చేస్తున్న ప్రయత్నాలను వ్యతిరేకించి ఇతడు జాతీయోద్యమంలో పాల్గొనేందుకు కాన్పూర్ వెళ్ళి పోయాడు. మాతృదేశం బానిసత్వంలో మగ్గుతున్నంత కాలం పెళ్ళి చేసుకోననీ, అలా చేసుకోవాల్సి వస్తే మృత్యువే పెళ్ళి కూతురని సిన్హాతదితర విప్లకారులతో కలిసి రాజకీయ కార్యకలాపాలు సాగించసాగాడు. ఓ వైపు దిన పత్రికలు అమ్మడం ప్రెస్‌లో పని చేయడం, నేషనల్ స్కూల్‌లో పాఠాలు బోధించటం వంటి పనులు చేస్తూ మరో వైపు చుట్టు ప్రక్కల గ్రామాల విద్యార్థులను, యువకులను సంఘటితపర్చ సాగాడు. భగత్‌సింగ్ ఆలోచనలు, ప్రణాళికలు కేవలం రాజకీయ పోరాటాలపైనే కాకుండా సంఘ సంస్కరణోద్యమాలపై కూడ ఉండేవి. సిక్కులలోని మహంతుల నియంతృత్వ అధికారాలకు వ్యతిరేకంగాసాగే ఉద్యమంలో కూడా పాల్గొన్నాడు. మిత్రులతో కలిసి కాన్పూర్‌లో "నౌజవాన్ భారత సభ" స్థాపించాడు. ఈ సమయంలోనే పోలీసులు ఇతన్ని అరెస్ట్ చేసి నిర్బంధించారు. అప్పటికే ఉత్తర ప్రదేశ్‌లో చంద్ర శేఖర్ ఆజాద్ నాయకత్వాన "హిందుస్థాన్ రిపబ్లికన్ ఆర్మీ" పని చేస్తుండేది. కాకోరీ వద్ద రైలులో వస్తున్న ట్రెజరీని దోచుకున్నందుకుగానూ బ్రిటీష్ ప్రభుత్వం కాకోరీ కుట్ర కేసు పెట్టి అష్ఫఖుల్లాఖాన్, రాంప్రసాద్ బిస్మిల్‌లను ఉరి తీసింది. ఈ నేపథ్యంలోనే భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్‌ను కలుసుకొని దేశ వ్యాపితంగా పని చేస్తున్న విప్లవ సంస్థలన్నింటిని ఏకతాటిపైకి తెచ్చేదాన్ని గూర్చి చర్చించాడు. ఫలితంగానే 1928లో ఢిల్లీ కేంద్రంగా ఆజాద్ సర్వసేనానిగా "హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ"ని స్థాపించారు. సోషలిజం తమ లక్ష్యమని ఈ సంస్థ ప్రకటించింది. మనుషులందరికీ కుల, మత, ప్రాంత, లింగ,వర్గ తారతమ్యాలకు అతీతంగా సమాన అవకాశాలు కల్పించే యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఇండియా అనే రిపబ్లిక్‌ను స్థాపించాలని వీరు ప్రకటించారు. కేవలం ఈ సంస్థ ఒక జాతీయ పార్టీ మాత్రమే కాదనీ, అంతర్జాతీయ లక్ష్యాలతో కార్యక్రమాన్ని ప్రకటించారు. ఈ చారిత్రక ప్రకటనను పసుపురంగు కాగితంపై ముద్రించడంతో ఇది "ఎల్లోపేపర్"గా ప్రసిద్ధిగాంచింది. ఈ ఎల్లోపేపర్ భారత జాతీయోద్యమంలో నూతన తరహా రాజకీయాలకు దిక్సూచి వంటిది. "విప్లవం అంటే బాంబులు, పిస్తోళ్ళు, రక్తపాతంతో కూడిన సంఘర్షణ కాదనీ, ఎలాంటి వ్యక్తిగత ఆకాంక్షలకు, రాగద్వేషాలకు తావులేని పోరాటమని, అన్యాయం పునాదిగా ఉన్న ఈ వ్యవస్థను మార్చడమని, విదేశీ దోపిడినుండేగాక, భాగస్వామ్య మరియు పెట్టుబడిదారీ దోపిడి నుండి కూడా దేశం విముక్తి కావాలని" ఈ సంస్థ ప్రకటించింది.

సైమన్ కమీషన్ వ్యతిరేక ఉద్యమంలో జరిగిన లాఠీ ఛార్జీలో గాయపడి లాహోర్‌లో లాలాలజపతిరాయ్ మరణించినప్పుడు, భారత జాతి దానిని అవమానంగా భావించి ఊగిపోయింది. దేశబంధు చిత్తరంజన్‌దాస్ సతీమణి బసంతీదేవి "ఈ అవమానానికి మన వద్ద సమాచారం లేదా?" అంటూ

లాలాజీ చితివద్ద రోదించింది. ఈ అవమానానికి సమాధానం చెప్పాలని హెచ్ఎస్ఆర్ఏ నిర్ణయించి జనరల్ సాండర్స్‌ను కాల్చి చంపింది. సాండర్స్ హత్య దేశంలో సంచలనం సృష్టించింది. అప్పుడు వీరొక ప్రకటన చేశారు. "ఒక మనిషిని హత్య చేయడం బాధాకరమే అయినా ప్రజల ఆత్మీయ నాయకుడు లాలాజీ చంపబడటం భారత పౌరుషానికి ఒక సవాల్. బ్రిటీష్ వారి నీచపు అన్యాయపు పరిపాలనకు ప్రతి రూపంగా ఉన్న ఇట్లాంటి అధికారులను తొలగించడం అవసరం" అని ఈ సంస్థ ప్రకటించింది. ఈ పరిణామాల తర్వాత నిఘా ఎక్కువ కావడంతో వీరు లాహోర్‌ను వదిలివెళ్ళాలని నిర్ణయించారు. భగత్‌సింగ్ సూటు, బూటు ధరించి ఒక ఆఫీసర్‌లాగా, మరో విప్లవ కారుడు భగవతీ చరణ్ భార్య శ్రీమతి దుర్గాదేవి భగత్‌సింగ్ భార్యలాగా, రాజగురు నౌఖరులాగా, ఆజాద్ ఒక సన్యాసిలాగా మారు వేషాలలో తప్పించుకున్నారు.

1929లో బ్రిటీష్ ప్రభుత్వం పార్లమెంట్‌లో పారిశ్రామిక వివాదాల బిల్లు, పబ్లిక్ సేఫ్టీ బిల్లు అనే రెండు నల్ల చట్టాలను ఆమోదించాలని సంకల్పించింది. ఈ చట్టాల వెనుకున్న దమననీతిని ప్రజలకు తెల్పేందుకు, భారతీయుల అసమ్మతిని బ్రిటీష్ వారికి తెల్పేందుకు "చెవిటి వారికి కూడా వినపడేలా" పార్లమెంట్‌లో ఎవరూలేని చోట బాంబులు వేయాలని హెచ్ఎస్ఆర్ఏ నిర్ణయించింది.

భగత్‌సింగ్, బటుకేశ్వర దత్‌లు పార్లమెంట్‌లో బాంబులు విసిరి, కరపత్రాలు వెదజల్లి విప్లవం వర్ధిల్లాలి అంటూ నినదిస్తూ స్వచ్ఛందంగా అరెస్టయ్యారు. దీనికి గానూ వీరికి యావజ్జీవ శిక్ష విధించబడింది. వీరు జైలులో ఉండగానే సాండర్స్ హత్య కేసును తిరగదోడి వీరిపై లాహోర్ కుట్రకేసును ప్రారంభించారు. భగత్‌సింగ్ అతని సహచర విప్లవకారులు జైలును, కోర్టులను పోరాట కేంద్రంగా మార్చారు. జైలు జీవితంలో భగత్‌సింగ్ మూడు పద్ధతుల్లో పోరాటాలు నిర్వహించాడు. కోర్టులలో బ్రిటీష్ ప్రభుత్వ దమన నీతిని ఎండగడుతూ ప్రజలను చైతన్యవంతులను చేయడం. జైళ్ళలో ఉన్న రాజకీయ ఖైదీల హక్కుల కోసం పోరాడటం. మూడోది అధ్యయనం, రచనలు చేయడం. రాజకీయ ఖైదీల హక్కుల కోసం పోరాడుతూ జతిన్‌దాస్ జైలులో మృతి చెందాడు. 114 రోజుల భగత్‌సింగ్ దీక్ష ఫలితంగా బ్రిటీష్ ప్రభుత్వం వీరి డిమాండ్స్‌ను పరిష్కరించింది. భగత్‌సింగ్ జైలు జీవితకాలంలోనే ప్రపంచ ప్రఖ్యాత విప్లవ కారుల, తత్వవేత్తల, మేధావుల రచనలను అధ్యయనం చేశాడు. వ్యాసాలు లేఖలు వ్రాయడం, బంధువులకు, మిత్రులకు పంపడం ఇతని వ్యాపకంగా ఉండేది. ఆ కాలంలోని ఇతని రచనలన్నీ ఇతని తమ్ముని కూతురు సింధు (బిబిసి -లండన్) సంపాదకత్వాన సంకలనం చేయబడ్డాయి. ఆ కాలంలోనే భగత్‌సింగ్ వ్రాసినట్లు చెప్పబడుతున్న సోషలిస్టు సిద్ధాంతము, ఆత్మకథ, మృత్యుముఖం. భారత విప్లవోద్యమ చరిత్ర అనే నాలుగు రచనలు దొరకలేదు. ఆనాటి ఇతని రచనలలో ప్రధానంగా విప్లవం, సోషలిజం, మతము, నైతిక విలువలు, కళలు, సంస్కృతి, లిపి, భాష, అహింస, హేతువాదం, దళిత సమస్య, ప్రేమ తదితర విషయాలు లోతుగా చర్చింబడ్డాయి. భగత్‌సింగ్ ఎంతటి తాత్విక స్పష్టత, మేధోపరిపక్వత కలిగిన నాయకుడో ఈ రచనలు తెల్పుతున్నాయి. వీరికి ఉరిశిక్ష ఖాయమైన తర్వాత భగత్‌సింగ్ తండ్రి క్షమాభిక్ష కోరదామంటాడు. "మీ వంటి దేశభక్తులకు అది తగిన ఆలోచనకాదని, ఈ బలహీనతను తాను అర్థం చేసుకోలేక పోతున్నానని" ఆ ప్రతిపాదనను తిరస్కరిస్తాడు. ఉన్నత ఆశయాలను బలిపెట్టి రక్షించుకోవాల్సినంత విలువ తమ జీవితాలకు లేదంటాడు. "యువకుల చైతన్యపూరిత తిరుగుబాటుకు భగత్‌సింగ్ ప్రతీక అనీ, ఇతను రగిలించిన చైతన్యం దేశాన్ని ఆ చివర నుండి ఈ చివరి వరకు ఉత్తేజపర్చిందని, ఈ చైతన్యం రగిల్చిన అగ్ని కణాలు ఎన్నటికీ చల్లారవని నేతాజీ సుభోష్‌చంద్రబోస్ వ్యాఖ్యానించారు. ఉరితీసే రోజు అతన్ని తీసుకువెళ్ళటానికి బ్రిటీష్ అధికారి వచ్చేసరికి భగత్‌సింగ్ లెనిన్ రచించిన పుస్తకాన్ని చదువుతున్నాడు. ఆ అధికారి ఉరికి సిద్ధం కమ్మని కోరగా, "కొద్దిగా ఆగండి ఇద్దరు విప్లవ కారులు చర్చించుకుంటున్నారు" అని కోరి ఆ రచనను చదవటం పూర్తి చేసి బయలు దేరతాడు భగత్‌సింగ్. అతని స్థిత ప్రజ్ఞతను చూసి ఆ అధికారి నిశ్చేష్టుడయ్యాడు. భగత్‌సింగ్, రాజగురు సుఖదేవ్‌ల కంఠాలకు ఉరితాళ్ళు బిగుసుకొనే ముందు భగత్‌సింగ్ అక్కడున్న బ్రిటీష్ మెజిస్ట్రేట్‌నుద్దేశించి "భారత విప్లవకారులు మహోన్నత ఆదర్శం కోసం నవ్వుతూ మృత్యువునెలా కౌగిలించుకుంటారో చూసే భాగ్యం మీకు కలిగిందని" వ్యాఖ్యానిస్తాడు భగత్‌సింగ్ మరణం. దేశ వ్యాపితంగానే కాక అంతర్జాతీయంగా కూడా నిరసనల పెను తుఫానును సృష్టించింది. వీరి మరణం ఫలితంగా సోషలిస్టు విప్లవ భావాలకు ప్రజలలో మొలకెత్తాయి. సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలను నడిపించిన ఎందరో నాయకులపై, ప్రజలపై భగత్‌సింగ్ యొక్క ప్రభావం పని చేసింది. అతని సహచరులలో ఎక్కువ మంది ఈ ఉద్యమాలలో మమేకమయ్యారు.

భగత్‌సింగ్ లాంటి ఎందరో మహావ్యక్తుల పోరాటాల ఫలితంగా భారత దేశానికి స్వాతంత్ర్యం లభించింది. ఈ అమరజీవుల ఆశయాలన్నీ ఈనాటికీ సంపూర్ణంగా సాధించబడలేదు. వారి వారసత్వాన్ని కొనసాగిస్తూ మెరుగైన సమసమాజాన్ని స్థాపించుకోవాల్సిన బాధ్యత నేటి తరాలపై ఉంది. అందులో భాగంగానే రేపటి పౌరులైన ఈనాటి విద్యార్థులు ఇట్లాంటి అమరుల జీవితాలను అధ్యయనం చేసి వారి బాటలో పయనించాల్సి ఉంది. విద్యార్థులకు అందుకవసరమైన మార్గదర్శకత్వాన్ని అందించాల్సిన బాధ్యత ఉపాధ్యాయులది.

---

**(9వ పేజీ తరువాయి)**

**పాఠశాల విద్య - అభ్యసనలో ఇబ్బందులు**

Association సభ్యులు (PTA) కానీ, మిగిలిన తల్లిదండ్రుల జోక్యం కానీ చాలా తక్కువగా నున్నది. అందువల్ల చాలా సందర్భాలలో కొంతమంది తల్లిదండ్రులకు వారి పేర్లు కమిటీలోనున్న విషయం కూడా తెలవటం లేదు.

చాలా మంది తల్లిదండ్రులు ప్రైవేటు పాఠశాలలపై ఆధారపడుతున్నారు. పట్టణ, గ్రామీణ ప్రాంతాలలో ప్రైవేటు పాఠశాలల్లో ఉన్న నాణ్యత కల బోధనే దానికి కారణము. పేద విద్యార్థులను చేర్చుకునే ప్రైవేటు పాఠశాలల్లో (ఫీజు తక్కువ)నున్న బోధనా నాణ్యత ప్రభుత్వ పాఠశాలలకు మించి లేదు. అయితే వారు విద్యార్థులను సమీకరించడంలో కృతకృత్యులౌతున్నారు. కానీ ఇది వారి నాణ్యతమైన బోధన వల్ల కాదు. తల్లిదండ్రుల అమాయకత్వాన్ని ఆసరా చేసుకొని 'ఇంగ్లీష్ మీడియం' పేరుతో సొమ్ము చేసుకుంటున్నారు. తల్లిదండ్రుల ఆదాయాన్ని ఆధారంగా చేసుకొని వీరు ఫీజులు వసూలు చేస్తున్నారు. 2006 సర్వే ప్రకారం 74% బాలురు ప్రైవేటు పాఠశాలల్లో నమోదై యుండగా, ప్రభుత్వ పాఠశాలల్లో మొత్తం పిల్లల నమోదు 51%గా వుంది.

పుట్టగొడుగుల్లాగా ప్రైవేటు పాఠశాలలు పుట్టుకొచ్చినప్పటికీ, 80% విద్యార్థులు ప్రభుత్వ పాఠశాలల్లో నమోదై ఉన్నారు. 1996లో కూడా ఇంతే శాతం నమోదై వుంది. ఇదే విధంగా భవిష్యత్‌లోకూడా కొనసాగవచ్చు. ప్రభుత్వ పాఠశాలల్లో బోధనా నాణ్యతను పెంచవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**భవిష్యత్ :** 1999లో ప్రచురితమైన PROBE రిపోర్టులోని చివరి అధ్యాయం "Change is Possible" లోని అంశాల్లో చాలా వరకు నిజమైనాయి. గత 10 సంవత్సరాలలో పాఠశాల విద్యా విధానంలో మార్పు వచ్చింది. ఇప్పుడు కొన్ని అంశాలపై దృష్టి కేంద్రీకరించవలసిన అవసరం ఆసన్నమైంది. ముఖ్యంగా తరగతి బోధన మరియు నాణమైన విద్య. రాబోయే "Right to Education" చట్టం ఇందుకు సహాయ పడుతుంది. అయితే మొట్టమొదటగా భారతీయ విద్యార్థులకు ఈ రోజు జరుగుతున్న ఈ అన్యాయాన్ని అరికట్టవలసిన అవసరం ఎంతైనా ఉంది. రోజు రోజుకు తరగతి గదుల్లో పెరుగుతున్న వృధా సమయం (బోధన లేకుండా) ఉపాధ్యాయులు చేస్తున్న క్షమించరాని నేరం. ఇది భవిష్యత్తుకు శాపం. ఇప్పటికైనా కొంతమంది ఉపాధ్యాయులు తమ పని సంస్కృతిని మెరుగు పరుచుకుంటే భారతదేశ పిల్లల భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుంది.

# 11వ మహాసభలో ఎన్నికైన
## యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి వర్గం

| | | | |
|---|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | **సిహెచ్. సుభాష్‌చంద్రబోస్** | |
| అధ్యక్షులు | : | **ఎన్. నారాయణ** | |
| సహాధ్యక్షులు | : | **పి. బాబురెడ్డి** | |
| ప్రధానకార్యదర్శి | : | **ఐ. వెంకటేశ్వర రావు** | |
| కోశాధికారి | : | **ఎం. సంయుక్త** | |
| కార్యదర్శులు | : | **సి.హెచ్.రవి** | |
| | | **పి. మాణిక్ రెడ్డి** | (రంగారెడ్డి) |
| | | **బి. నాగేశ్వర రావు** | (కృష్ణ) |
| | | **సి.కె. నాగేంద్రబాబు** | (అనంతపురం) |
| | | **ఎన్. కిష్టయ్య** | (ఎం. నగర్) |
| | | **కె. విజయగౌరి** | (విజయనగరం) |
| | | **కె. వెంకటరావు** | (ప్రకాశం) |
| | | **ఎ. ఇజ్రాయల్ రాజు** | (ప||గోదావరి) |
| | | **ఎ. నర్సిరెడ్డి** | (నల్గొండ) |
| | | **కె.ఎస్.ఎస్.ప్రసాద్** | (తూ||గోదావరి) |
| | | **ఎన్. తాండవకృష్ణ** | (గుంటూరు) |
| | | **వై. శ్రీనివాసులురెడ్డి** | (చిత్తూరు) |
| | | **బి. నరసింహారావు** | (ఖమ్మం) |
| | | **ఎ. వెంకట్** | (ఆదిలాబాద్) |

### ఆడిట్ కమిటీ

| | | | |
|---|---|---|---|
| కన్వీనర్ | : | **సిహెచ్.వి. రాజన్‌బాబ్** | (హైదరాబాద్) |
| సభ్యులు | : | **వి. మాలకొండారెడ్డి** | (ప్రకాశం) |
| | | **ఎ. శ్రీనివాస్** | (వరంగల్) |
| | | **బి.వి. రమణమూర్తి** | (ప||గోదావరి) |
| | | **మాణిక్యం శెట్టి** | (కర్నూలు) |

## రాష్ట్ర కార్యవర్గ సభ్యులు

డి. రామిరెడ్డి, ఎమ్మెల్సీ, ఎంఏకె. దత్తు, పి. కృష్ణమూర్తి, ఎన్. రమణయ్య శాస్త్రి, కె. కేశవ రెడ్డి, డి.మస్తాన్ రావు, రాష్ట్ర కేంద్రం, బి. భాస్కర్ రావు, జి. గిరిధర్ , సిహెచ్. రవీందర్(శ్రీకాకుళం), డి. రాము, కె. శేషగిరి, ఎస్. మురళీ మోహన్ (విజయగనరం), పివిఎస్ఆర్‌పి. వర్మ, ఎన్. సుబ్బారావు, వి. త్రినాథ్ రావు (విశాఖపట్నం), జి. ప్రభాకర వర్మ, కె. సత్తిరాజు, ఎం. విజయగౌరి, ఎస్. జ్యోతిబసు, ఎం. వెంకటేశ్వర రావు, కె.వి. ప్రసాద్‌బాబు, ఎం. రాంబాబు (తూర్పుగోదావరి), ఎస్. శ్రీకాంత్, ఎస్. సాల్జీ, కె. కనకదుర్గ, ఎం.ఐ. విజయ కుమార్, వై.వి. దేవిడ్‌రాజ్, ఆర్. రవి కుమార్ (పశ్చిమగోదావరి), కె.ఏ.ఉమామహేశ్వర రావు, ఎస్. పార్వతీశం, కె. సంజీవ రెడ్డి, కె.వి. సుబ్బారావ్లు, ఏ. కృష్ణసుందర్‌రావు , సిహెచ్. పద్మావతి (కృష్ణ), జి. ప్రభుదాస్, ఎం. హన్మంత రావు, ఎండి. గౌస్, ఎం. పోలయ్య, జి. సీతారెడ్డి, డి. కృష్ణ తులసి(గుంటూరు), కె. శ్రీనివాస రావు, పి. రమణా రెడ్డి, ఎం. వెంకటేశ్వర రెడ్డి, ఎం. ప్రేమమ్మ , జి. ఓబుల్ రెడ్డి, టి. రామ్మూర్తి (ప్రకాశం), కె. పరంధామయ్య, టి. కొండాచారి, సి. చంద్ర శేఖర్, ఎస్. అజయ్ సంపత్ కుమారి, సిహెచ్. శ్రీహరి (నెల్లూరు), ఎన్. సోమచంద్రారెడ్డి, జి. శ్రీరామ మూర్తి, ఎస్.హెచ్. రహమాన్, డి. నిర్మల(చిత్తూరు), బి. లక్ష్మిరాజా, బి. సుబ్బారెడ్డి, ఎస్.వి. సుబ్బారాజు (కడప), కె. సురేష్ కుమార్, ఎన్. నర్సింహులు, డి. రామ శేషయ్య, ఎస్. సలీమా బేగమ్ (కర్నూలు), ఎస్.ఎం.డి. జిలాన్, పి. ఈశ్వరయ్య, టి.ఎల్. శారద, కె. చెన్నా రెడ్డి (అనంతపురం), జి. రాజశేఖర్, కె. నాగేశ్వర రావు, జి.వి.ఎన్. మల్లేశ్వర రావు, సిహెచ్. దుర్గా భవాని (ఖమ్మం), కె. రంజిత్ కుమార్,ఎస్. సదానంద్, ఎన్. బాబు (వరంగల్), సి. కమలకుమారి, టి. లచ్చీరాం, పి. ప్రభాకర్‌రావు (ఆదిలాబాద్), సిహెచ్. రాములు, ఎం. రాజశేఖర్ రెడ్డి, ఎన్. బలరాం, పి. లక్‌పతి నాయక్, జి. ఉషాదేవి (నల్గొండ), టి. లక్ష్మారెడ్డి, వి. సత్యనారాయణ (మెదక్), ఎం.వి. సోమేశ్వర్లు, ఎన్. పోశెట్టి (నిజామాబాద్), డి. మల్లారెడ్డి, ఎం. ఆంజనేయులు, డివిల్. ప్రసన్న కుమారి, కె. ప్రభాకర్ రెడ్డి (రంగారెడ్డి), పి. ఇంద్రజిత్, ఎం.దేవదాస్, కె. రేణు (హైదరాబాద్).

## ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గం

సిహెచ్. రవి, (ప్రధాన సంపాదకులు), ఎం. సంయుక్త, కె. వెంకట్రావు, ఎన్. పురుషోత్తమరావు, ఎ. రమాదేవి

# UTF చొరవతో ఘన విజయం

## 33వేలమంది ఉపాధ్యాయులకు ప్రమోషన్‌లు

2009 జనవరి చివరి నుండి ఫిబ్రవరి చివరిదాకా వివిధ జిల్లాల్లో జరిగిన కౌన్సిలింగ్‌తో మొత్తం 33 వేలమంది ఉపాధ్యాయులకు ప్రమోషన్‌లు లభించాయి. ఇందులో 5200 మంది హైస్కూల్ గెజిటెడ్ హెడ్మాష్టర్‌లుగా ప్రమోషన్‌లు పొందగా మిగిలినవారు స్కూల్ అసిస్టెంట్స్, ఎల్‌ఎఫ్‌ఎల్ హెడ్మాష్టర్‌లుగా ప్రమోషన్‌లు పొందారు. పాఠశాల విద్యాశాఖ చరిత్రలో, ఉపాధ్యాయ ఉద్యమ ప్రస్థానంలో ఒకేసారి ఇన్నివేలమందికి ప్రమోషన్‌లు రావటం అనేది ఒక చారిత్రాత్మక విజయం. ఇదొక రికార్డ్ బ్రేక్ రిజల్ట్! మూడున్నర సంవత్సరాలుగా ప్రమోషన్‌ల కోసం ఎదురుచూసిన ఉపాధ్యాయుల కోరిక నేరవేరింది. అనేక



వికారాబాద్‌లో ప్రధానోపాధ్యాయుల అధికారములు - విధులు పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న దృశ్యం

సంవత్సరాలుగా హైస్కూళ్లు ఎదుర్కొంటున్న ఉపాధ్యాయుల కొరత తీరింది. దాదాపు అన్ని హైస్కూల్స్‌లో హెడ్మాష్టర్ల పోస్టులు భర్తీ అయినవి. సబ్జెక్ట్ టీచర్ పోస్టుల్లో అత్యధిక భాగం భర్తీ అయినవి. ఈ ప్రమోషన్‌లతో వేలాదిమంది ఉపాధ్యాయులకు లబ్ధి చేకూరటంతోపాటు పాఠశాలలు, విద్యార్థులకు కూడ మేలు జరుగుతుంది. ఇంతటి ఘన విజయం యుటియఫ్ తీసుకొన్న చొరవ, ఉపాధ్యాయులు చేసిన పోరాటాలతోనే లభించిందనే విషయాన్ని గమనించాలి.

ఏకీకృత సర్వీస్ రూల్స్ సమస్య పరిష్కారం అయ్యేవరకు ఉపాధ్యాయులు నష్ట పోకుండా వుండాలంటే ప్రత్యామ్నాయ పద్ధతుల్లో అడ్‌హాక్ రూల్సు రూపొందించాలని, బదిలీలు, ప్రమోషన్‌లు జరిపించాలని యుటియఫ్ చేసిన ప్రతిపాదన నేటికి ఫలించింది. కొన్ని ముఖ్యమైన ఉపాధ్యాయ సంఘాలకు యిష్టం లేకపోయినా ఉపాధ్యాయుల ప్రయోజనానికై యుటియఫ్ చొరవ తీసుకొన్నది. 2008 సెప్టెంబర్ 4న యుటియఫ్ ఆధ్వర్యంలో జరిగిన చలో అసెంబ్లీ డిమాండ్ల పత్రంలోనే "ఏకీకృత సర్వీస్‌కి లోబడి వుండే విధంగా అడ్‌హాక్ రూల్స్‌తో బదిలీలు, ప్రమోషన్‌లు కావాలి" అనే డిమాండ్‌ని మొదటి డిమాండుగా ప్రభుత్వం ముందుంచటం జరిగింది. సెప్టెంబర్ 16న జరిగిన జాక్టో స్టీరింగ్ కమిటీ సమావేశంలో ఏదేమైనా సరే బదిలీలు, ప్రమోషన్‌లు జరిపించాలనే డిమాండును యుటియఫ్ ప్రతిపాదనతోనే జాక్టో డిమాండ్లలో మొదటి అంశంగా చేర్చటం జరిగింది. జాక్టో సమ్మెకి ముందు అక్టోబర్ 20న డైరెక్టరేట్‌లో జరిగిన సమావేశంలో "ఏకీకృత సర్వీస్‌కి కేంద్రం అనుమతి రాలేదనే విషయం మీకు తెలుసు, అయినా దానితోనే బదిలీలు, ప్రమోషన్‌లు జరిపించాలని అడుగుతున్నారు. చెయ్యాలనే సంకల్పం మాకూ వుంది. ఈ పరిస్థితుల్లో ఎలా చెయ్యమంటారో మీరే చెప్పండి"అని పాఠశాల విద్యాశాఖమంత్రి ప్రశ్నించిన కీలకమైన సందర్భంలో యుటియఫ్ ప్రతినిధులే చొరవ చేసి పరిష్కార మార్గాన్ని చెప్పటం జరిగింది. ఏకీకృత సర్వీస్ లేకున్నా డిఎస్‌సి 2006 నియామకాలు ఎలా చేశారో, జి.ఓ. 610ని అమలు చేస్తూ వేలాదిమంది ఉపాధ్యాయులను ఎలా బదిలీ చేశారో అదే విధంగా సాధారణ బదిలీలు, ప్రమోషన్‌లు జరిపించాలని యుటియఫ్ వాదించింది. ఇదే పరిష్కార మార్గమనే విషయం మంత్రికి, అధికారులకు తెలుసు. అయినా ఇతర సంఘాలు ఈ విషయంలో సూటిగా, స్పష్టంగా తమ అభిప్రాయాలు చెప్పకపోవటంతో మరికొంత కాలయాపన జరిగింది.

సమ్మె ముగిసిన తర్వాత బదిలీలు, ప్రమోషన్‌ల కోసం, అడ్‌హాక్ రూల్స్ కోసం యుటియఫ్ ప్రతినిధులు, పిడిఎఫ్ ఎమ్మెల్సీలు ప్రభుత్వంపైన వత్తిడి తెచ్చే కృషి చేశారు. కానీ కొన్ని ఇతర సంఘాలు, వారి ఎమ్మెల్సీలు అడ్‌హాక్ రూల్స్ ప్రయత్నాలను అడ్డుకొన్నారు. ఏకీకృతం లేకుండా మేనేజిమెంట్ వారీగా ప్రమోషన్‌లు యిస్తే ఆత్మహత్య చేసుకొన్నట్లేనని ఒక ఎమ్మెల్సీ, అంతకన్న విషం తాగి చావటం మంచిదని యింకా ఒక ఎమ్మెల్సీ వాపోయినట్లు తెలిసింది. అయినాసరే పాఠశాల విద్యలో నెలకొన్న సంక్షోభాన్ని తొలగించాలంటే తెగించి ముందుకు పోవాలనే యుటియఫ్ ప్రతిపాదన అందుకనుగుణంగా ఉపాధ్యాయుల్లో పెరుగుతున్న పట్టుదలను అర్థం చేసుకొన్న అధికారులు, విద్యామంత్రి అడ్‌హాక్ రూల్స్ తయారీకి పూనుకొన్నారు. ఎట్టకేలకు జి.ఓ.లు 182,183 విడుదలైనాయి. వాటిలోని అభ్యంతరకర అంశాలను సవరించాలన్న ఉపాధ్యాయ సంఘాల డిమాండ్ మేరకు పాఠశాల విద్య ముఖ్యకార్యదర్శిగా కొద్ది రోజులైనా ఇన్‌చార్జీ బాధ్యతలు శ్రీమతి ఛాయారతన్ చేపట్టిన తర్వాత వాటిని సవరిస్తూ జి.ఓ.లు 9,10,11,12 వచ్చాయి. వాటితోపాటు బదిలీలు, ప్రమోషన్‌లకు సంబంధించిన సాధారణ నియమాల జి.ఓ.లు, వాటికి క్లారిఫికేషన్‌లతో మరికొన్ని ఉత్తర్వులు వచ్చాయి. ఎన్ని ఉత్తర్వులు వచ్చినా యింకా కొన్ని సమస్యలు వెంటాడుతూనే వున్నాయి. క్లారిఫికేషన్‌లు, సర్టిఫికెట్ల విషయంలో గందరగోళ పరిస్థితి ఏర్పడింది. బోగస్ సర్టిఫికెట్లు బెడదా ఎదురైంది. సీనియార్టీ జాబితాలు, ఖాళీ పోస్టులు తదితర సమస్యలతో కౌన్సిలింగ్ వాయిదాలు పడుతూ వచ్చింది. ఉపాధ్యాయులు పగలూ రాత్రి పడిగాపులు పడాల్సి వచ్చింది. ఎన్ని ఇబ్బందులు ఎదురైనా 90%పైగా కౌన్సిలింగ్ పూర్తయింది. 33 వేలమందికి ప్రమోషన్‌లు వచ్చాయి.

అయితే ఈ ప్రమోషన్‌ల ప్రక్రియ యిప్పటికీ అసంపూర్ణమే. ఇప్పుడు ప్రమోషన్‌లు పొందినవారు వచ్చే ఏప్రిల్, మేలో జరిగే బదిలీల కౌన్సిలింగ్‌లో పాల్గొనాలి. అప్పుడే వారి రెగ్యులర్ పోస్టులు ఎక్కడనేది తెలుస్తుంది. ఈలోగా జీతాలు పొందేదానికి తాత్కాలిక ఏర్పాట్లు జరిగాయి. కొన్ని జిల్లాల్లో యింకా కొన్ని పోస్టులు ఖాళీగా వుండి పోయాయి. వాటిని భర్తీ చేయటానికి ఎన్నికల కోడ్ అడ్డం వచ్చింది. బి.కాం., ఎం.ఏ. (ఎడ్యుకేషన్) అర్హతగల వారికి ప్రమోషన్ అవకాశం కల్పిస్తామని విద్యాశాఖ అధికారులు యిచ్చిన హామీ అమల్లోకి రాలేదు. ఏపిఏటి డైరెక్షన్స్ వలన ప్రక్కన బెట్టిన పోస్టులకు ప్రమోషన్‌ల సమస్య పరిష్కారం కావాలి. ఈ ప్రక్రియలోనే సక్సెస్ హైస్కూల్స్‌లోని ఎస్‌జిటీలు, ప్రాథమిక పాఠశాలల్లోని సర్‌ప్లస్ చేయబడిన ఎస్జీటీ పోస్టుల్లోని ఉపాధ్యాయులను సర్దుబాటు చేయాల్సి వచ్చింది. ఉపాధ్యాయ సంఘాల వత్తిడి తట్టుకోలేక 1500 పండిట్ పోస్టులు, 500 పిఇటీ పోస్టులు అప్‌గ్రేడ్ చేస్తూ జి.ఓ. 80 ఆలస్యంగా వచ్చింది. దానితోపాటే ఎన్నికల నోటిఫికేషనూ వచ్చింది. ఆ పోస్టులకు ప్రమోషన్‌లు యిచ్చే అవకాశం లేకుండా పోయింది. మరోవైపు ఈ ప్రమోషన్‌ల ప్రక్రియలో మున్సిపల్, గిరిజన పాఠశాల ఉపాధ్యాయులకు అవకాశం లభించలేదు. వారి ప్రమోషన్‌ల కోసం యుటియఫ్ చేసిన ప్రయత్నాలు ఒక కొలిక్కి వచ్చేలోగానే ఎన్నికల ప్రక్రియ విడుదలైంది. కనుక ఇన్ని వేలమందికి ప్రమోషన్‌లు వచ్చాయనే సంతృప్తి కలిగినా యింకా కొంత అసంతృప్తి మిగిలేవుంది. ఆ అసంతృప్తిని ఎన్నికల అనంతరం తీర్చటానికి కృషి చేయాలి. ఎన్నికల ప్రక్రియ ముగిసిన వెంటనే బదిలీలు, ప్రమోషన్‌ల భారీ కార్యక్రమాన్ని చేపట్టాలి. అందుకవసరమైన జి.ఓ.లు, సవరణలు ఈలోగా సాధించాలి. ఇందుకు యుటియఫ్ అహరహం కృషి చేస్తుంది. నూతనంగా పదోన్నతి పొందిన ఉపాధ్యాయులను యుటియఫ్ అభినందిస్తున్నది. ప్రధానోపాధ్యాయులు తమ విధులు, అధికారాలను అవగాహన చేసుకొని సమర్థవంతంగా పని చేయడం కోసం రాష్ట్ర వ్యాప్తంగా యుటియఫ్ ఆధ్వర్యంలో అవగాహనా తరగతులు ఏర్పాటే చేసింది.



వికారాబాద్‌లో జరిగిన రంగారెడ్డి జిల్లా అవగాహనా తరగతులకు హాజరైన ప్రధానోపాధ్యాయులు



# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

# 11వ రాష్ట్ర మహాసభలు

ఫిబ్రవరి 20,21,22

నల్లగొండ




## అధ్యక్షోపన్యాసము

ఐ. వెంకటేశ్వర రావు
యుటియఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి

వేదిక నలంకరించిన పెద్దలారా!

మహాసభ ప్రతినిధులారా ! సౌహార్ధ ప్రతినిధులారా!

సోదర సంఘ నాయకులారా!

పురప్రముఖులారా! విద్యావేత్తలారా!

పత్రికా ప్రతినిధులారా!

రాష్ట్రం నలుమూలల నుండి వ్యయప్రయాసలకోర్చి ఉద్యమ చైతన్యంతో ఈ మహాసభకు విచ్చేసిన మీకందరకు స్వాగతం. నూతన నిబంధనావళి ప్రకారం గత 10వ రాష్ట్ర మహాసభ 2007 మే 14,15 తేదీలలో విజయవాడలో ఘనంగా నిర్వహించుకొన్నాము. చారిత్రాత్మకంగా పోరాటాల ఖిల్లాగా పేరొందిన నల్గొండలో నేడు 11వ రాష్ట్ర మహాసభ జరుపుకొంటున్నాము.

34 వసంతాలు నిండిన ఉద్యమంలో దానిరథసారథులుగా అడుగడునా అవాంతరాలు ఎదుర్కొంటూ ఈ మహాసభకు తరలివచ్చిన మీకు అభినందనలు తెలుపుతున్నాను.

అమరజీవి చెన్నుపాటి ఆశయాలకణుగుణంగా 1974 ఆగస్టు 10న అవతరించి ఆంధ్రప్రదేశ్ అంతటా అందరి ఉపాధ్యాయుల మన్ననలు పొంది అతి పెద్ద సంఘంగా ఎదిగి చారిత్రక కర్తవ్యం నెరవేర్చుతున్న సంస్థ యుటియఫ్. ఈ క్రమంలో జరిగిన రాష్ట్ర మహాసభలు ప్రతీదీ మన ఉద్యమ చైతన్యాన్ని పెంచి ఉద్యమ అభివృద్ధికి తోడ్పడ్డాయి. సమస్యల పరిష్కారంలో అగ్రభాగాన ఉన్న ఈ సంస్థను ఉపాధ్యాయులు అపూర్వంగా ఆదరించారు. స్వతంత్ర కార్యాచరణతో పాటు ఐక్య ఉద్యమాలకు నాయకత్వం వహించడంలో యుటియఫ్ కృషి ఈ కాలంలో ఎంతో పెరింగింది.

ఈ మహాసభ కాలంలో రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగంలో వచ్చిన మార్పులు మనపై ప్రభావం చూపుతున్నాయి. పాలక వర్గాల విధానాలు ప్రజల జీవితాలను చిందరవందర చేస్తున్నాయి. ఏకధృవ ప్రపంచ వ్యవస్థ బీటలు వారింది. అమెరికా అధ్యక్షునిగా నల్లజాతికి చెందిన బరాక్ హుస్సేన్ ఒబామా గెలిచారు. అమెరికా విధానాల్లో మార్పు తెస్తారా లేదా చూడాలి. ప్రపంచాన్ని ప్రజలను మింగేసే లక్షణం గల పెట్టుబడిదారీ వ్యవస్థ తన అభివృద్ధికి దోహదం చేసిన కార్మికుల ఉద్యోగుల జీవితాలను ఛిద్రం చేస్తుంది.

అమెరికాలో ప్రారంభమైన ఆర్థిక సంక్షోభం అమెరికా సరిహద్దులు దాటి పెట్టుబడి దారీ ప్రపంచం మొత్తాన్ని తాకింది. మహామహా బ్యాంకులు, స్టాక్ మార్కెట్లు కుప్పకూలి పోయాయి. మధ్య తరగతి ప్రజల ఆశలు అడియాశలయ్యాయి. సామ్రాజ్యవాదం దాని అనుబంధ సంస్థలు ప్రచారం చేసిన సిద్ధాంతాల పునాదులు కదులుతున్నాయి. సంక్షోభ భారాలను ప్రజలపైకి నెట్టుతున్నాయి. బ్యాంకుల దివాళా, పరిశ్రమల మూసివేత, కంపెనీలు బిచాణా ఎత్తి వేయడం దానితో నిరుద్యోగం ప్రబలుతోంది. లక్షలాది మంది ఉద్యోగులు రోడ్ల పాలవుతున్నారు.

నేపాల్ ప్రజలు శతాబ్దాల రాజరిక పాలనకు సమాధికట్టి మావోయిస్టుల నాయకత్వంలో నూతన ప్రభుత్వం ఏర్పాటు చేసుకున్నారు. చైనా ప్రపంచంలోనే అనూహ్యమైన అభివృద్ధిని సాధించింది, ఒలంపిక్స్ తనదైన శైలిలో నిర్వహించి శతాధిక పతకాలను సాధించి ప్రపంచాన్ని ఆశ్చర్యపరిచింది.

యుపిఏ ప్రభుత్వం ఉపాధి హామీ చట్టం, సమాచార చట్టం, అటవీ చట్టం వంటి మంచి చట్టాలు చేసింది. కానీ విద్యాహక్కుని చట్టం చెయ్యలేకపోయింది. ధరలను అదుపు చేయలేకపోయింది. నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగి సాధారణ మధ్య తరగతి ప్రజల జీవన పరిస్థితులు క్షీణించాయి. ఫ్యూచర్ ట్రేడింగ్, ఫార్వడ్ ట్రేడింగ్ వలన ఆహార సరుకుల ధరలు విపరీతంగా పెరిగాయి. చంద్రయాన్ ప్రాజెక్టు విజయవంతం కావడంతో అంతరిక్ష రంగంలో భారత ప్రతిష్ట పెరిగింది.

ఆర్థిక సరళీకరణ కోసం యుపిఏ ప్రభుత్వ ప్రతిపాదనలను, బ్యాంకులు, భీమా రంగంలో విదేశీ పెట్టుబడులను వామపక్షాలు నిలువరించిన కారణంగా సంక్షోభ ప్రభావం మనపై తక్కువ పడింది. అయినా ఈ సంక్షోభ ప్రభావం మన దేశంలో అనేక రంగాలపై పడింది. గతంలో కొన్ని నగరాలకు పరిమితమైన ఉగ్రవాద దాడులు అన్ని రాష్ట్రాలకు వ్యాపిస్తున్నాయి. దేశంలో కొన్ని ప్రధాన నగరాలపై ఉగ్రవాదులు జరిపిన దాడుల్లో సాధారణ పౌరులు, భద్రతా సిబ్బందిని చంపి వేయడం దేశాన్ని దిగ్భ్రాంతికి గురి చేసింది. ఉగ్రవాదం మతతత్వం పెంచి పోషిస్తున్న శక్తుల పట్ల, వీటిని నివారించలేని ప్రభుత్వ అశక్తత పట్ల ప్రజల్లో ఆగ్రహం వ్యక్తం అవుతుంది.

అమెరికాతో అణు ఒప్పందం వలన మన దేశ సార్వభౌమాధికారానికి ప్రమాదం ఏర్పడింది. ఈ ఒప్పందం వెనుక అమెరికా వ్యూహాత్మక, వ్యాపార లాభాలే ఉన్నాయి. ఈ ఒప్పందం అమలు కోసం కేంద్ర ప్రభుత్వం తన ప్రభుత్వాన్ని నిలబెట్టుకోవటానికి అవినీతి పద్ధతులు అనుసరించింది.

కార్పొరేట్ సంస్థలు, స్టాక్ మార్కెట్లు ప్రభుత్వం అండదండలతో ప్రజల ఆస్తులను, భూములను వేల కోట్ల ధనాన్ని ఎలా దోచుకుంటున్నాయో సత్యం కంపెనీ ఉదంతం మరొక ఉదాహరణగా ముందుకు వచ్చింది. ఒకదాని తర్వాత ఒకటి బయట పడుతుంటే ప్రజలు మోసపోతూనే ఉన్నారు. మహిళలపై అత్యాచారాలు, హత్యలు యువతులపై యాసిడ్ దాడులు సమాజాన్ని వణికిస్తున్నాయి. ఒక ఘటన మరచిపోయేలోగా మరొక ఘటన భీతిగొల్పుతుంది.

ప్రపంచ బ్యాంకు జీతగాడుగా గత ప్రభుత్వాన్ని విమర్శించిన వైఎస్ ప్రభుత్వం ప్రపంచబ్యాంకు బాటలోనే నడుస్తుంది. పేదల కోసం పెట్టిన పథకాలను ఆచరణలో అనర్హులు అనుభవిస్తున్నారు. సెజ్‌ల పేరిట రైతుల నుండి వేలాది ఎకరాలు సేకరించి ప్రభుత్వం తనే పెద్ద రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తుంది.

జెఏసి ఆధ్వర్యంలో ఐక్యంగా పోరాడి 22% ఐఆర్, గ్రేటర్ హైదరాబాద్ ఉద్యోగులకు 30% హెచ్ఆర్ఏ సాధించుకొన్నాం. జాక్టో ఆధ్వర్యంలో 13 రోజుల సమ్మె సందర్భంగా చర్చలలో ఏప్రిల్ తర్వాతనే అప్రెంటిస్ నోషనల్ ఇంక్రిమెంట్లు పరిశీలిస్తామని చెప్పిన ప్రభుత్వంపై మనం చేసిన నిరంతర పోరాటం, ఎమ్మెల్సీల ఒత్తిడి ఫలితంగా ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చింది. నోషనల్ ఇంక్రిమెంట్లకు అనుమతిస్తూ జనవరిలో ఇచ్చిన జి.ఓ. 2లో అన్ని యాజమాన్యాలు పేర్కొనలేదు. స్పెషల్ విద్యావాలంటీర్ల మాట లేదు. పెన్షన్ విషయం స్పష్టం చేయలేదు. ఉపాధ్యాయ సంఘాలతో చర్చ లేకుండా ఆర్థిక లాభం విషయంలో ప్రభుత్వం అనుకొన్న విధంగానే అప్రజాస్వామికంగా నిర్ణయించింది. ఎయిడెడ్, పండితుల యాక్టులు ప్రాస్పెక్టివ్‌గా వర్తింపచేసే ఉత్తర్వులు నేటికీ యివ్వలేదు.

సమస్యలపై పోరాడే సంఘాలను చీల్చి విభజించి పాలించే కుటిల నీతిని ఈ ప్రభుత్వం పాటించింది. గత నాలుగున్నరేళ్ళుగా ప్రభుత్వం యిచ్చిన

హామీలపై ఉత్తర్వులు యివ్వాలని అంతిమ పోరాటానికి దిగిన సంఘాలకు, ఐక్య పోరాటాలకు రాజకీయాలు అంటగట్టింది. పోరాటాలు జరిగినప్పుడు చర్చలు జరిపి ఉత్తర్వులు ఇవ్వకుండా ఆ తర్వాత అరకొర పరిష్కారంగా ఉత్తర్వులు విడుదల చేస్తుంది.

పెన్షనర్ల సమస్యలు పరిష్కారం చేస్తామని చెప్పిన ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన వెంటనే సెప్టెంబర్ 2004 నుండి నియామకమయ్యే ఉపాధ్యాయ, ఉద్యోగులకు ప్రభుత్వ పెన్షన్ లేకుండా చేసి కంట్రిబ్యూటరీ పెన్షన్ ఉత్తర్వులు తీసుకొచ్చింది. ఖాళీ పోస్టులు భర్తీ కాకపోవటంతో రాష్ట్ర పరిపాలన కేంద్రంలో సెక్రటేరియట్, డైరెక్టరేట్లలో 50% కూర్చీలు ఖాళీగా ఉండడంతో ఫైళ్ళు కదలటం లేదు.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు విద్యారంగంలో చేస్తున్న మార్పులు ఆందోళన కలిగిస్తున్నాయి. 2002లో రాజ్యాంగ సవరణ ద్వారా ప్రాథమిక విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించినా ఐదేండ్లలో యుపిఏ ప్రభుత్వం కూడా చట్టం చేయలేకపోయింది. మాతృభాషలో విద్యా బోధన గరపాలన్న నిబంధన విద్యా హక్కు బిల్లు పట్టించుకోలేదు. మార్కెట్ శక్తుల దాడిపాఠశాల విద్యారంగంపై కూడా తీవ్ర ప్రభావం చూపుతుంది. కాన్సెప్ట్ స్కూళ్ళ పేరుతో పాఠశాల విద్యను మార్కెట్ శక్తులకు ధారాదత్తం చేసే ప్రయత్నాలను అడ్డుకోగలిగాము. సక్సెస్ పాఠశాలల పేరుతో సెకండరీ పాఠశాలలను అభివృద్ధి చేస్తామని చెపుతున్న ప్రభుత్వం ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలను దెబ్బతీస్తున్నది. వీటిలో ఉపాధ్యాయ పోస్టులు రద్దవుతున్నాయి. 30 మంది కంటే తక్కువ పిల్లలున్న ప్రాథమిక పాఠశాలల్లో 2వ ఉపాధ్యాయ పోస్టును రద్దు చేస్తున్నారు. అప్‌గ్రేడ్ చేసిన పోస్టుల స్థానంలో కేటగిరి 3 పోస్టులు రద్దు చేయబడ్డాయి. దీర్ఘకాలాంగా ఖాళీగా ఉన్న కేటగిరి 3 పోస్టులు రద్దు చేసి ప్రధానోపాధ్యాయుల పోస్టులు మంజూరు చేసారు. భాషాపండితుల, పిఇటి పోస్టుల అప్‌గ్రేడేషన్ జరగలేదు. పోరాడి 8 ఏండ్ల తర్వాత మున్సిపాలిటీలో డిఎస్‌సి నియామకాలు సాధించుకొన్నప్పటికీ సక్సెస్ మున్సిపల్ పాఠశాలకు అధికారుల నిర్లక్ష్యం ఫలితంగా పోస్టుల మంజూరు జరగలేదు. ఎయిడెడ్ ప్రమోషన్లు, నియామకాల కోసం ఎంత పోరాడినా ప్రభుత్వ స్పందన లేకుండా ఉంది. మొత్తంగా చూస్తే సంవత్సరాల తరబడి పోస్టులు భర్తీ లేక బోధన కుంటుబడుతోంది. భౌతిక వసతుల కల్పనలో మార్పులేదు. అందరికీ విద్యనందించడంలో ప్రభుత్వం అసమానత చూపుతుంది. చదువుల్లో సామాజిక న్యాయం దెబ్బతింటుంది. జాతీయ విద్యారంగ పరిరక్షణకోసం విద్యా హక్కు సాధన కోసం ప్రజా ఉద్యమం కొనసాగించాల్సిన బాధ్యత మనపై ఉంది. వృత్తికి అంకితమై పని చేస్తూ పాఠశాల విద్య పరిరక్షణకు ప్రజలను చైతన్యవంతం చేయాలి.

ఈ మహాసభలకు వచ్చిన పెద్దలు, విద్యావేత్తలు, రాజకీయ నాయకులు యిచ్చే సలహాలు సూచనలతో ఈ సభలో మనం చేసే నిర్ణయాలతో పాఠశాల విద్యారంగాన్ని ఉపాధ్యాయ ఉద్యమాన్ని బలపర్చుదాము. బలోపేతం చేయడానికి కృషి కొనసాగిద్దాము.

ఈ మహాసభ మూడు రోజులలో పాఠశాల విద్యారంగ పరిస్థితి, బహిరంగ సభ, నిర్మాణ మహాసభలో చైతన్యవంతంగా పాల్గొని జయప్రదం చేయాలని కోరుతున్నాను. పాఠశాల విద్యారంగాన్ని, మన ఉద్యమాన్ని మరింతగా మునుముందుకు నడిపిస్తామని ప్రతిజ్ఞ చేద్దాం.

## ఇంగ్లీష్ శిక్షణా తరగతులకు బడ్జెట్ విడుదల

2008 వేసవి సెలవుల్లో సక్సెస్ పాఠశాలల్లో ఇంగ్లీషు మీడియం బోధన కొరకు ఉన్నత పాఠశాలల ఉపాధ్యాయులకు నిర్వహించిన శిక్షణా తరగతుల నిర్వహణా ఖర్చుల నిమిత్తం రు. 4,10,72,000/-లు విడుదలైనాయి. రాష్ట్ర ప్రభుత్వం విద్యాశాఖ ముఖ్య కార్యదర్శి జి.ఓ.ఆర్.టి.నం. 169, తేది. 12.03.2009 ద్వారా ఈ మొత్తానికి పరిపాలనానుమతిని మంజూరు చేశారు.

## "ఉపాధ్యాయుల సమస్యలు" - గేయం

**- కందుకూరి శ్రీ విద్య,** నల్లగొండ జిల్లా

పల్లవి : పాఠాలు నేర్పె పంతుళ్ళు
పరువు ప్రతిష్టలందించేవారు నీతి॥పాఠాలు॥
చిక్కుల్లో చిక్కినారమ్మ-కోటి కష్టాల పాలైనరమ్మా
నీతి॥పాఠాలు॥

1. ఉన్నత పదువులు ఉన్నా - మనకు బదిలీలు పోస్టులు సున్నా
ఉమ్మడి సర్వీసు రూల్సు - మనకు ఊరట కలిగించు తీరు ॥2॥
అప్రెంటిస్ టీచర్ల బాధ - అమ్మ ఒడి విడిచి చేసేటి గోల
ఎటు పోయెనో మన చట్టం-అయ్యో ఏమి చెప్పను మన కష్టం
నీతి॥పాఠాలు॥

2. డిఎస్సి పడింది అంటే -కోటి సంబరాల్లో నేటి యువత
కోచింగ్ సెంటర్ల జోరు-కోలహలంగా ఉండేటి తీరు
మదిలోన ఆశలు ఎన్నో - వాళ్ళ మ్యారేజి ఫిక్సింగ్ లెన్నో
వాన కారు కోయిలల్లే అయ్యో-ఆశలెన్నో నిండె గుండె
నీతి॥పాఠాలు॥

3. ఓట్ల పండగలొచ్చాయంటే-ఊరుకొక్కరు ఉరుకులాట
ఎక్కి దిగేటి బస్సుల్లో గోల-ఒక్కపూటే తిండి తిప్పలంతా
అదనపు పనులల్లో ముందు-మనము ఏది అడిగిన అంతా ఖంగు
ప్రతి పనికి పంతుళ్ళెపోవు-అయ్యో తిరిగిచూస్తే అంతా బోరు
నీతి॥పాఠాలు॥

4. నేతలెందరో మారినాను-మన రాతగీత మారలేదే
ఇట్టాంటి ఒజ్జలని తెలిసి-ఇంద్రజాలమెవరేమి చేశారో
ఐకమత్యము వదలబోకు-నీవు అసలు సంగతి మరువబోకు
కన్నీరు పెట్టొద్దు ఒజ్జా-మనం కలిసి పోరు చేద్దాము ఒజ్జా
నీతి॥పాఠాలు॥

## అమ్మ

**- కె. కళ,** వరంగల్ జిల్లా

అమ్మ తనంలోని
కమ్మదనాన్నే గుర్తిస్తావు
కానీ అమ్మగా తానెన్ని
కష్టాలు పడిందో
గమనించి మసలుకో
నీ నిర్లక్ష్యం ఆమెనెంత
బాధిస్తుందో గమనించు
నువు చూపే కాసింత
ప్రేమ ఆమె జీవిత కాలాన్ని
పెంచుతుందని
తెలుసుకొని మసలుకో
తన కడుపు మాడ్చుకుని
నీ కడుపు నింపుతుంది
తాను బాధలు పడుతుంది
నిన్ను సుఖపడుతుంది
దూరం చేసుకొని దుఃఖించకు
అమ్మకు మరణ శాసనం అభించకు



## ప్రారంభోపన్యాసం

# విద్యారంగ రథ చోదకులు ఉపాధ్యాయులు

చుక్కా రామయ్య
ఎమ్మెల్సీ

ఇది బువ్వ గింజల కోసం చాకలి ఐలమ్మ పోట్లాడిన నేల, దొరలగడీల అహంకారంపైన దొడ్డి కొమరయ్య గుండెల నెదురొడ్డి, తుపాకీ గుండ్లను ఎదిరించిన సాహసాల పుట్టిల్లిది. "ఏ బండ్ల వస్తవు కొడుకో, నైజాము సర్కారోడా..." అంటూ పశువుల కాసే యాదగిరి యుద్ధగీతం ఆలపించి ప్రజాసాహిత్యానికి పల్లవి కట్టిన ప్రాంతమిది. పల్లెటూరి పిల్లగాడా పసులకాసే మొనగాడా... పాలు మరిచి ఎన్నాళ్లయ్యిందో అంటూ ఆధునిక సమాజం కళ్లు తెరవకముందే బాలకార్మిక వ్యవస్థను కళ్లకు కట్టించి పాటలు అల్లి తెలుగు సాహిత్యానికే మణిహారమైన సుద్దాల హన్మంతును కన్న సృజన శీలి ఈ నేల.

భావి భారత భవిష్యత్తు ఉద్యమాలకు ఎంతో నెత్తురిచ్చి, ప్రాణాలిచ్చిన ఈ మట్టి మీద కూర్చుని భవిష్యత్తు ఉపాధ్యాయ ఉద్యమ రూపాల్ని, వ్యూహాల్ని రచించుకోవటం ఒక పులకరింత, ఒక పలవరింత, ఒక మహా పలవరింత. పోటెత్తుతున్న ఉద్యమాలకు ఇది ఒక నది పుట్టుకలాంటిదవుతుంది. ప్రపంచమంతా ఆర్థిక సంక్షోభంలో చిక్కుకొని విలవిలలాడుతున్న సందర్భమిది. దేశాలకు దేశాలు ఆందోళనల్లో, ఆశ్చర్యంలో, పీకల్లోతు ఆర్థిక సంక్షోభాల్లో మునిగి పోయిన కలవర కాలమిది. అన్ని సంక్షోభాలకు ఆర్థిక సంక్షోభం తోడై మరింత స్థాయికి దేశాలకు దేశాలే అధఃపాతాళానికి చేరుతున్న సమయమిది. చదువుకున్న సాంకేతిక విద్య సాంప్రదాయ చదువుగా, నిరుద్యోగ సరుకుగా మారుతున్న పరిస్థితి మనముందుంది. అమెరికా, యూరప్ దేశాల్లో ఉన్నన్ని ఇంజనీరింగ్ కళాశాలలు మన ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే ఉండటం విశేషం. సాంకేతిక విద్య సాధారణ విద్యగా పూర్తి చేస్తున్నారు. రాష్ట్రంలో 70 వేల ప్రభుత్వ పాఠశాలలున్నాయి. అదేవిధంగా మరో 80 వేల స్కూళ్లు ప్రైవేట్ రంగంలోనున్నాయి. రాష్ట్రంలో 30 యూనివర్శిటీలు, 1847 డిగ్రీ కాలేజీలు, 490 పి.జి కాలేజీలు, 607 బి.ఇడి కాలేజీలు, 527 ఇంజనీరింగు కాలేజీలు, 255 ఫార్మసీ కాలేజీలు, 498 ఎం.బి.ఏ కాలేజీలు, 698 ఎం.సి.ఎ. కాలేజీలు, 43 లా కాలేజీలు, 6 వ్యవసాయ కళాశాలలు, 50 మెడికల్ రంగానికి చెందిన కళాశాలలు మొత్తంగా 5030 ఉన్నత విద్యకు సంబంధించిన సంస్థలు మన రాష్ట్రంలో ఉన్నాయి. ఇవి కాక ఇతర రాష్ట్రాలకు చెందిన విద్యా సంస్థలు వందల సంఖ్యలో వున్నాయి. ఒక పక్క యూనివర్శిటీ విద్య ఎంత ముందుకు దూసుకు పోతున్నా అంతర్జాతీయ ప్రమాణాల విషయంలో, అంతర్జాతీయ మార్కెట్‌ను మన యూనివర్శిటీలు అందుకోలేకపోతున్నాయి. ఇందుకు లోపం ఎక్కడుందో వెతకాలి. ప్రధానంగా ప్రాథమిక విద్య ప్రమాణాలు పెరగకుండా విశ్వవిద్యాలయ విద్యా ప్రమాణాలు ఏనాటికీ పెరగవు. పిల్లలే దేశ సంపద, ప్రధానంగా పాఠశాలే ఆ దేశ మానవ వనరులను తయారుచేస్తుంది. ఇంతకంటే కీలకమైన పని మరొకటి లేదు. అంతటి బృహత్తరకర్తవ్య నిర్వహణ కంకణదారుడు ఉపాధ్యాయుడు.

### మీరు అసామాన్య కార్యకర్తలు...

మీలోని వాడినే, మీ వాడినే, మీలాగానే నేనొక సామాన్య కార్యకర్తను, నన్ను ఈ మహాసభకు ప్రారంభోపన్యాసం చేయవలసిందని ఆదేశించినందుకు దాన్ని ఒక మహద్భాగ్యంగా గుర్తిస్తాను. మీరు అసామాన్య కార్యకర్తలని నాకు తెలుసు. మీరు ప్రమోషన్ల కోసం, డి.ఏ.ల కోసం లేక ఏదో జీవోల కోసమో సంఘాల్లో చేరిన వారు కాదనుకుంటాను. మీ లక్ష్యాలు వేరే అనుకుంటున్నాను. మీకన్నా ముందు ఈనాడు మీరు ఆరాధిస్తున్న లక్ష్యాల కోసమై మీరు కూర్చున్న ఈ గడ్డపై ఎంతో మంది ప్రాణాలర్పించారు. వారు మన మాదిరిగా చదువుకున్నవాళ్లేం కాదు. లేదా పెద్ద పెద్ద కళాశాలల్లో చదువుకున్న వారు అంతకన్నా కాదు. సామాజిక చింతన కలవారుగా, ప్రజల పక్షాన నిలబడాలంటే కాలేజీల్లో చదువవలసిన అవసరం లేదని వాళ్లు నిరూపించారు. వారు తమ తిండి కోసం, తమ బాగు కోసం కాకుండా రాబోయే సమాజ శ్రేయస్సు కోసమై తుపాకీ గుండ్లకు గురయ్యారు. వారి పేర్లు ఏ చరిత్రలోను కనిపించవు. వారు తమ పేరుకన్నా, తమ నేల విముక్తి కోసమై, వెట్టి చాకిరి విముక్తి కోసమై, తమ భవిష్యత్తు తరాల పిల్లల కోసమై ప్రాణాలర్పించారు. ఈ నేల మీ అందరికీ స్ఫూర్తే కాకుండా మీ లక్ష్యాలను మరింత ఇనుమడింపచేసుకోవటానికై, పోరాట స్ఫూర్తిని గుండెల నిండా నింపుకోటానికై దోహదపడుతుందని భావిస్తున్నాను.

సామాజిక మార్పుకు, అంతరాలు, దొంతరాలు, దొరతనాలు లేని సమాజాన్ని కలగన్న వాళ్లలో అగ్రగణ్యుడు అంబేద్కర్, అందుకోసమే సామాజిక మార్పులకోసం గొప్ప రాజ్యాంగాన్ని మనకిచ్చి మనం చేయవలసిన పనికి తోవ చూపించారు. మనం ఆ బాటలో నడిచామా ? లేక తోవ తప్పామా ? ఆ ప్రవచనాలను కేవలం వల్లెవేశామా ? ఆచరణకేమైనా ప్రయత్నం చేశామా? ఆ బాధ్యతను మనం ఎంత వరకు నెరవేర్చుకోగలిగాం. నెరవేర్చుకోలేకపోతే అందుకు కారణాలు ఏమిటి ? దానికున్న అడ్డంకులేమిటి ? అవి ఎలా తొలగించుకోవాలి ? మన ప్రణాళికను ఆ లక్ష్య సాధనకై ఎలా ఎక్కుపెట్టాలి? ఇలాంటి ప్రశ్నలన్నింటికి సమాధానాలు వెతుక్కునేందుకే మనమిక్కడ గుమిగూడాం. ఇది కేవలం తిరునాళ్ళు కాదు. ఒక అసంపూర్తిగా ఉండిన మహత్ కార్యాన్ని కొనసాగించే వారసులుగా, ముందుకు తీసుకుపోవలసిన బాధ్యతకు కొనసాగింపుగా ఇక్కడ జమయ్యాం. ఈ రెండు, మూడు రోజులు ఈ కార్యక్రమాన్ని భాధ్యతాయుతంగా పూర్తి చేసుకొని కార్యదీక్షతో ఇక్కడ నుంచి కదులుతారని ఆశిస్తున్నాను.

మనం ఈనాడు విద్య ద్వారా సమానత్వాన్ని ఎలా తీసుకురాగలమో నన్న సందేశాన్ని ఈ మహాసభ ఇవ్వబోతున్నది. సమత్వం కోసం సాగుతున్న సమరంలో చదువు పాత్ర ఎంత కీలకమో చర్చించేందుకు మీరంతా ఒక్కొక్క సామాజిక కార్యకర్తగా, ఒక్కొక్క చామ్‌స్కీగా, ఒక్కొక్క ఫాలో ఫ్రెరీగా మీ ఆలోచనలను ఇక్కడ ఆరబోయబోతున్నారు. ఆచరణకు కావలసిన ప్రాతినిధ్యాన్ని సన్నద్ధం చేసుకోబోతున్నారు. సమాజం కష్ట సమయంలో ఉన్నప్పుడు ఆదుకునేవాడు ఉపాధ్యాయుడు, ఆ పాత్రను పోషించేందుకు ఈ మహాసభ ఒక రిహార్సల్ అనుకుంటున్నాను

విద్యారంగంపైన అంబేద్కర్ పెద్ద బాధ్యత పెట్టారు. విప్లవాలు, పోరాటాలు సమానత్వాన్ని ఎలా సాధించాయో అదేవిధంగా విద్య ద్వారానే సామాజిక మార్పును సాధించవచ్చునని ఆయన ఆశించారు. ఇదొక కొత్త ప్రయోగం. మనం ఏదో పొట్టపోసుకోవటానికోసం వచ్చిన ఉద్యోగులం కాదు. సమ సమాజ నిర్మాణం కోసమై ఏకమైన సైనికులమని మర్చిపోకూడదు. ఇది సులభమైన కార్యం కాదని నాకు తెలుసు. ఈనాడు మార్కెట్ శక్తులు చాలా బలపడ్డాయి. సోషలిజం విఫలమైందని ప్రచారం చేసిన మనషులే, దేశాలే నేడు ఆర్థిక సంక్షోభంలో చిక్కుకు పోయాయి. దాని ప్రభావం మన దేశంపైన కూడా ఎలా పడుతున్నదో మీరు కళ్లారా చూస్తున్నారు. మన దగ్గర చదువుకున్న పిల్లల ప్రతిభను చూసి మనము, ఇతర దేశాలు మురుస్తున్న కాలంలో వారు వీధిలో పడ్డారు. కేవలం సాంకేతిక పరిజ్ఞానమే సరిపోదు. దానికంటే మించినది సామాజిక పరివర్తన, మానవత్వ లక్షణాలు ఎంతో ముఖ్యం. ఇవి లేకుండా కనపడే మెరుపులు అవి నీళ్ల మీద రాతలేనని తెలిసి పోయింది. కాబట్టే మనం తరగతి గదిలో సమాచార సేకరణే కాదు, మానవ కళ్యాణం కోసమై కావలసిన భూమికను సన్నద్ధం చేసే సమిధలం అన్న విషయాన్ని మర్చిపోకూడదు. తరగతి గదిలో ఏవిధంగా మానవత్వపు బీజాలు నాటాలో

నిర్ణయించుకొనేందుకు, దాన్ని రచించుకునేందుకు ఇక్కడ మనం ఏకమయ్యాం. ఈ 60 సంవత్సరాలలో అభివృద్ధి జరగలేదని నేననటంలేదు. మనం సాంకేతికంగా ఎదగలేదని నేననటం లేదు. మన అభివృద్ధి ఎవరి కోటలు కట్టడం కోసమై, ఎవరి గడీలు నింపడానికై ఉపయోగపడ్డదో ఆలోచించండి. మన శ్రమ, మన పిల్లల శ్రమ ఎవరికి ధారాదత్తం అవుతుందో ఆలోచించండి. ఇలా ఎందుకు జరుగుతుందో ఆత్మ విమర్శ చేసుకుందాం ! ఈనాటి వరకు కూడా అట్టడుగు వర్గాల వారు మాట్లాడే భాష, వారి జీవన విధానం ప్రస్తుత సమాజానికి చిన్న చూపేకదా ! భాష ఒక సమూహం లేదా ఒక వర్గం యొక్క లక్షణాలను తెలియజేస్తుంది. సమాజంలో 85 శాతంగా ఉన్న బహుజన సమూహాలు మాట్లాడుకునే భాషను తక్కువ చేసి ఆధిపత్య సమాజ భాషనే భాషగా తరగతి గదిలో బోధిస్తున్నాం. ఆధిపత్య సంస్కృతి, భాష ఏ భావజాలాన్ని ప్రచారం చేస్తుంది? అది ఎవరికి దోహదపడుతుంది ? ఏ వర్గానికి ఉపయోగపడుతున్నాదో? ఆలోచించాలి. దాన్ని గురించి చర్చించాలి. భాషతో చెలగాటమాడేది విద్యాలయాలే. వారికి గౌరవం తీసుకువచ్చి, సమాజ పరివర్తనకు ఉపయోగపడే భాషను పాఠ్యపుస్తకాల్లోకి తీసుకురావాలి. కేవలం తరగతి గదిలోనైనా ఆ ఇంటి భాషను మనం చెప్పగలుగుతున్నామా ? మనం నేర్పే అగ్రహార భాషను అట్టడుగు వర్గంపై ఇంకెంతకాలం రుద్దుదాం? దాన్ని మార్చండి ? పలకలపై ఇంటి భాషను రాయించండి? ఇది మొదటి మెట్టు. ఎన్నో పోరాటాల తర్వాత విద్య హక్కుగా మారింది. ఈనాడు ఒక్కడుగు ముందుకు వేశాం. విద్యాహక్కు బిల్లు మా హక్కు అన్నాం. కానీ దాన్ని పరిశీలిస్తే పాలకులు తమను కాపాడే బిల్లుగా మార్చారు. ఉదాహరణకు డ్రాప్-అవుట్ అన్నారు. వాళ్లు బడికి రాకుండా రాలిపోయే వారన్నారు. దానికి కావలసిన బందోబస్తు ఏర్పాట్లు చేశారు. వాస్తవంగా పిల్లవాడు రాలిపోతున్నాడా ? లేక విద్యార్థి బడి నుంచి వెళ్లిపోయే పరిస్థితి కల్పిస్తున్నారా? వారిని ఈ బడిలోకి రానివ్వకుండా అట్టడుగు వర్గాలకు ఈ సమాజం ఏం కల్పించిందో ఆలోచించాలి. పొమ్మనకుండా పొగబెట్టినట్లు చేస్తుందీ వ్యవస్థ, ఈ దృష్టి మారకుండా డ్రాప్-అవుట్‌ను తగ్గించటం అసాధ్యం.

కాబట్టి మిత్రులారా ! సమాజంలో మన బడి అంతర్భాగం, ఈ అంతర్భాగాన్ని అలాగే అనాధలాగా ఉంచితే ఈ సమాజం ఎప్పటికీ ఎదగదు. కాబట్టి మనం పిల్లల బడిలో, సమాజం బడిలో రెండింటిలో పనిచేయాలి. త్యాగం, పట్టుదల, అధ్యయనం, ఆచరణ ఉంటేనే అది సాధ్యం అవుతుంది. కాబట్టి ఈ మహాసభ ఆ ఆచరణను తొడుక్కుంటుందని ఆశిస్తున్నాను.

**ఉపాధ్యాయుడు - హోదా**

జాతి నిర్మాణ సౌధాన్ని భుజస్కంధాలపై మోసే ఉపాధ్యాయుడి పాత్ర, హోదా గురించి. ఎప్పటికప్పుడు సమీక్షిస్తుండాలి. ముఖ్యంగా ప్రపంచీకరణ ప్రచండ గాలులలో అనేక కొత్త ఉపాధి అవకాశాలు పుట్టుకొచ్చి ఆకర్షణీయంగా నిలుస్తున్న నేపథ్యంలో అత్యంత సనాతన ఉపాధ్యాయ వృత్తిని కంటికి రెప్పలా కాపాడాలంటే సమీక్షణం అనివార్యం.

పూర్వం గురువు స్థానం విశిష్టం. చక్రవర్తులైనా, మహారాజులైనా తమ సంతానం జ్ఞానాన్ని ఆర్జించాలంటే గురువులుండే అడవులకు సైతం శుశ్రూషలకు పంపే వారు. కౌమారదశ దాటే వరకూ అరణ్యవాసం చేసి వచ్చేవారు. సామ్రాజ్య చక్రవర్తులే గురువులకు కైమోడ్పులు అర్పించే ఆ రోజులలో సామాన్యులకు గురువులంటే ఆరాధ్య దైవాలే. గురువు శిష్యరికానికి సమ్మతించడమే నాడు వరం. **గురువు స్థానం పరమ పవిత్రం.**

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా కొద్ది దశాబ్దాల వరకు ఉపాధ్యాయుడే గ్రామానికి తల మానికం. పల్లె సీమల్లో ఉపాధ్యాయుడు తప్ప అక్షరజ్ఞానం వచ్చిన వారెవ్వరూ ఉండే వారు కాదు. ఊరి ప్రజలకు ఉపాధ్యాయుడే ప్రత్యక్షదైవం. ఆయన మాటే వేదవాక్కు. ఉపాధ్యాయుడంటే కేవలం తమ సంతానానికి చదువు చెప్పే వాడు మాత్రమేకాదు. ఊరికి ఏ సమస్య వచ్చినా తీర్చగలిగే పరిష్కర్త. అందరికంటే నాలుగు ఆకులు ఎక్కువ తెలిసిన జ్ఞాని.

**ఉపాధ్యాయుడు సమాజంలో అపురూప సత్కారాలు అందుకున్న మరపురాని కాలం అది**

1990 దశకం తర్వాత పరిస్థితి పూర్తి భిన్నమైంది. ప్రపంచీకరణ ప్రభావం ఒక్కొక్క రంగాన్ని తాకుతున్న కొద్దీ దేశ ఉపాధి - వృత్తులలో వినూత్న మార్పులు వచ్చాయి. చాలావృత్తులు అంతరించాయి. కొన్ని వృత్తులు మసకబారాయి. కొత్త వృత్తులు జీవం పోసుకున్నాయి. ఇలా మసకబారిన వృత్తుల్లో ఉపాధ్యాయ వృత్తి ఒకటి. ఉపాధ్యాయ వృత్తి గత ప్రాభవం కోల్పోయిందని విద్యపై పనిచేసిన అనేక కమిషన్లు ఘోషించాయి. ఉపాధ్యాయ వృత్తి, హోదాలు చెప్పుకోదగినంత సంతృప్తికరంగా లేవని మొదలియార్ కమిటీ పెదవి విరిచింది. ప్రస్తుతం ఉపాధ్యాయుడికి సమాజంలో తగినంత గుర్తింపు, హోదా లేవని ఒక సర్వేలో 82 శాతం మంది అభిప్రాయపడ్డారు. ఇదే సర్వేలో 65.1 శాతం మంది ఉపాధ్యాయులే తమ పిల్లలు ఈ వృత్తిలోకి వచ్చేందుకు సుముఖంగా లేరని చెప్పారు. దీనిని బట్టి, ఉపాధ్యాయ వృత్తి ఎంతగా మసకబారిందీ తేటతెల్లమవుతోంది. మరోపక్క 700 మంది ఉపాధ్యాయుల అభిప్రాయాలు సేకరిస్తే వారిలో 90 శాతం మంది తాము ఇష్టపూర్వకంగా ఈ వృత్తిలోకి రాలేదని వెల్లడించారు. మొత్తం ఉపాధ్యాయ వృత్తికి మునుపటి ఆకర్షణ రాలేదనేది నిజం.

ఇతర వృత్తులను తక్కువ చేయడం కాదుగానీ ఉపాధ్యాయ వృత్తికి ఆపాదించి ఉన్న ప్రాధాన్యం, బాధ్యత దృష్ట్యా దీనిని ప్రత్యేకంగా చూడాల్సిందే ఈ ప్రపంచంలో నేను ఇద్దరికి రుణపడి ఉంటానని గ్రీకు యోధుడు అలెగ్జాండర్ అంటారు. ఒకరు తనను పై నుంచి భువిపైకి తీసుకువచ్చిన తల్లిదండ్రులైతే, మరొకరు ఈ భువినుంచి ఎత్తున ఉన్న ఆకాశానికి చేర్చిన గురువు అంటారు. అయితే, ఉపాధ్యాయుడిని తల్లిదండ్రులతోనూ సమానంగా చూడలేం. అంతకంటే ఎక్కువగానే చూడాల్సి ఉంది. ఎందుకంటే శిశువును కొంత వరకు సామాజీకరణ చేసి తల్లిదండ్రులు స్కూలుకు పంపివేస్తే ఆపై దేశం నిర్దేశించిన లక్ష్యాల మేరకు మంచి పౌరుడిగా తీర్చిదిద్దేది ఉపాధ్యాయుడేనని మరువరాదు. ఉదాహరణకు మన రాజ్యాంగం పౌరులందరూ ప్రజాస్వామ్య, లౌకిక స్ఫూర్తి కలిగి ఉండాలని భావిస్తుంది. ఈ మేరకు బాధ్యత వహించేది ఎవరు? ఉపాధ్యాయుడే. సమాజంలోని అన్ని వృత్తులు ప్రధానమే అయినప్పటికీ ఉపాధ్యాయ వృత్తిని పదిలంగా చూసుకుంటే అన్ని రంగాలకు కావలసిన నిపుణులు వారి చేతుల మీదుగానే తయారవుతారు.

ప్రాధాన్యం రీత్యా అన్ని వృత్తులకంటే ఉత్కృష్ట స్థానాన్ని పొందిన ఉపాధ్యాయ వృత్తిలోకి అత్యంత ప్రతిభాపాటవాలుగల వారు రావాలంటే ఈ వృత్తి అన్నింటికంటే ఆకర్షణీయంగా ఉండాలి. ఉపాధ్యాయ వృత్తిపై అభిరుచి కొద్దీ వచ్చినా వేతన భత్యాలు ఆకర్షణీయంగా లేకపోతే ఎక్కువ కాలం నిలువలేక మధ్యలోనే నిష్క్రమిస్తారు. ఇటీవల ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ గ్రూప్-2 ప్రకటించిన తుది ఫలితాలలో ఎంపికయిన 1200 మందిలో 98 శాతం మంది ఎస్.జి.టిలు స్కూల్ అసిస్టెంట్లే కావడం ఇక్కడ ప్రస్తావించాలి. వీరంతా గత ఒకటి, రెండు డియస్సి రిక్రూట్‌మెంట్లు ద్వారా సర్వీసులోకి ప్రవేశించిన వారే కానీ అప్రెంటీస్ విధానం పేరిట చాలీచాలని వేతనంతో సర్దుకోలేక, సుదీర్ఘకాలం ప్రమోషన్ కోసం నిరీక్షించే ఓపిక లేక ఈ వృత్తిని వదిలి అడ్మినిస్ట్రేటివ్ పోస్టుల్లోకి వెళ్లిపోతున్నారు. ప్రభుత్వం కేవలం నిరుద్యోగులకు తాయిలంలా నియామకాలు చేయడంతోనే సరిపోదు. ఈ వృత్తిలో నిలబడేందుకు తగిన విధంగా ఆకర్షణీయంగా మార్చాలి. ఏ కాలం తీసుకున్నా, మరే ఇతర వృత్తులతో పోల్చిచూసినా, వేతనాలు, ఇతర సౌకర్యాల విషయంలో ఉపాధ్యాయ వృత్తి మరే వృత్తితోనూ తీసిపోరాదు. అసలు ఈ విషయంలో అన్ని వృత్తుల కంటే ఉపాధ్యాయ వృత్తి అగ్రగామిగా ఉండాలి.

ప్రభుత్వాలు మరొక విషయాన్ని గమనంలోకి తీసుకోవాలి. ఉపాధ్యాయుడు సమాజంలో భాగం. ఉపాధ్యాయుడు నిర్వర్తించే బృహత్ బాధ్యతలకు అంతరాయం కలిగినా, అందుకు తగిన ప్రోత్సాహకరమైన పరిస్థితులు ప్రభుత్వాలు కల్పించకపోయినా నిరసన తెలిపే ప్రజాస్వామిక హక్కు ఉపాధ్యాయుడికి ఉంటుంది. టీచర్లు సమ్మె చేయరాదన్న వాదన అసమంజసం. మిగతా వృత్తి వర్గాల వారివలే ఉపాధ్యాయుడికీ సమ్మెచేసే అధికారం, ఉద్యమాలు చేసే హక్కు ఉంది. అయితే మిగతా ఉద్యోగ వర్గాలు చేసే సమ్మెకూ ఉపాధ్యాయులు తెలియజేసే నిరసనకు తేడా కన్పించాలి. భావితరాన్ని తయారు చేసే బాధ్యతల్ని మోస్తున్న ఉపాధ్యాయుల నిరసన సమాజానికి ఆదర్శప్రాయంగా ఉండాలి. అలాగే పాలకులు కూడా ఉపాధ్యాయులు తమకే విశ్వాస పాత్రులుగా ఉండాలని భావించరాదు. ఉపాధ్యాయ వృత్తి నిరంతర స్రవంతి లాంటిది. ఏ ప్రభుత్వాలు

ఉన్నా, ఏ రాజకీయ పక్షం అధికారంలో ఉన్నా ఈ స్రవంతి ఆగదు. తన బాధ్యత విస్మరించరాదు. ఉపాధ్యాయులు ప్రభుత్వాలకు కాక సమాజానికి విశ్వాసపాత్రులుగా ఉంటారు. వారు సమాజానికి పూచీ వహిస్తారు. దీనిని ప్రభుత్వాలు అర్థం చేసుకోవాలి. ఈ విషయంలో ఉపాధ్యాయుల హోదాను ప్రభుత్వాలు కాపాడాలేతప్ప తమకు ఊడిగం చేయాలని భావించరాదు.

ఉపాధ్యాయుడంటే ఒకనాడు జ్ఞాని. సర్వజ్ఞుడు. సామాన్యుడు ఉపాధ్యాయుడిని మేధావిగా చూసేవాడు. నేటి ప్రపంచీకరణ కాలంలో కూడా టీచరంటే విద్యావంతులైన తల్లిదండ్రులతో సహా యావన్మందికీ ఎనలేని గౌరవభావం. సమాజం అందిస్తున్న ఈ హోదాను ఉపాధ్యాయ వర్గం పదికాలాలపాటు నిలుపుకోవాలంటే తన జ్ఞానాన్ని (సబ్జెక్టు) నిరంతరం మెరుగుపరుచుకోవాలి. నేటి విద్యార్థి మునుపటి తరాలన్నింటి కంటే అత్యంత ప్రతిభాశాలి. అటువంటి విద్యార్థులకు మార్గదర్శనం చేయాలంటే ఉపాధ్యాయుడు నిత్య విద్యార్థిలా తన జ్ఞానాన్ని పెంపొందించుకుంటూ ఉండాలి. ఉపాధ్యాయుడు తాను చదివిన చదువుతో రాబోయే నాలుగైదు తరాలకు నిలబడే విద్యార్థులకు విద్య అందించాలి. అంటే ఉపాధ్యాయుడు ఎప్పటికప్పుడు సమకాలిన జ్ఞానాన్ని తన పూర్వజ్ఞానానికి జోడించుకుంటేనే నిత్యనూతనంగా ఉండగలుగుతాడు విద్యార్థి. తల్లిదండ్రుల ముందు నిలబడ గలుగుతాడు. తన హోదాను పదిలపర్చుకోగలుగుతాడు.

ఒక దేశం సమున్నత కీర్తి శిఖరాలకు ఎదిగినా, మరొక దేశం అధః పాతాళానికి దిగజారిపోయినా ఆ బాధ్యత అంతా ఆ దేశ విద్యా వ్యవస్థదే. ఆ విద్యా వ్యవస్థ రథ చోదకులు ఉపాధ్యాయులే. వారికి మంచి జీవితం, సామాజిక హోదా, భద్రతా కల్పించాల్సిన బాధ్యత సమాజంపై ఉంది. ఉపాధ్యాయుడిని గౌరవించే దేశం తనను తాను గౌరవించుకున్నట్లేనని మరువరాదు.

**చివరిగా నామాట**

ఉపాధ్యాయ ఉద్యమంలో వచ్చిన మార్పులపైన నేను ఒక కార్యకర్తగా కొన్ని సార్లు బాధపడినా, మీ పోరాటపటిమను చూసి శ్లాఘించుచున్నాను. ఉద్యమం పెరిగినకొద్దీ వివిధ శక్తుల యొక్క ఎత్తుగడలు కూడా మారుతూ వుంటాయి. వీటిని అధిగమించి ఉద్యమాలు నిర్మించినవాడే చరిత్రలో నిలిచిపోతాడు, అటువంటి కార్యకర్తల మధ్య ఉన్నందుకు గర్వపడుతున్నాను. సంఘాల యొక్క గౌరవము సభ్యత్వాలపైననే అధారపడదు లేక ఆదరణ పైన కూడా ఆధారపడదు మీ త్యాగాలే, మీ అధ్యయన శక్తే, మీ క్రమశిక్షణే సంఘానికి గౌరవం తెస్తాయి. రాజీలకు తావుండకుండా సిద్ధాంత పరమైన విశ్లేషణలతో సంఘానికి మంచి పునాది వేస్తారని నేను అశిస్తున్నాను. ఇదే లక్ష్యంతో మీ భావి కార్యక్రమాన్ని నిర్ణయించుకోవాలని నావిజ్ఞప్తి.

## ఎన్‌కౌంటర్

**- బి. శీనయ్య**, నెల్లూరు జిల్లా

ప్రేమోన్మాదంతో
కళాశాలల్లో అడుగుపెట్టడంలేదు యువత.
అడుగు పెట్టిన తర్వాత, ఉన్మాదం
తలకెక్కడమే వింత.
ఆయేషా మృత్యు ఘోష
కళ్ళముందే కదలాడుతోంది
శ్రీ లక్ష్మి ఆర్తనాదం
వినిపిస్తూనే ఉంది
స్వప్నిక, ప్రణీతలపై యాసిడ్ దాడి
'స్వప్నం'లా వెంటాడుతోంది
భార్గవి హత్య
భయపెడుతూనే ఉంది

ఎవరిదీ పాపం
ఎక్కడుందీ లోపం
యువకులకెందుకంత కోపం
యువతులకెందుకింత శాపం

ఇప్పుడు తెలియాలి నిజం
ఇది సామ్రాజ్యవాదుల ఇజమని
బహుళజాతి సంస్థలు వేసిన బీజమని
ఇకనైనా మేల్కొందాం
సామ్రాజ్యవాదుల ముసుగును తొలగిద్దాం
మన సంస్కృతిని కాపాడుకుందాం.

'సమస్యలో' కొట్టుకుపోతున్న వారిని కాదు,
'సమస్య'కి చేయాలి ఎన్ కౌంటర్
క్లబ్బులు, పబ్బులకు వెళ్ళడం కాదు
సామ్రాజ్యవాద విష సంస్కృతిని
కాలి బూటుతో తన్న గలిగిన
'ఖైదీ'లు కావాలిప్పుడు

ప్రసారమాధ్యమ యాజమానులారా!
ప్రచార వేదిక నాయకులారా!
బాధ్యత మీదే,
దేశ భవిష్యత్తు విషాదమైతే
అది మీ బాధ్యతే సుమా!


ఫారం-IV

**ఐక్య ఉపాధ్యాయ**

**యాజమాన్యం, తదితర వివరాల స్టేట్‌మెంట్**

| | | |
|---|---|---|
| ప్రచురణ స్థలం | : | హైదరాబాదు |
| ప్రచురణ కాలం | : | మాసపత్రిక |
| ముద్రాపకుని పేరు | : | **ఐ. వెంకటేశ్వర రావు** |
| జాతీయత | : | భారతీయుడు |
| చిరునామా | : | 1-2-288/8<br>చెన్నుపాటి భవన్, గగన్‌మహల్ రోడ్ నం.7<br>దోమలగూడ, హైదరాబాదు-500 029 |
| ప్రచురణకర్త పేరు | : | ఐ. వెంకటేశ్వర రావు |
| జాతీయత | : | భారతీయుడు |
| చిరునామా | : | పైన తెలిపినదే |
| సంపాదకుడు | : | **చావ రవి** |
| చిరునామా | : | పైన తెలిపినదే |
| యాజమాన్యము | : | పత్రిక ఆస్తులన్నీ ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ రాష్ట్ర కమిటీకి చెందినవి. |

ఐ. వెంకటేశ్వర రావు అను నేను పైన ప్రకటించిన వివరములు యదార్థములని పేర్కొనుచున్నాను. (సం.) **ఐ. వెంకటేశ్వర రావు**
ప్రచురణ కర్త

# విద్యా సదస్సులో వక్తల ప్రసంగాలు

**విద్యా సదస్సుకు అధ్యక్షత వహించిన యుటియఫ్ నేత, పిడిఎఫ్ ఫ్లోర్ లీడరు డి. రామిరెడ్డి :-** ప్రతి పార్టీ తమ ఎన్నికల ప్రణాళికలో, గవర్నర్ ప్రసంగంలో విద్యారంగానికి తామెంతో చేశామని చెబుతూ వచ్చారు. మన రాష్ట్రాన్ని ఎక్కువ కాలం కాంగ్రెస్ పార్టీ ఒక దశాబ్దం పాటు టిడిపి వారు పాలించారు. విద్యా రంగంలో ఈ యాభై సం॥లలో వచ్చిన మార్పులు ఇప్పటి వరకు ఏం జరిగినది, ఇంకా ఎప్పటికి అందరికీ అక్షరాస్యత అందుతుంది. అందరికీ నాణ్యమైన విద్య అనేది లభిస్తుందా మీ పార్టీల తరపున దానికనుగుణంగా మీరు మీ ఎన్నికల ప్రణాళికలోగాని లేక పోతే మీ కార్యక్రమంలోగాని ఏ రకంగా జనానికి చెప్పబోతున్నారో స్పష్టంగా చెప్పాలని కోరుతున్నాం. రెండు పార్టీల పరిపాలన చవి చూశాం. మేము రెండు పార్టీల పాలనా కాలాన్ని, ఒకరు వేసిన అడుగుల్లో రెండవ వారు అడుగులు వేసిన ఘటనలే ఎక్కువ కాక పోతే దారిలో చెప్పులరిగి పోతే అటూ ఇటూ తిరిగారు తప్ప ప్రయాణం ఒకే రకంగా సాగింది. ఇప్పుడు ఆ పద్ధతి సాగదు. 21వ శతాబ్దంలో సాంకేతిక విప్లవం వచ్చింది. అందువల్ల ఏఏ మార్పులు చేయబోతున్నారో? కేటాయింపుల్లో, సిలబస్‌లో ఏం మార్పులు, విద్యా విధానంలో ఏం మార్పులు, మాతృ భాషను ఎలా పరిరక్షించబోతున్నారో? మాతృ భాషలో విద్యా బోధనకు భంగం కలుగకుండా ఇంగ్లీషు భాషను ఎలా ప్రవేశ పెట్టబోతున్నారో, పాఠశాలల భౌతిక పరిస్థితుల మెరుగుదలకు కేటాయింపులు ఎలా వుంటాయో ఇవన్నీ కూడా ఆయా పార్టీల ప్రతినిధులు మాట్లాడేటప్పుడు క్లుప్తంగా చెబితే ఈ గోష్టి అనంతరం కన్సాలిడేట్ చేసి, ఎన్నికల అనంతరం ఎవరు అధికారంలోకి వస్తారో వారిని, మీరు ఎన్నికలకు ముందు వాగ్దానాలు చేశారు వీటిని అమలు చేస్తారాలేదా అని రాబోయే 6 సం॥ల కాలంలో ఉద్యమాలు నిర్వహించటానికి బేస్‌గా ఉపయోగపడుతుంది.



**యుటియఫ్ ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ విద్యా పత్రం ప్రవేశ పెడుతూ**

ఈ రోజు మన రాష్ట్రంలో విద్యారంగం ప్రధానంగా ప్రాథమిక విద్య, పాఠశాల విద్య పునాది రంగాలకు సంబంధించి ఈనాటి పరిస్థితి ఏ విధంగా ఉంది అనేది పరిశీలిస్తే, ప్రభుత్వాలు ఎన్ని మారినా కానీ పాఠశాల విద్యారంగం బాగుందా అంటే బాగున్నట్లే చాలామంది చెప్పుకుంటున్నారు. మర్యాదకోసం. మేము ఆం.ప్ర. ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) నిర్మొహమాటంగా, నిజాయితీగా మాట్లాడదలుచుకున్నాం. కనుక రాష్ట్రంలో పాఠశాల విద్యారంగం ఏంబాగాలేదు చాలా ఆందోళనకరంగా ఉన్నదని చెప్పదలుచుకున్నాం. వేదికపైనున్నటు వంటి రాజకీయ పక్షాల నాయకులు మాట్లాడతారు కనుక వారి యొక్క సందేశాల ద్వారా ఈ విద్యారంగాన్ని బాగుచేసుకొనే దానికోసం మార్గాల్ని అన్వేషించాలని చెప్పి మేము ఆశించేది. ఎందుకంటే ఈ రోజు రాష్ట్రంలో మేధావులకు, విద్యావేత్తలకు కొరతలేదు. ఈ రోజు రాష్ట్రంలో పరిస్థితి చూస్తే స్వాతంత్ర్యం వచ్చి మన రాష్ట్రం ఏర్పడి ఇన్ని సంవత్సరాలు గడుస్తూవుంటే మౌలికమైన రంగం విద్యారంగం గనుక ఈ రంగాన్ని అభివృద్ధి చేయాలంటే ఏం పరిష్కారం చేయాలి? ఏం చర్యలు చేపట్టాలి అనే వాటిపై సమగ్ర అవగాహన వుండాలి. అందరికీ అక్షరాస్యత రావాలంటే, అందరినీ విద్యావంతుల్ని చేయాలంటే రాష్ట్రాభివృద్ధికి విద్యారంగం ఉపయోగకరంగా వుండాలంటే ఏం చేయాలి? మన ఎడ్యుకేషన్ పాలసీ ఏమిటి? సిస్టం ఏమిటి? ఏ రకంగా ఉండాలి అనే అంశాలపై 27 ఏళ్ళ క్రితం రాష్ట్రంలో ఒక సమగ్రమైన చర్చ జరిగింది. అప్పట్లో ప్రతిపక్ష నాయకులుగా ఉన్నట్టువంటి పుచ్చలపల్లి సుందరయ్య గారు రాష్ట్ర విద్యారంగంపై ఎంతో దూరదృష్టితో ఆలోచించి ఒక డాక్యుమెంటును ఆయన అసెంబ్లీలో ప్రవేశ పెట్టారు. దానిపై ఆనాడే అసెంబ్లీలో చాలా సీరియస్ డిబేట్ జరిగింది. ఆ చర్చ దరిమిలా ఈ రాష్ట్ర విద్యారంగాన్ని అభివృద్ధి చేయాలంటే విద్యా విధానాన్ని మొత్తం సమగ్రంగా సమీక్షించే దాని కోసం ఒక కమిటీ కావాలని ఆరోజు ప్రభుత్వం ఆలోచించింది. అందుకే రాష్ట్ర స్థాయి విద్యా కమీషన్‌ను ఏర్పాటు చేయడానికి ప్రయత్నం చేశారు. కృష్ణారావు కమిటీని వేశారు. వారి సూచనలు, సలహాలు సిఫారసులను పరిగణనలోకి తీసుకొని రూపొందించిందే విద్యా చట్టం 1/82. అది పాఠశాల విద్యారంగానికే పరిమితమైనాసరే ఒక సమగ్రమైన చట్టాన్ని రూపొందించారు. ఆ చట్టం వచ్చి ఇప్పటికి 27 సం॥లు. ఈ కాలంలో ఆ చట్టానికి అనేక రకాల సవరణలు చేశారు. సవరణల ఫలితంగా ఇప్పుడు ఆ చట్టం అత్యంత బలహీనమైన చట్టంగా మారిపోయింది. నిస్సారంగా, అలంకార ప్రాయంగా మిగిలిపోయింది తప్ప ఇతర ప్రయోజనం లేదు. నియంత్రణలన్నీ ఎత్తివేసి ప్రైవేటు విద్యా వ్యాపారులు యధేచ్ఛగా వ్యాపారం చేసుకునేందుకు వీలుగా అవకాశం కల్పించారు.



అందువలన ఈ రాష్ట్ర విద్యారంగాన్ని అన్ని కోణాల నుండి సమగ్రమైన పరిశీలన చేసి, రాష్ట్ర విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యలకు సరైన పరిష్కారం కనుగొనే దాని కోసం రాష్ట్ర స్థాయి విద్యా కమీషన్ కావాలని మేము ప్రతిపాదిస్తున్నాము.

అందు కోసం ఒక చర్చా పత్రాన్ని ఈ విద్యా సదస్సులో ప్రతిపాదిస్తున్నాను. దీనిపైన వక్తల అభిప్రాయాలను, సూచనలను పరిగణనలోకి తీసుకొని తరువాత రెండు రోజులు జరిగే ప్రతినిధుల సభలో దీనిని మరింత లోతుగా చర్చించి పరిపుష్టం చేసి ఆమోదించి రాష్ట్ర ప్రభుత్వానికి, అన్ని రాజకీయ పార్టీల నాయకులకు కూడా అందజేస్తామని, ఆ రకంగా రాష్ట్ర విద్యారంగం అభివృద్ధి కోసం శక్తివంచన లేకుండా కృషి చేస్తామని తెలియజేస్తున్నాము.

**కాంగ్రెస్ పార్టీ అధికారి ప్రతినిధి యన్. తులసిరెడ్డి**

మహాశయులారా సమాజంలో అనేక రంగాలున్నప్పటికీ విద్యారంగానికి ఒక ప్రత్యేక ప్రాముఖ్యత ఉన్నదని నా అభిప్రాయం, కాంగ్రెస్ పార్టీ అభిప్రాయం. సమాజంలోని ప్రతి రంగానికి ఒక నిపుణుడిని, ఒక ప్రముఖుని, ఒక నిష్ణాతుని అందించేది విద్యారంగం, అందుకు భారత దేశ భవిష్యత్ తరగతి గదిలోనే నిర్మిత మవుతుందన్నాడు ప్రఖ్యాత విద్యావేత్త కొఠారీ మహాశయుడు. మొత్తం విద్యారంగంలో ప్రధానమైనది ప్రాథమికమైనది. పాఠశాల విద్య, దీనికి సంబంధించి ఎలిమెంటరీ ఎడ్యుకేషన్‌కుగానీ స్కూల్ ఎడ్యుకేషన్‌కుగానీ ప్రధానమైన పిల్లర్స్ నాలుగు ఒకటి ప్రభుత్వ విధానాల ద్వారా, రెండవదేమో తల్లిదండ్రులు, మూడవదేమో విద్యార్థులు, నాలుగవది అతి ప్రధానమైనది ఉపాధ్యాయులు. ఈ నాలుగు స్తంభాలు సక్రమంగానే ఉన్నాయా? అనే విషయాన్ని ఆలోచించి, ఏవైనా లోటుపాట్లు వుంటే అందరమూ ఆలోచించి సరి చేయాల్సి వుంటుంది. గత అనేక సంవత్సరాలుగా అనేక మార్పులు జరిగాయి. మనం ఒక్కసారి లిటరసీ తీసుకుంటే, నాణానికి బొమ్మ, బొరుసుల వలే రెండూ వున్నాయి. ఒక వైపు చూస్తే 1961లో కేవలం 21.9% ఉండే అక్షరాస్యత 2001కి మన రాష్ట్రంలో 60.47%కి వచ్చింది సంతోషం అది నాణానికి ఒక



వైపు. కానీ నాణానికి మరోకవైపు 60.47% అంటే 40% నిరక్షరాస్యత ఉంది. దానిని గురించి కూడా ఆలోచించాలి. ఈనాడు దేశంలో మనం 28వ స్థానంలో ఉన్నాం! దాని గురించి బాధపడాలి. కేవలం ఒక ఉత్తర ప్రదేశ్, బీహార్, రాజస్థాన్ వంటి రాష్ట్రాలు మాత్రమే మనకంటే అధ్వాన్న స్థితిలో ఉన్నాయి. మిగతా రాష్ట్రాలన్నీ మనకంటే బాగున్నాయే! కాబట్టి దాని గురించి బాధపడాల్సిన పరిస్థితి మరొకవైపున ఉన్నది. ప్రత్యేకంగా పొరుగు రాష్ట్రాలు కేరళగానీ, తమిళనాడుగానీ, కర్నాటకగానీ ఈ రాష్ట్రాలతో పోల్చుకుంటే అక్షరాస్యతా శాతంలో చాలా వెనుకబడి వున్నాం అది బాధాకరమైనటువంటి విషయం. మరి ఈ నేపథ్యంలో నేను ఒక వ్యక్తిగానే గాకుండా కాంగ్రెస్ పార్టీ అధికార ప్రతినిధిగా కూడా హాజరైనాను కాబట్టి పార్టీ మానిఫెస్టోలో పెట్టి ప్రభుత్వ పరంగా ఇంప్లిమెంట్ చేస్తాము. మేనిఫెస్టోలో మా గవర్నమెంటు వచ్చిన తర్వాత నేను ముందుగా చెప్పినట్లు, ఈ నాలుగు స్తంభాలకు సంబంధించి ఏమి చెయ్యాలి అని ఆలోచించినప్పుడు ఒక కుమ్మరి బంకమట్టిని తీసుకొని తన హస్తకళా కౌశలంతో అందమైన, ఆకర్షణీయమైన మృణ్మయ పాత్రను సమాజానికి అందిస్తాడో ఆ విధంగా ఉపాధ్యాయుడు ఒక నిరక్షర కుక్షిని తీసుకొని, విద్యాగంధం నేర్పి సమాజానికి అందించే బృహత్తరమైన బాధ్యత తనపైన వేసుకుంటాడు. కాబట్టి ఆ ఉపాధ్యాయునికి ప్రోత్సాహం ఇస్తూనే, కమిట్‌మెంట్‌ను గుర్తు చేస్తూనే ఉపాధ్యాయుడు నిరాశా నిస్పృహలకు లోను కాకుండా ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో కొన్ని సందర్భాలలో ఆర్థికంగా, కొన్ని సందర్భాలలో ఒక్క మంచి మాటతో అన్ని విధాలుగా ప్రయత్నం చేస్తున్నాము. ఆ నేపథ్యంలో ఉపాధ్యాయులకు సంబంధించి ఒకటి రిక్రూట్‌మెంటు రెండు ప్రమోషన్లు, మూడు ట్రాన్స్‌ఫర్స్, నాలుగు అప్రెంటీస్‌లకు నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వడం చేశాం.వాస్తవం. గతంలో ఎక్కువ రిక్రూట్‌మెంట్లు జరిగినాయి. ఈ గవర్నమెంటు వచ్చిన తర్వాత 2003 డిఎస్‌సి, 2006 డిఎస్‌సిలో నియామకాలు ఇవ్వడం జరిగింది. 2008 డిఎస్‌సి ప్రాసెసింగ్‌లో వుంది. ఉపాధ్యాయులు, ఉద్యోగులకు పిఆర్‌సిని ఆల్‌రెడీ వేయడం జరిగింది. 22% మీరు ఆశించిన దానికంటే, ఊహించిన దానికంటే ఎక్కువగానే ఇంటెరిం రిలీఫ్ ఇవ్వడం జరిగింది. ఇంకా చేయాల్సింది ఎంతో ఉంది.

ఇక విద్యార్థులకు సంబంధించి ఈ ప్రభుత్వం వచ్చిన తర్వాత ప్రధానంగా ఎలిమెంటరీ స్కూల్‌కు సంబంధించి సర్వశిక్షా అభియాన్, సెకండరీ స్కూల్స్‌కు సంబంధించి సక్సెస్ ఈ రెండు పథకాలూ కేంద్ర ప్రభుత్వం యొక్క ఆర్థిక సహాయంతో, రాష్ట్ర ప్రభుత్వం యొక్క బడ్జెట్‌ను జోడించి ఎక్కడ ఏ మేరకు ఇంప్రూవ్ చేయడానికి అవకాశం వుంటుందో ఆ విధంగా చేయడం జరిగింది. ఆ నేపథ్యంలో ప్రప్రథమంగా మిడ్ డే మీల్స్, ప్రధానంగా ఎన్‌రోల్‌మెంట్, డ్రాప్ ఔట్స్ అన్ని క్లాసులకు కూడా దాదాపు అన్ని మండలాల్లో 10వ తరగతి వరకు మధ్యాహ్న భోజనం పెట్టాలని నిర్ణయించడం జరిగింది. నాణ్యమైన విద్య కోసం క్లిప్, క్లాప్స్, 6200 హైస్కూల్స్‌లో కంప్యూటర్ విద్య, అఫ్‌కోర్సు పాఠశాలల్లో ప్రాబ్లం వుంది. వాచ్‌మన్‌లేక, అటెండర్‌లేక కంప్యూటర్స్ దొంగిలించబడిన సందర్భాలున్నాయి. ఒప్పుకుంటాను. కానీ ఓవరాల్‌గా ఈనాడు డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం ప్రకారం సర్వైవల్ ఆఫ్ ద ఫిట్టెస్ట్ (ప్రపంచంలో సమర్థుడే జీవించగలడు, రాణించగలడు) అనే ప్రిన్సిపుల్ మీద ఈనాడు పోటీ ప్రపంచంలో మన విద్యార్థులు కూడా అంతర్జాతీయ స్థాయిలో పోటీ పరీక్షల్లో తట్టుకోవాలి అంటే కంప్యూటర్ విద్య అవసరం. కాబట్టి ప్రభుత్వం ప్రతి ఒక్కరికీ కంప్యూటర్ విద్యను తప్పనిసరి చేసింది. కంప్యూటర్ విద్య వస్తేనే అక్షరాస్యులను గుర్తించాలని భావిస్తున్నాం.

ఎప్పుడైనా ప్రతిభావంతులైన విద్యార్థి నూటికి 90 మార్కులు వచ్చినా 100 రానందుకు అసంతృప్తిగానే వుంటాడు. అదే విధంగా కాంగ్రెస్ పార్టీ, కాంగ్రెస్ ప్రభుత్వం కూడా ఎన్ని చేసినా ఇంకా చెయ్యాలి. ఎంతో చెయ్యాలి విద్యారంగానికి అనే భావిస్తూ వున్నది. ఇన్నోవేటివ్‌గా ఆలోచిస్తావున్నది. ఈసారి ఎలక్షన్ మానిఫెస్టోలో కూడా విద్యారంగం అభివృద్ధిపైన దృష్టి కేంద్రీకరిస్తామని తెలియజేస్తూ, మహాసభలు విజయవంతం కావాలని హృదయపూర్వకంగా ఆశిస్తూ ఆకాంక్షిస్తూ, ఆశీర్వదిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

## పూర్వ పాఠశాల విద్యామంత్రి, టిడిపి నేత మండవ వెంకటేశ్వర రావు



గురుబ్రహ్మ .......... తస్మైశ్రీ గురవే నమః ఈ శ్లోకాన్ని మనసావాచా నమ్మే వాడిని. ఎవరికైనా తలవంచి ఎరగమేమోకానీ ఏ రోజైనా తలవంచి నమస్కరించేది మనస్ఫూర్తిగా గురుదేవులకే. గురుతుల్యుల ముందు మాట్లాడేటప్పుడు బాధ్యతగా వాస్తవాలకు దగ్గరగా మాట్లాడాల్సిన బాధ్యత మాకుంది. ఈనాడున్న సమస్యలు చిన్నవి కావు. ప్రాథమిక విద్యగానీ, ఆరోగ్య విద్యగానీ సమాజానికి రెండు కళ్ళుగాను, సమాజం యొక్క డెవలప్‌మెంట్‌కి ఇండికేటర్స్‌గా మేము భావించటం జరిగింది. ఆరోజు ఎన్ని ఆర్థిక ఇబ్బందులున్నా, మేము అధికారంలోకి వచ్చిన రోజున జీతాలు ఇవ్వడానికే ఇబ్బందైన విషయం కూడా మీ అందరికీ తెలుసు. నెలాఖరులో వచ్చేటటువంటి ఇబ్బందులను కూడా దృష్టిలో పెట్టుకొని మరి ఏ రోజైనా టీచర్ల విషయంలో గానీ విద్యా ప్రమాణాల విషయంలోగానీ చేయాల్సిన ధర్మాన్ని ఆ రోజు చేయటం జరిగింది. మీరందరూ విజ్ఞులైన టీచర్లు ఎన్ని పాఠశాలల్లో టీచర్లు లేనటువంటి పరిస్థితి ఉందో మీకు తెలుసు. ఎయిడెడ్ పాఠశాలల్లో ఎన్ని వేకెన్సీలతో అతలాకుతలమైతుందో మీకు తెలుసు. అటువంటి పరిస్థితిలో మరి ప్రమాణికంగా ఆ రోజున డిఎస్‌సి రిక్రూట్‌మెంట్ చేసుకోవటం జరిగింది. కొఠారి కమీషన్ గాని మిగతా విషయాలుగాని మనం ఆదర్శంగా తీసుకుంటున్నాం. లక్ష కోట్లుగా ఈ రోజున ప్రభుత్వం బడ్జెట్ గురించి చెప్పుకుంటూ ముందుకు వస్తావున్న సందర్భంలో దాంట్లో కూడా విద్యకు కెటాయింపులు పెరగాల్సిన అవసరం ఉందని గుర్తు చేస్తున్నాను. మరి తప్పకుండా కూడా వచ్చే రోజుల్లో రాష్ట్ర బడ్జెట్‌లో విద్యకుగానీ ఆరోగ్యానికిగానీ గణనీయమైన వాటాని కెటాయించాలనేటటువంటి మీ డిమాండ్‌తో పరిపూర్ణంగా ఏకీభవిస్తూ ప్రాథమిక విద్యని ప్రత్యేకమైన కోటాలోనే చేర్చాలన్న డిమాండ్‌ను తప్పకుండా మా పార్టీ పాలసీలో పెట్టుకొని తీరతామని మరొక్కసారి గుర్తు చేస్తున్నాను. గ్రామీణ స్థాయిలో ప్రతి ఒక్కరికీ స్కూలును అందుబాటులోకి తేవడానికి ప్రయత్నం చేశాం. మరి జూనియర్ కాలేజీ గానీ, మరి కాన్‌స్టిట్యూయెన్సీలో, డివిజన్‌లో ఇంజనీరింగ్ / డిగ్రీ కాలేజీగానీ, జిల్లాకొకటి, రెండు ప్రొఫెషనల్ కాలేజీలుగానీ అందించ గలిగాం. ఇంకా చేరుకోవలసిన లక్ష్యం దూరమే వుంది. స్కూల్లో నమోదు కావలసిన పిల్లల సంఖ్య, బాలకార్మికుల సంఖ్య చాలా వున్దన్న విషయం గుర్తు చేసుకుంటూ ఆ రోజున తెలుగు దేశం టైంలోనే మిడ్ డే మీల్స్ లాంటివి ప్రవేశ పెట్టినా, ఆర్థిక భారాలతో కొద్దిగా సప్లిమెంట్ చేసినా ఇంకా చేయాల్సింది చాలా వుంది. ఈ పెరిగిపోయిన ధరలలోగానీ, మిడ్ డే మీల్స్ స్కీమును ఇంకా బలోపేతం చేసి అందరికీ అందించి హైస్కూల్ స్థాయిలో నుంచి అందరికీ అందుబాటులోకి తెచ్చి డ్రాపౌట్ సమస్య రాకుండా 100% ఎన్‌రోల్ కావాలనే లక్ష్యంతో కృషి చేస్తాం. 100% ఎన్‌రోల్‌మెంట్ చేయడానికి ఈ సభ తీర్మానం చేయాలని అలాగే మీరందరూ సహకరించి వచ్చే ప్రభుత్వాల్లో అది నం.1 ప్రియార్టీ కింద ప్రభుత్వాలు పెట్టుకునే విధంగా తీర్మానం చేయాలని, మా పార్టీపరంగా దానిని లక్ష్యంగా పెట్టుకోవడానికి మేము పూర్తి స్థాయిలో ప్రయత్నం చేస్తామని కూడా సభాముఖంగా మనవి చేసుకుంటున్నాను.

ఇంగ్లీష్ మీడియంకి మనం వ్యతిరేకం కాదు. కానీ ఈ సమాజంలో ఉన్న అత్యధికమైన బీద ప్రజలకు ప్రాథమిక విద్య అందాలని ఆ విద్య అందించిన తర్వాత ఇంగ్లీష్ మీడియం జోడించి అంతర్జాతీయ స్థాయికి తీసుకెళ్ళాల్సి వుంది కానీ ముందే అంతర్జాతీయ స్థాయిలో ఆలోచించి కనీస అవసరమైనటువంటి చదువును దూరం చేయటం సరైంది కాదు.

అధికారం లేకపోయినా మీతో కొంత అనుబంధం ఉంది. అభిమానం ఉంది. నా టైంలో ఎయిడెడ్ రిక్రూట్‌మెంట్‌కు అనుమతినిచ్చాం. రిక్రూట్‌మెంట్ పాలసీలో రెగ్యులర్ డిఎస్‌సి ద్వారానే ఎయిడెడ్ పోస్టులు నింపాలని అనుకున్నాం. రానున్న రోజుల్లో వారి పట్ల ఏ వివక్షత లేకుండా పూర్తి స్థాయిలో చేయడం జరుగుతుంది. 40% ఫిట్‌మెంట్, పిఆర్‌సిలలో చాలా విషయాలున్నాయి. టీచర్ల పట్ల సద్భావనతో వచ్చే రోజుల్లో పని చేస్తామని జన్మభూమి సాక్షిగా విద్యా వ్యాప్తికి కృషి చేసే విధంగా పని చేస్తామని తెలియజేస్తున్నాను.

## సిపిఎం రాష్ట్ర కార్యదర్శి బివి రాఘవులు

ఉపాధ్యాయ మిత్రులారా! నన్ను కూడా పరిచయం చేయాలి లేకపోతే మీకు నేనెవరో తెలియదు. ఎందుకంటే నేనెప్పుడూ తెరవెనుకే వుంటానట



ముఖ్యమంత్రిగారు చెప్పారు. ఎప్పుడూ తెరవెనుక వుండే వాడు ఎవరో ఒకరు పరిచయం చేస్తే తప్ప ఎవరికీ తెలియదు. కాబట్టి నన్ను పరిచయం చేసిన సభాధ్యక్షులు రామిరెడ్డి గారికి ధన్యవాదాలు. తులసిరెడ్డిగారు, వెంకటేశ్వర రావుగారు మంచి సంస్కృత శ్లోకాలతోటి మిమ్మల్ని బాగా ఆకాశానికెత్తారు. కాబట్టి నేను పొగడను ఎందుకంటే వారిరువురూ ఇప్పుడో, ఎప్పుడో అధికారంలోకి రావాలని ప్రయత్నం చేస్తున్నారు కాబట్టి అధికారంలోకి వచ్చే వాళ్ళే నామాలు పెట్టగలరు. మిగతా వారికి సాధ్యం కాదు. ఏమైనా ఇప్పుడు తులసి రెడ్డిగారు అధికారంలో ఉన్నారు. 2004లో వారి పార్టీ అధికారంలోకి వచ్చింది. వచ్చేటప్పుడు వారి పార్టీ అనేక వాగ్దానాలు చేశారు. వాటన్నింటిలో చాలా పరిష్కారం చేశామని కూడా తులసి రెడ్డిగారు చెప్పారు. ఇంకా కొన్ని పరిష్కారం చేయాల్సివుందని కూడా వారే చెప్పారు. మేం స్టేజీ మీద మాట్లాడుకుంటున్నాం. తులసి రెడ్డిగారు మేం టీచర్లకు మంచి బందరు లడ్డూ ఇచ్చేశాం. ఉపాధ్యాయులకు అన్ని సమస్యలూ పరిష్కరించేశాం అంటున్నారు. ఇంత మంచి లడ్డూ ఇచ్చేసి చివర ఒక చిన్న వేపగింజ కూడా ఎందుకిచ్చారండీ? ఏవో నాలుగైదు ముఖ్యమైన సమస్యలున్నాయి కదా! అప్రెంటీస్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు అంటున్నారు, 17 వేలమంది 2003 డిఎస్సి వారికి పాత పెన్షన్ అంటున్నారు అలాగే పండిట్స్ ప్రమోషన్స్ అప్‌గ్రేడేషన్ సమస్యలున్నాయి కదా! మీరు పరిష్కారం చేసినామని చెప్పే వాటికంటే ఇవి చిన్న సమస్యలేకదా! వీటిని పరిష్కారం చేసేసి పుల్లారెడ్డి స్వీట్ ఇచ్చామంటే టీచర్లు నమ్ముతారు అని చెప్పాను. కాబట్టి మీ మెమోరాండమ్‌లు, కోరికలు విన్నారు తులసి రెడ్డిగారు. గురువులకు నమస్కరించి వెళ్తున్నారు కనుక ఖచ్చితంగా పరిష్కారం చేసేస్తారని ఆశిస్తున్నాను. ఇక వెంకటేశ్వర రావు గారు అధికారంలోకి రావాలని ప్రయత్నిస్తున్నారు. కనుక ఒక వేళ ఈ ప్రభుత్వం ఇవన్నీ ఇవ్వకపోతే వారధికారంలో కొచ్చాకైనా ఇవన్నీ ఇవ్వాలి. ఇస్తేనే వారీ సభకొచ్చి గురువుల ముందు మాట్లాడిన దానికి న్యాయం జరుగుతుందని అభిప్రాయపడుతున్నాను. రామయ్యగారు చెప్పారు. ఇప్పటి వరకు ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో ఏ ఒక్క కోర్కెనీ దయాదాక్షిణ్యాలతోటి సాధించుకోలేదు. పోరాటాలతోటే సాధించుకున్నారు అని. ఈ మధ్య కాలంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏవైతే సమస్యలు పరిష్కారం చేసినారో అవి సంపూర్ణంగా పరిష్కారం కాకపోయినా, ఆ సమస్యలు కూడా ఆ మేరకు పరిష్కారం అయినాయంటే మీరు 13 రోజుల పాటు వీరోచితమైన పోరాటం చేసిన ఫలితంగానే పరిష్కారం చేశారు. వాగ్దానం చేసినందుకు వారంతట వారే పరిష్కారం చేసేటట్లైతే మీరు 13 రోజుల పాటు సమ్మె చేయాల్సిన అవసరమే లేదు. మీరంతా ఏదో ఉత్సాహం కొద్దీ, పాఠాలు చెప్పకుండా మానేద్దామని సమ్మె చేశారని మేమెవ్వరం అనుకోవటం లేదు. ఎంతోకాలం వేచివేచి వేడుకొని, ప్రాధేయపడి గత్యంతరం లేక మీరు సమ్మె చేశారు. ఎప్పుడు ఖాళీ అయిన పోస్టులు అప్పుడు భర్తీ కావడం లేదు. కొత్త సంస్థలను ఎయిడ్‌కు తీసుకురావడం లేదు. ఉన్న ఎయిడెడ్ సంస్థలను పోస్టులు నింపకుండా బలహీనం చేసి అవి ప్రైవేటు సంస్థలుగా వ్యాపార సంస్థలుగా మారిపోవడమో లేకపోతే మూసేసుకోవడమో అనే పరిస్థితి సృష్టిస్తున్నారు. తులసి రెడ్డిగారు చెప్పారు. 16500 కొత్త పోస్టుల్ని 363 జి.ఓ. ప్రకారం సృష్టించామని చెప్పారు. అయితే 15584 సెకండరీ గ్రేడ్ పోస్టుల్ని అప్‌గ్రేడ్ చేసి రద్దు చేసిన విషయాన్ని మాత్రం చెప్పలేదు. అలాగే 3933 హెడ్మాస్టర్ పోస్టులు కొత్తగా సృష్టించా-మన్నారు. కానీ దాని మూలంగా ఎస్‌జిటి పోస్టులు రద్దైపోయిన విషయం కూడా వారు చెప్పలేదు. కాబట్టి ఒకటి రద్దు చేసి ఇంకొటి సృష్టిస్తే కొత్తగా సృష్టించినట్లు ఎట్లా ఔతుందన్నది వారు చెప్పాలి. ఇదేమైనా కొత్త ఇన్నోవేటివ్ మెథడేమో మరి! పరిశీలించాలి. ఇటువంటి అనేక సమస్యలున్నాయి. వీటి పరిష్కారం కోసం మీరు పోరాడాల్సిందే. మీరు చేసే పోరాటాలన్నింటికీ భారత కమ్యూనిస్టు మార్క్సిస్టు పార్టీగా మేము అండగా నిలుస్తాం. ఈ ప్రభుత్వ ప్రతినిధిగా తులసి రెడ్డిగారు సమస్యలన్నీ విన్నారు కాబట్టి ఆయన ముఖ్యమంత్రికి చెప్పి, వారికి అర్థమై, ఆయన పరిష్కారం చేస్తాడాలేదా చూడాలి. పరిష్కారం చేస్తే మంచిది. పరిష్కారం చేయకపోతే ఎన్నికల తర్వాత కొత్త ప్రభుత్వంపైన అది ఏ ప్రభుత్వమైనా దానిపైన ఉద్యమం చేసి పోరాటం చేసి సాధించుకోవలసిన అవసరం ఉంది. అటువంటి పోరాట కార్యక్రమాన్ని ఈ మహాసభలో నిర్ణయించుకుంటారని ఆశిస్తున్నాను. ఈ రోజు ఇక్కడ ఒక ప్రముఖమైన, రాష్ట్ర వ్యాప్తంగా బలంగా ఉన్న ఒక ఉపాధ్యాయ సంఘంగా మీరు సమావేశం అవుతున్నారు. కాబట్టి విద్యా వ్యవస్థ పట్ల కూడా మన బాధ్యత ఉంది. ఇందుకే పెద్దలు చెప్పారు. మన రాష్ట్రం ఎక్కడో 28వ స్థానంలో ఉందని అక్షరాస్యతలో ఇంకేదో నివేదికలో 3వ స్థానం, 4వ స్థానంలో ఉందని చెప్పేసి తులసి రెడ్డి గారు చెప్పారు. పది సంవత్సరాల తర్వాత కొంత అభివృద్ధి ఉండదా అంటే ఉంటుంది. ఎందుకుండదు. మనం ఇద్దరు పిల్లల్నికంటే 20 ఏళ్ళ తర్వాత ఆరుగురు అవుతారు. ఇంకొక ఇరవై ఏళ్ళు గడిస్తే 30 మంది ఔతారు. ఏం కష్టపడక్కర్లా! కాబట్టి 10 సం॥ గడిచిన తర్వాత అక్షరాస్యత పెరగదా! డ్రాపౌట్స్ తగ్గవా! ఇంకో 15 సం॥ గడిచిన తర్వాత నలుగురు గ్రాడ్యుయేట్స్ ఎక్కువ కారా! ఔతారు. దానికి ఆయన గొప్పేమిటని నేనడిగేది? కాబట్టి విద్యా వ్యవస్థ కుటుంబంలో ఒక సభ్యుడు మొదట అక్షరాస్యుడు అయితే అక్షరాస్యుడైన సభ్యుడు తన పిల్లల్ని చదివించుకోవాలని చెప్పేసి పూనుకుంటాడు. చదువంటే ఏమిటో, అక్షరం అంటే ఏమిటో మొదట ఒక్కరికైనా తెలిస్తే స్వయం చోదక శక్తి లాగా చదువు అదే ముందుకు పోతుంది. మొదట మనం కాస్త కదిలించాలంతే. అదివ్వడం లేదు. 2001 సెన్సస్ ప్రకారం మనం ఇంకా 60% అక్షరాస్యతలోనే ఉన్నాం. ఎందుకు పెరగలేదు? అన్ని రాష్ట్రాలు ఎందుకు ముందుకు పోతున్నవి? మనం అందరికన్నా గొప్పవాళ్ళమే! దానికి రెండు ముఖ్యమైన కారణాలున్నాయి. ఒకటి మన రాష్ట్రంలో ఇతర రాష్ట్రాలకన్నా దళితుల్లో, గిరిజనుల్లో, వెనుకబడిన ప్రాంతాల్లో, మైనార్టీస్‌లో చదువు తక్కువగా ఉంది. ఈ తరగతుల్లో అక్షరాస్యత పెంచగలిగితే మన రాష్ట్రం కూడా ఇతర రాష్ట్రాల సరసన నిలబడగలుగుతుంది. మన రాష్ట్రం సగటు అక్షరాస్యత 60% అయితే ఈ సగటు అక్షరాస్యతకన్నా 14 జిల్లాలు తక్కువగా వున్నాయి. అంటే సగానికి మించిన జిల్లాలు రాష్ట్ర సగటు అక్షరాస్యతకన్నా తక్కువగా వున్నాయి అంటే ఎంతటి దుస్థితి? అలాగే ఎస్‌సిల సగటు అక్షరాస్యత 53%! ఎస్‌టిల అక్షరాస్యత 30%. రాష్ట్ర సగటు 60 అయితే ఎస్‌సి, ఎస్‌టిల సగటు అంతకంటే తక్కువగా వున్నది. అంటే ఆ రెండు తరగతుల అక్షరాస్యతను మనం పెంపొందిస్తే రాష్ట్ర సగటు అక్షరాస్యత చాలా వేగంగా పెరుగుతుంది. దాని కోసం ప్రత్యేకంగా ఈ ప్రభుత్వం ప్రయత్నం చేయడం లేదు. ఇందాక నారాయణగారన్న సామాజిక న్యాయం ఇక్కడే వుంది. అక్షరాస్యతలోను, చదువులోను మన రాష్ట్రం తక్కువగా ఉండబట్టే దేశంలో మన రాష్ట్రం వెనుకబడి పోయిందని మనం చెప్పుకోవచ్చు. దీనిని ఎట్లా సవరించాలని మనం ఆలోచించాలి. ఇందాక మండవ వెంకటేశ్వర రావుగారు అంటున్నారు. ప్రైవేటు రంగాన్ని కూడా ప్రోత్సహించాలని ఈ రోజు జీన్‌డ్రీవ్స్ ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన విద్యావేత్త ఈ రోజు హిందూ దిన పత్రికలో సెంటర్ పేజీ ఆర్టికల్ వ్రాశాడు. చదువు గురించి ఆయన చెప్పాడు నాలుగు రాష్ట్రాలను పరిశీలించాడు ప్రైవేటు స్కూళ్ళు, ప్రభుత్వ పాఠశాలల వ్యత్యాసం ఏమిటని? ఆనాటి నుండి ఈనాటి వరకు ప్రైవేటు స్కూళ్ళు 20% మించి ప్రజలకు విద్య చెప్పడం లేదు. రెండవ విషయం ప్రభుత్వ పాఠశాలల్లో 50% మంది అమ్మాయిలు, 50 % అబ్బాయిలు చదువుకుంటుంటే ప్రైవేటు పాఠశాలల్లో 20% మాత్రమే అమ్మాయిలు చదువుకుంటున్నారు. ఎక్కువమంది అమ్మాయిలను వాళ్ళు చేర్చుకోవడం లేదు. అక్షరాస్యత కీలకమైంది. ఎందుకంటే చదువుకుంటే ఆరోగ్యం గురించి, ఆహారం గురించి తెలుస్తుంది. చదువుకుంటే మంచి అలవాట్లు వస్తాయి. ఉత్పాదకత పెరుగుతుంది. అన్నిటికీ ఉపయోగం జరుగుతుంది. ఆ చదువు మీద కేంద్రీకరించకుండా ఇంకా దేనిమీదో కేంద్రీకరిస్తే ఉపయోగం లేదు. అందుకనే అమర్త్యసేన్ 21వ శతాబ్దంలో ఆరోగ్యం, చదువు ఉన్న దేశాలకే భవిష్యత్ వుంటుందని చెప్పాడు. మనకు ఆ రెండు తప్ప ఇంక అన్ని వున్నాయి. అటువంటి పరిస్థితి ఉంది కాబట్టి ఈ రోజు మన యుటీయఫ్ రాష్ట్ర విద్యాభివృద్ధి మీద కూడా శ్రద్ధ పెట్టి కృషి చేయాలని మీ దృష్టికి తీసుకువస్తున్నాను.

తరువాతి అంశం ఈ రోజు ఉపాధ్యాయ ఉద్యమంలో కూడా అనేక

పెడధోరణులొస్తున్నాయి. వాటిని కూడా అర్థం చేసుకొని వాటిని ఎదుర్కొనే దానికి పూనుకోవాలి. ఈ మధ్య ఎమ్మెల్సీ ఎన్నికలు జరిగినాయి. వెండిగ్లాసులు, ఇత్తడి చెంబులకు ఓట్లు వేసే స్థితి ఉపాధ్యాయులలో (అందరూ కాదు కొందరిలోనైనా) ఉందంటే మన ఉపాధ్యాయ ఉద్యమం యొక్క బాధ్యత ఏమిటో అర్థమౌతుంది. వారి చైతన్యాన్ని పెంచాల్సిన బాధ్యత మనకి చాలా ఎక్కువ ఉందని అర్థమౌతుంది. మనమేదో జీతం గురించి, భత్యం గురించి, డిఏ గురించి, ప్రమోషన్ల గురించి ఆందోళన చేస్తేనే సరిపోదు. చెయ్యాలి. వాటిని వదిలిపెట్టే సమస్యేలేదు. వాటితో పాటు ఉపాధ్యాయులు అటువంటి కోర్కెల సాధన కోసం కృషి చేస్తున్న వారిని అభిమానించాలా లేకపోతే ఇత్తడి చెంబులు, వెండిగ్లాసులు ఇచ్చే వారికి మనం ఓటెయ్యాలా? అని చెప్పి ఉపాధ్యాయుడు అర్థం చేసుకునే విధంగా కృషి చెయ్యాల్సిన బాధ్యత కూడా మనపైనే ఉంది. పోరాటం చేశాం ఐ.ఆర్., డిఏ ఇప్పించాం, ప్రమోషన్లు ఇప్పించాం. సంతోషిస్తున్నారు. మరి ఆ జీతం, ప్రమోషన్‌ను పొందిన ఉపాధ్యాయుడు వాటి కోసం కృషిచేసి, త్యాగం చేసి విమర్శలెదుర్కొని, కక్ష సాధింపుల నెదుర్కొని నిలబడిన వాళ్ళని మనం ఆదరించాలా? మరి ఏమీ లేకుండా నాలుగు డబ్బులు సంపాదించి మూట గట్టుకొని అక్కడకొచ్చి నిలబడి ఓట్లడిగితే వారిని చూసి మనం భయపడాలా? అని ఉపాధ్యాయుడు ఆలోచించలేకపోతే బాధ పడాల్సింది ఉపాధ్యాయులు కాదు. వారిని ఆ స్థితిలో ఉంచినందుకు మనం బాధపడాలి. రాబోయే కాలంలోనైనా ఉపాధ్యాయుని యొక్క చైతన్యాన్ని, అవగాహన శక్తిని పెంపొందించి విద్యా వ్యవస్థని నాశనం చేసే శక్తులు, ఉపాధ్యాయుల్ని అవినీతి పరులుగా మార్చే శక్తులు ఏవైతే వున్నాయో వాటి పట్ల అప్రమత్తంగా, జాగ్రత్తగా వుండి వాటిని ఎదిరించే విధంగా ఉపాధ్యాయులు ఉండేలా తీర్చిదిద్దాల్సిన బాధ్యత మన మీద ఉంది. ఆ బాధ్యతని యుటియఫ్ నిర్వహిస్తుందని ఈ సందర్భంగా ఆశిస్తున్నాను. రాబోయే కాలంలో సంక్షోభం ఎంత తీవ్రంగా ఉంటుందంటే, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల లెక్కలన్ని తారుమారు ఐపోతాయి. ఉపాధి మొత్తం దెబ్బతిని పోతుంది. ప్రభుత్వం వద్ద నిధులన్నీ కోత పడిపోతాయి. ఆ కోత విద్యా నిధుల మీద కూడా పడుతుంది. ఎన్నికల కోసం ఇప్పుడు నటిస్తున్నారు. ఎన్నికల తర్వాత ఎవరొచ్చినా నటన కుదరదు అటువంటి పరిస్థితి వస్తుంది. కాబట్టి ఉపాధ్యాయ ఉద్యమ ప్రతినిధులుగా ఈ ఆర్థిక సంక్షోభం అనేది విద్యారంగంపై ఎటువంటి ప్రభావం పడుతుంది. ఉపాధ్యాయులపై ఎటువంటి ప్రభావం పడుద్ది వారియొక్క హక్కుల్ని పరిష్కారం చేయడంలో ఎటువంటి ఇబ్బందులొస్తయ్యో కూడా అర్థం చేసుకోవాలి. ఎదుర్కొనే దానికి సిద్ధం కావాలని విజ్ఞప్తి చేస్తున్నాను. వాస్తవంగా ఇదొక మంచి అవకాశం. విద్యా వ్యవస్థని, ఆరోగ్య వ్యవస్థని అభివృద్ధి చేసుకోవడానికి ఇట్లాంటి సంక్షోభాలు మంచి అవకాశం. ఎవరికి అవకాశం? ప్రభుత్వాలకి అవకాశం. చైనాలో వెనుకబడిన ప్రాంతాలకు రైలు మార్గం లేదు. ఇప్పుడు వాటన్నింటికీ రైలు మార్గం వెయ్యాలని నిర్ణయించారు. అంటే చైనాలో ఎక్కడైనా మౌలిక సదుపాయాల కొరత వుంటే అక్కడ వాటిని నిర్మించి తద్వారా ఉపాధి కల్పించి, ప్రజలకు కొనుగోలు శక్తిని కలిగించి ఇటు ప్రజలకు మేలు చేయడం ఆర్థికాభివృద్ధికి తోడ్పడటం కోసం 25 లక్షల కోట్ల రూపాయలు కేటాయించారు. మన దేశంలో 50 వేల కోట్ల రూపాయలు కేటాయించారు. వాళ్ళ జనాభా 100 కోట్లు దాటింది. మన జనాభా 100 కోట్లు దాటింది. ఈ 50 వేల కోట్లతో ఏం చేస్తున్నారు? ఏవైనా ప్రాజెక్టులు చేపడుతున్నారా! ఈ రోజు రాష్ట్రంలో పాఠశాలలన్నింటికీ పక్కా భవనాలు కట్టించేయవచ్చుకదా! భవనాలు కట్టిస్తే స్టీలు ఖర్చువుద్ది, ఇటుక, సిమెంటు, ఇసుక ఖర్చవుతాయి కదా ఆ రకంగా ఉపాధి బ్రహ్మాండంగా అవుతుంది. మరి ఈ రాష్ట్రంలో ప్రాజెక్టులున్నాయి. ఇతర రాష్ట్రాల్లో ప్రాజెక్టులున్నాయి. లేకపోతే నదుల అనుసంధానం ఉంది. ఒక లక్ష కోట్ల రూపాయలతో వాటన్నింటినీ పూర్తి చేసే కార్యక్రమం చేస్తే ఉత్పత్తి పెరుగుద్ది కదా! ఆ పని చేయటం లేదు. అందుకని ఈ ప్రభుత్వం సత్యంలాంటి పెద్ద పెద్ద కార్పోరేట్ సంస్థలకో, బ్యాంకులకో ఇంకొకరికో మేలు చేయడానికే తప్ప ప్రజలకు మేలు చేసే పద్ధతిలో పరిష్కారాలు కనుక్కోవటం లేదు. అందుకనే రాబోయే కాలంలో అనేక సమస్యలు వస్తాయని మీ దృష్టికి తీసుకువస్తున్నాను. మీరు పోరాటాలకు సిద్ధం కావాలి. లేకపోతే మీకు అనవసరమైన భ్రమలు పెరుగుతాయి. ఆ భ్రమల నుండి మీకు నిరాశా నిస్పృహ వస్తుంది. సమస్య తెలిస్తే వాటిని ఎదుర్కొనే శక్తి వస్తుంది. అవగాహన వస్తుంది. వాటిని సాధించుకునే పట్టుదల వస్తుంది. ఆ రకంగా మీరు సిద్ధం కావాలని నేను కోరుతున్నాను. చివరి విషయం ఈ రోజు ఐక్యత చాలా ప్రధానమైంది. ఇటీవల 13 రోజుల పాటు మీరు సమ్మె చేశారంటే ఒక అకుంఠితమైన ఐక్యత తోటి పోరాటం చేశారు. అందుకనే ప్రభుత్వం లొంగి రావాల్సివచ్చింది. ఆ ఐక్యతను దెబ్బతిసే దానికి ప్రభుత్వం అనేక మార్గాల్లో దుష్ప్రచారం చేసింది రాజకీయ రంగు పులిమింది. అయినా ఐకమత్యంతో మీరు దాన్నెదుర్కొన్నారు. ఎదుర్కొన్నారు కాబట్టే ప్రభుత్వం కొన్నైనా పరిష్కారం చేయాల్సి వచ్చింది. ఉద్యమానికి కొన్ని సంఘాలు నష్టం చేసినవి. ఆ నష్టం జరక్కపోతే, అనైక్యత సృష్టించకపోయివుంటే ఇంకా పెండింగ్‌లో ఉన్న సమస్యలు కూడా పరిష్కారమై వుండేవి. అందుకని ఇది పాక్షిక విజయమే ఐనా మీ ఐక్యత యొక్క విజయం. రాబోయే కాలంలో మళ్ళీ ఆ ఐక్యతని పునరుద్ధరించుకోవాలి. ఎవరైతే యుటియఫ్‌ను వెలివేసి వంటరి చేసి దూరం చేయాలని తీవ్రంగా ప్రయత్నం చేశారో వాళ్ళలోనే తగాదాలు, తకరారులు వస్తున్న పరిస్థితి మనం చూస్తున్నాం. అటువంటి పరిస్థితి వస్తుంది. ఎందుకంటే ఉద్యమాల్లో నిలబడే వాళ్ళు, నిలబడని వాళ్ళు వుంటారు. అయితే ఆ సంఘాలపై ఎవరికీ కోపం వుండాల్సిన అవసరం లేదు. మీకు కూడా వుండాల్సిన అవసరం లేదు. మీరు ఉద్యమాల్లో ఉండే వారు కాబట్టి, మనసు గాయపడి వుంటుంది. కాబట్టి కాస్త కోపతాపాలతో ఉండి వుంటారు. అట్లా వుండకూడదు. ఈ రోజు సమస్యలు పరిష్కారం చేయాల్సింది ప్రభుత్వం. మనం పోరాడాల్సింది ప్రభుత్వంతోగాని ఈ సంఘాలతో కాదు. మరి ఈ సంఘాలు యుటియఫ్ మీద పోరాడాలని అనుకోవచ్చు కాని అది తప్పు. మన వైపు నుండి అలా కాకుండా వారిని ఆకర్షించే విధంగా, ఐక్య ఉద్యమాలలోకి రాబట్టేదానికి, విశాలమైన ఐక్యతను సాధించే దానికి, ఉన్న సమస్యలను కూడా పరిష్కరించుకొనే దానికి ప్రయత్నం చేయాలి. ఐక్యతలోకి రాకపోతే వాళ్ళ తప్పు. ఐక్యతకు పిలవకపోతే మన తప్పు. కాబట్టి మనం అటువంటి అనైక్యతకు కారణం కాకుండా వ్యవహరించాలి. యుటియఫ్ ఆ రకంగా పరిపక్వంతో వ్యహరిస్తుందని నేను అనుకుంటున్నాను. ఆ రకంగా మళ్ళీ ఒక పెద్ద ఐక్యతను సాధించే దానికి రాబోయే కాలంలో ఉపాధ్యాయులకు వచ్చే సమస్యలు చాలా కీలక పాత్ర నిర్వహిస్తాయి. ఆ సమస్యల మీద అటువంటి ఐక్యతను సాధించాలని సూచిస్తున్నాను. ఆ ఐక్యతను ఎలా సాధించాలి? ఏ జిల్లాలో ఏ సమస్య మనకు ఆటంకంగా ఉందో పరిశీలించి ఐక్యతను సాధించేదానికి కృషి చేయాలని, ఆ రకంగా రాబోయే కాలంలో పోరాటానికి ఆయుధాలు సన్నద్ధం చేసుకోవాలని, వాటికి పదునెక్కించాలని, ఆ పని ఈ మహాసభలో చేయాలని సూచిస్తున్నాను. రాబోయే కాలంలో మళ్ళీ పోరాటం తప్పదు ఏ ప్రభుత్వం వచ్చినాగాని 2009 తర్వాత మీ సమస్యలు పరిష్కరించుకోవడానికి పోరాటమే మార్గం. వారెన్ని వాగ్దానాలు చేసినా పోరాటం లేకుండా పరిష్కారం అవుతాయనే భ్రమలు అవసరం లేదు. ఈ మహాసభని ఆ పోరాట మార్గాలను సుగమం చేసుకొనే చర్చలతో మీరు ముగిస్తారని ఆశిస్తున్నాను.

**సిపిఐ రాష్ట్ర నాయకులు ఆది రెడ్డి :**



చైతన్యవంతమైన ఈ నల్లగొండ జిల్లాలో మీ యుటియఫ్ రాష్ట్ర మహాసభ జరుగుతున్నది. అంతేగాకుండా ఏప్రిల్‌లో పార్లమెంట్, అసెంబ్లీ ఎన్నికలు వస్తున్నాయి. ఒక మంచి సందర్భంలో యుటియఫ్ రాష్ట్ర మహాసభకు ప్రాధాన్యత ఉన్నది. రాబోవు ఎన్నికలలో అధికారంలోకి వచ్చే వాళ్ళకు వివిధ రాజకీయ పార్టీలకు ప్రధానంగా వివిధ రంగాలు, ముఖ్యమైన రంగం విద్యారంగంపై వాళ్ళు అవలంబించే వైఖరులు అన్నింటినీ సమీక్ష చేసి సాధించుకోవటానికి ఇది మంచి సమయంగా ఉంటుందని భావిస్తున్నాం.

ఈ విద్యారంగం గురించి ఆలోచిస్తే చాలా ఫాక్టర్స్ ఉన్నవి అందులో ప్రాథమిక విద్యకు చాలా ప్రాధాన్యత ఉన్నది. కానీ దురదృష్టం ఏమంటే పాఠశాలల్లో తగిన సౌకర్యాలు లేవు, భవనాలు లేవు, సరే లెక్కలు చెప్పుకోవలసిన అవసరం లేదు గానీ, ఇక్కడ మన అందరికీ తెలుసు ఒక గది ఉన్న పాఠశాలలు,

గదుల్లేని పాఠశాలలు, ప్రహరీ లేని పాఠశాలలు, టాయిలెట్లు లేని, రక్షణ లేని పాఠశాలలు ఉన్నాయి. రక్షణ అంటే మీ అందరికీ తెలుసు అసాంఘిక శక్తుల చీకటి కార్యకలాపాలకు కేంద్రంగా పాఠశాలలు ఉండటాన్ని మేము గమనిస్తున్నాం. మరి ఈ పాఠశాలల్లో సిబ్బంది కొరత ఉంటుంది, ఉపాధ్యాయుల కొరత ఉన్నది. ఇవన్నీ సమస్యలున్నాయి. విచిత్రమేందంటే ప్రభుత్వాలు మారుతున్నాయి. ఎన్నికలప్పుడు వాగ్దానాలు చేస్తున్నారు. అధికారంలోకి వస్తున్నారు. కోట్ల రూపాయలు కేటాయిస్తున్నారు. తీరాజూస్తే చాలా ప్రాథమికంగా అత్యవసరంగా పరిష్కరించాల్సిన ఈ కనీస మౌలిక సమస్యలపైన పాలకులకు శ్రద్ధ కనిపించదు. దాని గురించి ఆలోచన ఉండదు చేసే ప్రయత్నం ఉన్నట్లు మనకు కనపడదు. అందువల్ల ప్రాథమిక పాఠశాలలు నిర్వీర్యం అవుతున్నాయి. వాస్తవంగా ప్రభుత్వ పాఠశాలలను ప్రాథమిక స్థాయిలో బలోపేతం చేయాలి. అదొక పాఠశాలగా చూడగలగాలి. అక్కడ పిల్లలు చదువు నేర్చుకుంటారనే ఒక ఆబ్జక్టివ్ సిట్యుయేషన్, ఒక మంచి వాతావరణం స్కూల్లో వుండాలి అది కల్పించటంలో పాలకులు ఎప్పటికప్పుడు విఫలం చెందుతున్నారు. అంటే ఒక ప్రక్కన స్కిల్డ్ అనెంప్లాయ్డ్ సఫర్ అవుతున్న పరిస్థితి మరొక ప్రక్కన పాఠశాలల్లో టీచర్స్ లేని పరిస్థితి. ఇంతకన్నా బాధాకరం. ఇంతకన్నా న్యాయమైన సమస్య మరొకటి ఉంటుందా ప్రభుత్వాలకు. వాటిని ఎప్పటికప్పుడు ఫిల్అప్ చేయటానికి మనకు ఉన్నారు. రిజర్వ్డ్ అనెంప్లాయ్డ్ సోర్స్ ఉన్నది. కానీ చేసే పరిస్థితి ఇవ్వాళ కనపడడం లేదు. టాయ్‌లెట్స్ చెప్పుకోవడానికి చిన్న సమస్యే కానీ ప్రాక్టికల్‌గా ఎంత ఇబ్బంది అవుతుందో ఆ టీచర్లకి, స్టాఫ్‌కి తెలుసు. ఇటువంటి వాటిపై ఏ మాత్రం శ్రద్ధ ఉండదు.

ఈ సందర్భంగా మనవి చేసేదేమిటంటే సమస్యలు ఉన్నాయి. కానీ వాటిని పరిష్కరించే ప్రభుత్వాలు రావాలి. ఆ ప్రభుత్వాలు రావాలంటే మార్పు జరగాలి. ఆ మార్పుకు రాష్ట్రంలో బలమైన, నిర్మాణయుతమైన, క్రమశిక్షణ గల, త్యాగంతో కూడిన క్యాడరు మీ యుటియఫ్‌లో ఉన్నారని భావిస్తున్నాం. చాలా సంతోషం. ఇలాంటి పటిష్టవంతమైన ఆర్గనైజేషన్సు ఈ విద్యారంగంలో అవసరం. భవిష్యత్‌లో కూడా అవే సమస్యలు వస్తాయి వాటిని సాధించాలి అంటే బలమైన ఉద్యమాలు కావాలి అందుకు ఒక మంచి ఆర్గనైజ్డ్ సంఘాలు అవసరం. మంచి చెడులను విభజించి నిలదీసే తత్వాన్ని మనం పెంచుకోవాలి. ఉద్యమాలను చేసే తత్వాన్ని మనం పెంచుకోవాలి. పోరాటాలు లేకుండా ఏ సమస్యా పరిష్కరించబడదు. ఇది చరిత్ర చెప్పిన సత్యం. ప్రాతినిధ్యాలతో తాత్కాలిక ఉపశమనమే గానీ పోరాటాలు, ఉద్యమాలే అంతిమ పరిష్కారం. ఆ దిశగా మీ మహాసభలు మిమ్మల్ని ఉత్తేజితం చేస్తాయని ఆశిస్తున్నాను.

### విద్యా సదస్సును సమీక్షిస్తూ సభాధ్యక్షులు డి. రామిరెడ్డి

విద్యారంగానికి నిధులు కోత పెడుతూ ఏదడిగినా డబ్బులేదనే వైఖరిని మానుకొని విద్యారంగానికి ఎంత డబ్బైనా ఖర్చు పెడతాం. మరెక్కడైనా పొదుపు చేస్తాం అనే పద్ధతిలో ప్రభుత్వం అవసరమైన నిధులు కేటాయించాలి. ఇప్పుడు బడ్జెట్‌లో నిధులు కేటాయిస్తున్నారు. కానీ ఇది జీతాలకే సరిపోతుంది తప్ప అదనంగా అభివృద్ధి చేయడానికి చాలడం లేదు. పోనీ జనానికి పన్నులు వేయకుండా ఉన్నారా? అంటే అదీ లేదే. ఈ సంవత్సరం ప్రాథమిక, సెకండరీ విద్యలకు కొంచెం పెంచామని అంటున్నారు. అయితే తగినంతగా పెంచారా అంటే లేదు. మొత్తం ప్రాథమిక విద్య బాగుపడాలంటే నిధులన్నీ ఒకేసారి కేటాయించాలి. ఇక కంప్యూటర్ విద్య గురించి చాలాసార్లు చెప్పుకున్నాం. మన వాళ్ళు ఇప్పుడు మాట్లాడారు. కేరళలో మనకంటే వెనక కంప్యూటర్ విద్య ప్రవేశ పెట్టారు. 5 సం॥లలో 10వ తరగతిలో 25 మార్కుల కంపల్సరీ సబ్జెక్టుగా వచ్చే విధంగా అక్కడ బోధించారు. మనకు మొదట వెయ్యి ఇప్పుడు 5 వేలు ఇచ్చారు. వాటిని నేర్పే ఆపరేటర్ లేదు, వైరస్ వస్తే చూసే దిక్కు లేదు అంటే అర కొరగా పై నుండి డబ్బు వస్తుంటే చేయడమే తప్ప చిత్తశుద్ధితో అందరికీ ఈ సాంకేతిక విద్య రావాలనే తపన మన ప్రభుత్వంలో లేదు. ఆఖరికి రైట్ టు ఎడ్యుకేషన్ బిల్లు 10 సం॥ల నాడు ఆలోచన చేసి 5 సం॥ల క్రితం పార్లమెంట్‌లో కిందా మీదా పడి ఇప్పుడు పార్లమెంటులో ప్రవేశ పెట్టడానికి సిద్ధమైంది. ఆఖరుగా ఒక్క మాట. మన వ్యవస్థను కాపాడుకోవాలి. ప్రభుత్వాలను కాదు, ఈ వ్యవస్థ బాగుపడాలి. సిబిఎస్ఇ సిలబస్‌ను గురించి ఈ మధ్య చర్చ జరుగుతుంది. నిన్ననే సిబిఎస్ఇ పాఠశాలలు 10,15 నడుపుతున్న మేనేజిమెంట్లతో మాట్లాడటం జరిగింది. సిబిఎస్ఇకి సపరేటు సిలబస్ లేదు, ప్రత్యేక పుస్తకాలు లేవు. ఎన్‌సిఇఆర్‌టి సిలబస్, ఎన్‌సిఇఆర్‌టి పుస్తకాలే వాడుతున్నారు. ఎన్‌సిఇఆర్‌టి పుస్తకాలను మాతృ భాషలోకి తర్జుమా చేసుకొని మనం వాడుకోవచ్చు. ఇంగ్లీషు కమ్యూనికేషన్ స్కిల్స్ లభించేలాగా టెక్స్ట్‌బుక్స్ రివైజ్ చేయాలి. అంతేగానీ అవసరమైన వారికి, కాని వారికి బలవంతంగా ఇంగ్లీషును రుద్దాల్సిన అవసరం లేదని. సిబిఎస్ఇ పాఠశాలల అధిపతులే చెబుతున్నారంటే మన ప్రభుత్వం ఎంతమోసం చేస్తుందో మనం కూడా ఆ భ్రమల్లో ఎలా కొట్టుకొని పోతున్నామో ఆలోచన చేసి ఈ మొత్తం విద్యారంగంపై చర్చించి సమీక్షించి ఒక డాక్యుమెంట్‌ను రూపొందించుకుందాం.

### ఎమ్మెల్సీ డా॥ కె. నాగేశ్వర్ సందేశం

ప్రభుత్వ పాఠశాలలు తెరిచేటప్పటికే అందాల్సిన పాఠ్య పుస్తకాలు డిసెంబరు



వరకు రావడం లేదని పాఠ్య పుస్తకాలు లేకుండా పాఠాలు చెప్పిస్తున్న ఘనత, మన రాష్ట్ర ప్రభుత్వాని దేనని ఈ వినూత్న ప్రక్రియ ఏపిలో తప్ప దేశంలో ఎక్కడా లేదన్నారు. వేల కోట్ల రూపాయల భూములను, అనేక రాయితీలను సెజ్‌ల పేరుతో పంపిణీ చేస్తున్న ప్రభుత్వం పిల్లలకు పాఠ్య పుస్తకాలు, పాఠశాలలకు సౌకర్యాలు కల్పించేలేక పోవడం అన్యాయం అన్నారు. పాఠశాలలన్నింటికీ కావలసిన కనీస సౌకర్యాలను యుద్ధప్రాతిపదికన తక్షణమే కల్పించాలని డిమాండ్ చేశారు. లక్షల కిలోమీటర్ల దూరంలో ఉన్న చంద్రుణ్ణి చేరగలుగుతున్నారు కాని సర్వీసు రూల్సు యిప్పించలేకపోతున్నారని ప్రభుత్వాన్ని ఎద్దేవా చేశారు. దేశంలోనూ, రాష్ట్రంలోనూ ఏ డిపార్టుమెంటులోనూ లేని అప్రెంటిస్ విధానం ఉపాధ్యాయులకే ఉన్నదని ఈ పద్ధతి రద్దు చేయాలని, అప్రెంటిస్ కాలనికి రెండు ఇంక్రిమెంట్లు వెంటనే అమలు చేస్తూ ఆ కాలాన్ని పెన్షన్‌కు పరిగణించాలని, స్పెషల్ విద్యావాలంటీర్లకు నోషనల్ ఇంక్రిమెంట్ల సౌకర్యం కల్పించడం ప్రభుత్వ బాధ్యత అని ఉపాధ్యాయులను విభజించి పాలించే తీరు మార్చుకోవాలని హితవు పలికారు. చిన్న చిన్న పనులు కూడా ఈ ప్రభుత్వం చెయ్యడం లేదంటూ సక్సెసు స్కూళ్ళల్లో టీచర్లకు గతంలో యిచ్చిన 13 రోజుల శిక్షణ సరిపోదని, ఇంగ్లీషు మీడియానికి తాము వ్యతిరేకం కాదని, టీచర్లకు కొన్ని నెలలపాటు సమగ్ర శిక్షణ అవసరమని అన్నారు. తెలుగుకు ప్రాచీన భాష హోదా వచ్చినా తెలుగు పండితులకు స్కూలు అసిస్టెంట్లుగా పదోన్నతి కల్పించలేదని, ప్రభుత్వ డిగ్రీ కళాశాలలు, విశ్వ విద్యాలయాలు అనేకం ఏర్పాటు చేశారని వాటికి సరైన నిర్మాణాలు, వసతులు లేవని కొత్తగా ఒక అదనపు పోస్టును కూడా మంజూరు చేయలేదని నామకః ప్రభుత్వం ఏర్పాటు చేసిందని వాటి వల్ల ఒనగూడే ప్రయోజనం ఏమీ లేదని అన్నారు.

మనం విద్యారంగాన్ని రాజకీయ ఎజెండాగా ఆయా పార్టీలు గుర్తించే స్థితి తీసుకురావాలని, ఎవరైనా సరే తమ ఎన్నికల మానిఫెస్టోలలో విద్యను ప్రధాన అంశంగా గుర్తించాల్సిందేనని అన్నారు. ఎన్నికల అనంతరం విద్యా పరిరక్షణకై బృహత్తర ఉద్యమం నడపాలని, ఉన్నత ప్రమాణాలతో కూడిన విద్యా కోసం అవిశ్రాంతంగా పోరాడాలని సూచించారు. ఉపాధ్యాయులు పాఠశాలకు పోవడం లేదని అందువలననే పాఠశాలలు తమ ప్రాభవాన్ని కోల్పోతున్నాయని ప్రచారం చేస్తున్నారని, అయితే బడి ఎగ్గొట్టే ఉపాధ్యాయుల్ని యుటియఫ్ కార్యకర్తలు నిలదీయాలని మనం సౌకర్యాల కొరకు పోరాడుతూనే ఉన్న పరిమితుల్లో ఉత్తమ ప్రమాణాలతో విద్యనందించాలని అప్పుడే మనం ప్రభుత్వంపై పోరాడగలుగుతామని అన్నారు.



ప్రారంభోపన్యాసం చేస్తున్న ఎస్.వీరయ్య
సిఐటియు రాష్ట్ర అధ్యక్షులు



ఎం.వి.ఎస్.శర్మ
ఎం.ఎల్.సి.



డి.రామిరెడ్డి, ఎం.ఎల్.సి.
యుటియఫ్ సీనియర్ నాయకులు



వి.గోపాల్‌రెడ్డి
జెఏసి చైర్మన్



అశోక్‌బాబు
ఎపిఎన్‌జిఓ సెక్రటరీ జనరల్



ఎన్.నరసింహయ్య, ఎం.ఎల్.ఎ.,
నకిరేకల్



భాస్కర్
ఎస్.ఎఫ్.ఐ. కార్యదర్శి



ప్రసాద్
డి.వై.యఫ్.ఐ. అధ్యక్షులు



సత్యనారాయణ,
హైదరాబాద్ జెఏసి చైర్మన్



ఎం.ఎ.రహీం
ప్రధానోపాధ్యాయుల సంఘం అధ్యక్షులు



భగత్‌సింగ్ పుస్తకావిష్కరణ



వరంగల్ జిల్లా ఉపాధ్యాయుల
కరదీపిక ఆవిష్కరణ



కార్యకలాపాల నివేదిక ప్రవేశపెడుతున్న
ఎన్.నారాయణ



ఆర్థిక నివేదిక సమర్పిస్తున్న
ఎం.సంయుక్త



ఐక్యఉపాధ్యాయ నివేదికను ప్రతిపాదిస్తున్న
సి.హెచ్.రవి.

# యుటియఫ్ రాష్ట్ర నూతన ఆఫీస్ బేరర్లు


సి.హెచ్.సుభాస్ చంద్రబోస్
గౌరవ అధ్యక్షులు


ఎన్. నారాయణ
అధ్యక్షులు


పి. బాబురెడ్డి
సహాధ్యక్షులు


ఐ. వెంకటేశ్వరరావు
ప్రధాన కార్యదర్శి


ఎం. సంయుక్త
కోశాధికారి


సిహెచ్. రవి
కార్యదర్శి &
ప్రధాన సంపాదకులు

## కార్యదర్శులు


పి. మాణిక్‌రెడ్డి


బి. నాగేశ్వరరావు


సి.కె. నాగేంద్రబాబు


ఎన్.కిష్టయ్య


కె. విజయగౌరి


కె. వెంకట్రావు


ఎ. ఇజ్రాయెల్ రాజు


ఎ. నర్సిరెడ్డి


కె.ఎస్.ఎస్.ప్రసాద్


ఎన్.తాండవ కృష్ణ


వై. శ్రీనివాసులు రెడ్డి


బి. నర్సింహారావు

## ఆడిట్ కమిటీ


ఎ. వెంకట్
కార్యదర్శి


సిహెచ్.వి.రాజన్ బాబు
కన్వీనర్


వి. మాలకొండారెడ్డి


ఎ. శ్రీనివాస్


బి.వి. రమణ మూర్తి


మాణిక్యం శెట్టి

## ఐక్యఉపాధ్యాయ సంపాదకవర్గం


సిహెచ్. రవి.
ప్రధాన సంపాదకులు


ఎం. సంయుక్త


కె. వెంకట్రావు


ఎన్. పురుషోత్తంరావు


ఎ. రమాదేవి



## నివేదికలపై చర్చలలో పాల్గొన్న ప్రతినిధులు


డి. రాము
విజయనగరం


వెంకట్రావు
విజయనగరం


హనుమంతరావు
గుంటూరు


వెంకటేశ్వర్లు
గుంటూరు


సోమేశ్వర్లు
నిజామాబాద్


నాగమణి
విశాఖపట్నం

## నివేదికలపై చర్చలలో పాల్గొన్న ప్రతినిధులు


నర్సింహుడు
కర్నూలు


మాణిక్యం శెట్టి
కర్నూలు


ఇంద్రజిత్
హైదరాబాద్


స్వరాజ్‌కుమార్
హైదరాబాద్


స్వామిరెడ్డి
ఆదిలాబాద్


లచ్చీరాం
ఆదిలాబాద్


గిరిధర్
శ్రీకాకుళం


భాస్కరరావు
శ్రీకాకుళం


సత్యనారాయణ
మెదక్


సాయిలు
మెదక్


జిలానీ
అనంతపురం


ఓబులపతి
అనంతపురం


రంజిత్‌కుమార్
వరంగల్


మల్లారెడ్డి
వరంగల్


రాందాస్
ఖమ్మం


రాజశేఖర్
ఖమ్మం


లక్ష్మిరాజా
కడప


అశోక్
కరీంనగర్


రహమాన్
చిత్తూరు


శ్రీనివాసులు రెడ్డి
చిత్తూరు


మల్లారెడ్డి
రంగారెడ్డి జిల్లా


కైలాసం
రంగారెడ్డి జిల్లా


శ్రీహరిబాబు
తూ॥గో॥


ప్రభాకరవర్మ
తూ॥గో॥


కె.ఎ.ఉమామహేశ్వరరావు
కృష్ణా


రమేష్
కృష్ణా


దుర్గాభవాని
ఖమ్మం


శ్రీనివాసరావు
ప్రకాశం


విలియమ్స్
ప్రకాశం


పద్మావతి
గుంటూరు


శ్రీకాంత్
ప॥గో॥


బాలయ్య
ప॥గో॥


విజయగౌరి
తూ॥గో॥


శ్రీహరి
నెల్లూరు


పరంధామయ్య
నెల్లూరు


కనకదుర్గ
ప॥గో॥


రాందాస్
యం.నగర్


వెంకటప్ప
యం.నగర్


జి.ఉషాదేవి
నల్లగొండ


అనంతలక్ష్మి
గుంటూరు


సిహెచ్.రాములు
నల్లగొండ


ఎం.రాజశేఖర్‌రెడ్డి
నల్లగొండ

# యుటియఫ్ రాష్ట్ర మహాసభల దృశ్యాలు


యుటియఫ్ పతాకావిష్కరణగావిస్తున్న సుభాస్‌చంద్రబోస్


యుటియఫ్ పతాకావిష్కరణగావిస్తున్న పి.కృష్ణమూర్తి


నంద్యాల నర్సింహారెడ్డి సిపిఎం


జి.సుఖేందర్‌రెడ్డి టిడిపి


జె.రంగారెడ్డి ఎం.ఎల్.ఎ.


సాంస్కృతిక ప్రదర్శనలు ప్రారంభించి మాట్లాడుతున్న సుద్దాల అశోక్‌తేజ


ప్రజానాట్యమండలి జగన్ సందేశం


పి.కృష్ణమూర్తి


ఎ.సత్యం



యుటియఫ్ కార్యకర్తలు ప్రదర్శించిన పల్లెసుద్దులు దృశ్యం



ప్రజానాట్యమండలి వారి వీర తెలంగాణ పోరాటం (వీధినాటిక)

# విద్యారంగ సమస్యల పరిష్కారానికై రాష్ట్ర విద్యా కమీషన్‌ని నియమించాలి

# యుటీయఫ్ రాష్ట్ర మహాసభ ప్రత్యేక తీర్మానం

రాష్ట్ర విద్యారంగం అనేక సమస్యలతో ఆందోళనకరంగా వున్నది. పాఠశాలల స్థాపన, పని విధానం, ఉపాధ్యాయుల నియామకాలు, సర్వీస్ విషయాలు, ప్రైవేట్ పాఠశాలల నియంత్రణ, కరిక్యులమ్, సిలబస్, పర్యవేక్షణ, తనిఖీ, పరిపాలన, ప్రజల భాగస్వామ్యం తదితర విషయాలు చాలా గందరగోళంగా వున్నాయి. రాష్ట్ర పాఠశాల విద్య కోసం 27 సంవత్సరాల క్రితం 1982లో యాక్ట్ 1/1982, తేది. 5.2.1982 వచ్చింది. గడిచిన 27 ఏళ్లలో ఆ చట్టానికి అనేక సవరణలు జరిగి అది నిస్సారమైపోయింది. ముఖ్యంగా ప్రైవేట్ పాఠశాలల నియంత్రణకు సంబంధించిన నియమాలు పూర్తిగా సరళీకరించబడినాయి. దానితో ప్రభుత్వ విద్య నిర్వీర్యమై పోతూ ప్రైవేట్ విద్యా వ్యాపారానికి విశృంఖల స్వేచ్ఛ లభించింది. పబ్లిక్ ప్రైవేట్ పార్టనర్‌షిప్ పేరుతో ప్రభుత్వ విద్యలోకి ప్రైవేట్ శక్తుల చొరబాటు పెరిగిపోతున్నది. ఈ పరిస్థితిని సమగ్రంగా అధ్యయనం చేసి, విద్యారంగ సమస్యల పరిష్కారానికై రాష్ట్ర విద్యా కమీషన్‌ని నియమించాలని ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) 11వ రాష్ట్ర మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

రాష్ట్రంలో విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యల్ని అధ్యయనం చేయటానికై గత సంవత్సరం ఫిబ్రవరిలో యుటియఫ్ ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా సర్వే చేయటం జరిగింది. సర్వేలో సేకరించిన సమస్యలతో కూడిన మెమోరాండంలపైన రాష్ట్ర వ్యాప్తంగా 8 లక్షల మందితో సంతకాలు చేయించి ప్రభుత్వానికి సమర్పించాము. గతేడాది మార్చి 3న హైదరాబాద్‌లో 10 వేలమంది ఉపాధ్యాయులతో ప్రభుత్వ విద్యారక్షణ ప్రదర్శన చేసి, ఇందిరాపార్క్‌వద్ద బహిరంగ సభ నిర్వహించి ప్రతిపక్ష నాయకులు, ప్రజా సంఘాల బాధ్యులు, విద్యారంగ శ్రేయోభిలాషుల సమక్షంలో ఆమోదించిన విద్యారంగ డిమాండ్ల పత్రాన్ని ప్రభుత్వానికి సమర్పించటం జరిగింది. సంవత్సర కాలం గడుస్తోంది. సదరు డిమాండ్లలో ఒకటీ అరా పరిష్కారం తప్ప అన్నీ అలాగే వున్నాయి. అందువలన ఆ డిమాండ్లను అప్‌డేట్ చేసి యుటియఫ్ 11వ రాష్ట్ర మహాసభ సందర్భంగా వివిధ రాజకీయ పార్టీల నాయకులతో జరుగుతున్న రాష్ట్ర విద్యా సదస్సులో పునఃప్రతిపాదన చేస్తున్నాము.

1. రాష్ట్ర అభివృద్ధికి మౌలిక వసతుల కల్పనే కీలకమైంది. కానీ విద్యారంగంలో అందుకు తగిన చర్యలు తీసుకోవటం లేదు. పాఠశాలలకు తగినంత వసతి లేకపోవటం అనేది అతి పెద్ద సమస్యగా వున్నది. పట్టణాల్లోని పాఠశాలల స్థలాలు ఆక్రమణల పాలయినాయి. ప్రభుత్వ పాఠశాలల భవనాలు సరైన కండిషన్‌లో లేవు. 72% భవనాలకు తలుపులు, కిటికీలు సరిగాలేవు. 5452 పాఠశాలలకు అసలు భవనాలే లేవని, 55% పాఠశాలలకు ప్రహరీ లేదని, నూటికి 24 స్కూళ్లు ఒక్కో గదిలోనే నడుస్తున్నాయని ప్రభుత్వ నివేదికలే చెబుతున్నాయి. పాఠశాలలకు కనీస రక్షణ ఏర్పాట్లు లేవు. టీవీలు, కంప్యూటర్లు వంటి విలువైన సామాగ్రి అన్యాక్రాంతం అవుతున్నాయి. దొంగల దోపిడికి, బహిర్ భూములుగా, అసాంఘిక కార్యకలాపాలకు అనేక పాఠశాలలు గురవుతున్నాయి. విద్యాలయాల వాతావరణమే లేకుండా పోతున్నది. కనుక ప్రభుత్వ పాఠశాలలు అన్నింటికీ మౌలిక వసతులు కల్పించాలి. ముఖ్యంగా 24000 పాఠశాలలకు వెంటనే మంచినీటి సదుపాయం కల్పించాలి. బాలికల పాఠశాలలకు టాయ్‌లెట్స్ ఏర్పాటు చెయ్యాలి. ఇందుకు అవసరమైన నిధులు కేటాయించాలి.

2. ప్రభుత్వ పాఠశాలలకు బోధనేతర సిబ్బంది లేకపోవటం మరో పెద్ద సమస్యగా వున్నది. హైస్కూల్స్‌లో గుమాస్తా, అటెండర్, లాబ్ అసిస్టెంట్ వంటి వారు లేరు. కనీసం వాచ్‌మెన్ కూడా లేరు. ఇలాంటి పోస్టులు అనేవి చాలా కాలంగా చర్చలో కూడా లేవు. గతం నుండి కొనసాగుతున్న కొద్దిమందిగా వున్న వారికి జీతాలు కూడా సరిగా చెల్లించటం లేదు. దీనితో పాఠశాలల నిర్వహణ అస్తవ్యస్తంగా తయారైంది. కనుక పాఠశాలలకు బోధనేతర సిబ్బందిని నియమించాలి. అన్ని పాఠశాలలకు కనీసం వాచ్‌మెన్‌ని, హైస్కూళ్లకు కావాల్సిన కనీస సిబ్బందిని నియమించినా లక్షమంది నిరుద్యోగ యువతకు ఉద్యోగ అవకాశం లభిస్తుంది. పాఠశాలల నిర్వహణలో ఎంతో మార్పు వస్తుంది.

3. ప్రభుత్వ పాఠశాలల్లో చదువు సంతృప్తికరంగా లేకపోవటానికి ప్రధాన కారణం తగినంతమంది ఉపాధ్యాయులు లేకపోవటం, ద్వితీయ కారణం. వున్న వారితో సరిగా పని చేయించలేకపోవటం. ప్రభుత్వ ఖర్చుతో నడుస్తున్న పాఠశాలల్లో ప్రస్తుతం 2 లక్షల 70 వేలమంది ఉపాధ్యాయులే వున్నారు. ప్రాథమిక పాఠశాలల్లో సగటున 2.2 మంది, హైస్కూల్స్‌లో 6.4 మంది ఉపాధ్యాయులే వున్నారు. ఇటీవల జి.ఓ. 363 ద్వారా 16500 పోస్టులు సృష్టించబడినవి. అదే జి.ఓ.లో అప్‌గ్రేడేషన్‌తో 15584 సెకండరీ గ్రేడ్ పోస్టులు రద్దయినాయి. హైస్కూల్ హెడ్మాష్టర్ పోస్టుల కోసం 3933 ఎస్‌జిటీ పోస్టులు రద్దయినవి. దానితో ప్రాథమిక పాఠశాలల్లో ఉపాధ్యాయుల సంఖ్యను తగ్గించాలని విద్యాశాఖ నిర్ణయించింది. సక్సెస్ పథకం పేరుతో 6500 హైస్కూల్స్‌కే ప్రాధాన్యత యిస్తూ వేలాది పాఠశాలలను నిర్లక్ష్యం చేసే పరిస్థితి తయారైంది. కనుక అన్ని పాఠశాలలకూ తగినంతమంది ఉపాధ్యాయులు కావాలంటే ఇంకా లక్షమందిపైగా ఉపాధ్యాయులు కావాలి. డిఎస్‌సి 2008 ద్వారా 52 వేల టీచర్ పోస్టులు భర్తీ చేస్తామని ప్రకటించారు. గత రెండు డిఎస్‌సిల అనుభవాల ప్రకారం ఈ డిఎస్‌సి నియామకాలు ఎప్పుడు జరుగుతాయో చెప్పలేము. ఎయిడెడ్ స్కూల్స్‌లో నియామకాలు పూర్తిగా నిషేధించబడినవి.

4. ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయులతో సక్రమంగా పని చేయించలేని వైఫల్యం కొనసాగుతూనే వున్నది. ఏడాదికి ఒక్కసారైనా తనిఖీ చేసే విధానం, తరుచుగా పర్యవేక్షణలు జరిపే విధానం కనుమరుగైపోయింది. సగానికి పైగా మండలాల్లో విద్యాశాఖ అధికారులు లేరు. హైస్కూల్స్‌ని పర్యవేక్షించాల్సిన డిప్యూటీ డిఇఓ పోస్టులు 120కిగాను 92 ఖాళీగా వున్నాయి. ఉన్న కొద్ది మంది ఎంఇఓలు పాఠశాలల పర్యవేక్షణ కంటే వేరే పనుల్లోనే మునిగిపోతున్నారు. కనుక ప్రభుత్వ పాఠశాలలకు పర్యవేక్షణ, తనిఖీ విధానం పునరుద్ధరించబడాలి. క్షేత్ర స్థాయిలో అధికారుల నియామకాలు జరగాలి. పాఠశాల విద్య పరిపాలనా సామర్థ్యం పెరగాలి.

5. విద్యారంగానికి ప్రాధాన్యత యిస్తున్నట్లు బడ్జెట్ ప్రసంగాల్లో చెబుతున్నారు. కానీ ప్రతి బడ్జెట్‌లో విద్యారంగం వాటా తగ్గిపోతూనే వున్నది. 15 సంవత్సరాల క్రితం రాష్ట్ర బడ్జెట్‌లో విద్యారంగం వాటా 16%గా వుండేది. అది క్రమంగా తగ్గుతూ వచ్చి 2008-09 వార్షిక బడ్జెట్‌లో 10.2% (రు.10,426 కోట్లు)కి పడిపోయింది. అందులో పాఠశాల విద్యకి కేటాయించింది రు. 8655 కోట్లు. పాఠశాలలకు మౌలిక వసతులు కల్పించటానికి, అప్‌గ్రేడెడ్ పాఠశాలలకి బోధనా,

సిబ్బందిని నియమించటానికి కనీసం రు. 11,400 కోట్లు కావాలని పాఠశాల విద్యాశాఖ చేసిన ప్రతిపాదనను పట్టించుకోలేదు. కేటాయించిన రు. 10426 కోట్లలో కూడ ఖర్చు చేసింది రు. 9,811 కోట్లు మాత్రమే. ఇక 2009-10 ఓటాన్ ఎకౌంట్ బడ్జెట్‌లో రు. 11,137 కోట్లు సాధారణ విద్యకి కేటాయించినట్లు చెప్పారు. ఇది మొత్తం బడ్జెట్‌లో సుమారు 11%మే అవుతుంది. అందరికీ నాణ్యమైన విద్యని అందించాలంటే, సకాలంలో సంపూర్ణ అక్షరాస్యతను సాధించాలంటే రాష్ట్ర బడ్జెట్‌లో 30% కేటాయించాలనే కొఠారి, ఖేర్ కమిటీల సూచనలను పాటించటం లేదు. కనుక విద్యారంగానికి బడ్జెట్ కేటాయింపులు పెంచాలి, కేటాయించిన బడ్జెట్‌ని సద్వినియోగం చేయాలి.

6. విద్యకి బడ్జెట్ కేటాయింపులే చాలినంతగా లేకపోగా అందులో అవినీతి, దుర్వినియోగంతో మరింత నష్టం జరుతోంది. స్వచ్ఛంద సంస్థలకు, ప్రైవేట్ సంస్థలకు కోట్లాది రూపాయాలు వెచ్చిస్తున్నారు. సకాలంలో ఖర్చు చేయకపోవటంతో పెద్ద ఎత్తున నిధులు దారిమళ్లుతున్నాయి. ఎస్ఎస్ఏలో ఎన్ని కోట్లు అన్యాక్రాంతమవుతున్నాయో యిటీవలి కుంభకోణాలు తెలియజేస్తున్నాయి. పై స్థాయిలో మంత్రులు, అధికారుల ఖర్చు విపరీతంగా పెరిగి పోతూవుంటే క్షేత్ర స్థాయి అధికారులైన మండల విద్యాశాఖాధికారులకు కనీసం అటెండర్ కూడ లేదు. పాఠ్య పుస్తకాల సరఫరాకి రవాణా చార్జీలు కూడ చెల్లించడం లేదు. ఈ పరిస్థితి మారాలి. విద్యాశాఖ నిధుల వినియోగంపై సరైన నియంత్రణ విధానం వుండాలి. విద్యారంగంలో అవినీతి, అక్రమాలు అరికట్టాలి.

7. పాఠశాలలో పనిచేస్తున్న ఉపాధ్యాయుల పరిస్థితి నిత్యం ఆందోళనకరంగా గడుస్తున్నది. అనేక సమస్యలు సంవత్సరాల తరబడి పెండింగ్‌లో వుంటున్నాయి. ఉపాధ్యాయ సంఘాల పోరాటాల ఫలితంగా అప్రెంటిస్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు ఇచ్చే జి.ఓ. వచ్చినా అది వాస్తవంగా అమలు జరిగేది 2010 ఏప్రిల్‌లో అనటం వలన సదరు ఉపాధ్యాయుల అసంతృప్తి అలాగే వున్నది. స్పెషల్ విద్యావాలంటీర్ల సర్వీస్‌కి, ఎస్‌సి, ఎస్‌టి టీచర్ల అన్‌ట్రైన్డ్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు యివ్వకపోవటం వలన బలహీన వర్గాల ఉపాధ్యాయుల పరిస్థితి బాధాకరంగా మారింది. మూడేళ్ళ నుండి పెండింగ్‌లో వున్న ప్రమోషన్లు ఎట్టకేలకు లభించినా బదిలీలు జరగలేదనే అసంతృప్తి మిగిలింది. ఎయిడెడ్ టీచర్ల అన్‌ఎయిడెడ్ సర్వీస్, పండితుల అప్‌గ్రేడేషన్ ప్రయోజనం రద్దు అయినందున సదరు ఉపాధ్యాయులు తీవ్రమైన ఆవేదనతో వున్నారు. జి.ఓ. 363 ద్వారా ఎస్‌జిటి పోస్టులను స్కూల్ అసిస్టెంట్ పోస్టులుగా అప్‌గ్రేడ్ చేసి గ్రేడ్ 2 పండిట్స్, పిఇటీ పోస్టులను అప్‌గ్రేడ్ చేయకపోవటం వలన వారంతా ఆగ్రహంతో వున్నారు. ఇలాంటి ముఖ్యమైన సమస్యలు పరిష్కరించి ఉపాధ్యాయులు సంతృప్తికరంగా పనిచేసే వాతావరణం కల్పించాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

## కృష్ణా గుంటూరు జిల్లాల ఉపాధ్యాయ ఎమ్మెల్సీ ఎన్నిక ఓట్ల వివరాలు

Total Valid Votes : 9814

Value of Each Vote : 1

Total Value of Valid Votes : 9814 Quota : 4908

| Name of the Candidate | Value of Votes at initial count |
|---|---|
| Sri Athuri Venkata Ranga Rao | 1928 |
| Sri K.S. Lakshman Rao | 7625 |
| Sri G. Satyanarayna | 261 |
| Non-transferable Papers | ---- |
| Loss due to fraction fo exhausted votes | ---- |
| **Total** | **9814** |

## ఉభయ గోదావరి జిల్లాల ఉపాధ్యాయ ఎమ్మెల్సీ ఎన్నికల ఓట్ల వివరాలు

| Name of the Candidate | Value of votes at first count | Distribution of votes of M.R. Rao | Result | Distribution of votes of G. Pulluri | Result | Distribution of votes of S.K. Kumar | Result | Distribution of votes of G. S. Bose | Result | Distribution of votes of J.S. | Result | Distribution of votes of E.R.A.Rao | Result |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. E.R. Appa Rao | 385 | 01 | 386 | 01 | 387 | 01 | 394 | 9 | 403 | 4 | 407 | -407 | 0 |
| 2. I. Satyanarayana | 162 | 01 | 163 | 02 | 165 | 01 | 166 | 0 | 169 | -169 | 0 | 0 | 0 |
| 3. Elizebeth Makey | 15 | 0 | 15 | 0 | 15 | -15 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| 4. Gandhi Pulluri | 11 | 0 | 11 | -11 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| 5. G. S. Chandra Bose | 51 | 01 | 52 | 01 | 53 | 01 | 54 | 54 | -54 | 0 | 0 | 0 | 0 |
| 6. Ch.S. Chandra Bose | 5222 | 03 | 5225 | 01 | 5226 | 01 | 5227 | 9 | 5248 | 80 | 5328 | 164 | 5492 |
| 7. M. Raja Gopala Rao | 8 | -8 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| 8. KVV.Satyanarayana Raju | 5560 | 2 | 5562 | 2 | 5564 | 5 | 5569 | 19 | 5600 | 61 | 5661 | 144 | 5805 |
| 9. S. Krishna Kumar | 35 | 0 | 35 | 0 | 35 | 0 | 35 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |

**Remarks : Declared Elected**

| | Total Votes | Votes Polled | Quota |
|---|---|---|---|
| East Godavari | 7364 | 6469 | 5725 |
| West Godavari | 5792 | 5208 | |
| Total | **13156** | **11677** | |
| Invalid | | 228 | |
| Exact | | 11449 | |

యుటియఫ్ 11వ రాష్ట్ర మహాసభలు

# ఉమ్మడి పోరాటాలే శరణ్యం

## ప్రతినిధుల సభలో వక్తల సందేశాలు



పెట్టుబడిదారీ దేశాలన్నీ ఆర్థిక సంక్షోభ ప్రళయంలో కొట్టుకుపోతుంటే దాని తీవ్రత భారత దేశంపై పడకుండా కార్మిక వర్గమే కాపాడిందని సిఐటీయు రాష్ట్ర అధ్యక్షులు ఎస్. వీరయ్య ఉద్ఘాటించారు. మహాసభ ప్రతినిధుల సమావేశాన్ని ఆయన ప్రారంభిస్తూ ప్రస్తుతం దేశంపై ఆర్థిక సంక్షోభ ప్రభావం తక్కువగా కనిపిస్తున్నప్పటికి కొద్ది కాలంలోనే దాని తీవ్రత పెరుగుతుందన్నారు. ఒక్క ఐటి రంగంలోనే వేలాది ఉద్యోగాలు పోయినాయని, రియల్ ఎస్టేట్ వ్యాపారం పూర్తిగా దెబ్బతిన్నదని, ఇతరేతర అన్ని రంగాల్లోనూ లక్షలాది ఉద్యోగులు ఉద్యోగాలు కోల్పోయి ఇళ్ళకు చేరారని, రాబోయే జూన్ నాటికి ఈ తీవ్రత పెరుగుతుందన్నారు. భారత ఆర్థిక వ్యవస్థ అమెరికా ఆధారిత ఎగుమతులపై ఆధారపడి ఉండడంతో సంక్షోభం ప్రభావం పెరుగుతుందన్నారు. సంక్షోభం నుండి బయట పడేందుకు పెట్టుబడిదారీ దేశాలు తమ ఫైనాన్సు వ్యవస్థల్ని ప్రభుత్వపరం చేస్తుండగా భారత దేశంలో మాత్రం ఆ దేశాల అనుభవాలను గుణపాఠంగా తీసుకోవడంలేదన్నారు. దేశం క్లిష్ట పరిస్థితుల్లో ఉన్న సమయంలో ప్రతిపక్ష బిజెపి మాత్రం సమస్యను పక్కదారి పట్టించే విధంగా రామాలయ నిర్మాణ అంశాన్ని ప్రచారం చేస్తుందని, సంక్షోభ ప్రభావంపై కానీ, సంక్షోభం ఫలితాలపైకాని, నివారణపై కానీ వారి దృష్టి లేదన్నారు.

యుపిఏ ప్రభుత్వం గడిచిన నాలుగు సంవత్సరాల్లో వామపక్షాల మద్దతుతో నిలచిన కారణంగా ప్రైవేటీకరణ ప్రక్రియ చేయలేకపోయిందని, మద్దతు ఉపసంహరణ తరువాత ధరల పెరుగుదల, ఆర్థిక రంగాన్ని ప్రైవేటీకరించే దిశగా వేగంగా అడుగులు వేయడం చూస్తున్నామని దీంతో సంఘటిత, అసంఘటిత రంగంలో సంక్షోభం పెరుగనుందనీ అన్నారు. ఈ సందర్భంలో ఉమ్మడి పోరాటాలు అత్యవసరమనీ, ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికులు సమైక్యంగా కదలాలని, ఒకరికొకరు తోడ్పాటునందించుకోవాలని ఎవరు ఉద్యమించినా వారికి బాసటగా మేమున్నామని అందరూ కదలాలని అప్పుడే ఈ ప్రజావ్యతిరేక, కార్మిక వ్యతిరేక ప్రభుత్వాలు వెనుకడుగువేస్తాయని లేనట్లయితే ఉద్యమాలను చీల్చి తమ పబ్బం గడుపుకుంటాయని జాగరూకతతో ఉండాలని హెచ్చరించారు.

### విశాల ఐక్య ఉద్యమం నిర్మించాలి-ఎమ్మెల్సీ శర్మ

పిడిఎఫ్ నాయకులు ఎమ్మెల్సీ ఎం.వి.ఎస్. శర్మ మాట్లాడుతూ, యుటియఫ్ మహాసభలు రాష్ట్రంలోని మొత్తం ఉపాధ్యాయ ఉద్యమాన్ని ప్రభావితం చేస్తాయన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. ప్రస్తుత ప్రభుత్వం అరచేతిలో వైకుంఠం చూపిస్తూ మొత్తం ప్రజానీకాన్ని భ్రమల్లో ముంచెత్తుతుందన్నారు. ఒక వంక సమస్యలు వరిష్కారానికి నోచుకోకపోవడంతో ఉద్యమాలు తీవ్ర రూపం దాలుస్తుంటే మరో వంక ప్రభుత్వం ఉద్యమాల్ని నిర్వీర్యం చేసే కుట్రలకు పాల్పడుతుందని అన్నారు. ప్రభుత్వ నిర్లక్ష్యం, మొండి తనం వల్లే ఉద్యమాలు ఉవ్వెత్తున సాగుతున్నాయన్నారు. ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు విధానాలనే తూచా తప్పకుండా అనుసరిస్తున్నందువల్లనే విద్య, వైద్యం తీవ్ర నంక్షోభానికి గురవుతున్నాయన్నారు. ఉమ్మడి ఉద్యమం నుండి యుటియఫ్‌ను వెలివేసినప్పటికి ప్రభుత్వం యుటియఫ్ సమరశీలతను గుర్తించిందన్నారు. సమ్మె అనంతర కాలంలో వచ్చిన ప్రభుత్వ ఉత్తర్వులే అందుకు నిదర్శనమన్నారు. ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించబడాలంటే విశాల ఐక్య ఉద్యమం నిర్మించాలని ఈ కర్తవ్యంలో యుటియఫ్ కీలక బాధ్యత వహించాలని అన్నారు. ప్రస్తుతం రాష్ట్ర పరిస్థితుల్లో మార్పు కావాలంటే మూడో ప్రత్యామ్నాయ రాజకీయ శక్తుల బలోపేతానికి ఉపాధ్యాయ వర్గం తోడ్పాటునందించాలన్నారు.



### అవినీతి వ్యతిరేకతే ప్రధాన ఎజెండాగా పని చేయాలి-ఎమ్మెల్సీ డి.రామిరెడ్డి

ఉద్యమ విస్తరణకు, బలానికి అధిక ప్రాధాన్యత ఇవ్వాలని, ప్రణాళికా బద్ధంగా ముందుకు సాగడంతోనే భవిష్యత్తులో ఉపాధ్యాయ ఉద్యమానికి నిర్ణాయక శక్తిగా మారాలని ఎమ్మెల్సీ రామిరెడ్డి ఆకాంక్షించారు. పోరాట వారసత్వానికి పదును పెట్టుకోవాలని అన్నారు. సంఘానికి ఆర్థిక పరిపుష్టి పెంపొందిచుకునే దిశగా ప్రణాళికలు వేసుకోవాలన్నారు. రాష్ట్రంలో అన్ని రంగాలతోపాటు విద్యాశాఖలో కూడా అవినీతి, అక్రమాలు పెచ్చుమీరుతున్నందున వాటిని అరికట్టడమే ప్రధాన అజెండాగా ఉపాధ్యాయులు పని చేయాలని పిలుపునిచ్చారు. యుటియఫ్ కార్యకర్తలు త్యాగం, క్రమశిక్షణ, నైతిక విలువల్ని తప్పనిసరిగా పాటించాలన్నారు. వని తీరును మెరుగుపరుచుకునేందుకు దిద్దుబాటు కార్యక్రమాన్ని నిరంతరం కొనసాగించాలని పేర్కొన్నారు.

### పోరాటాలతోనే ప్రభుత్వ పెన్షన్‌కు రక్షణ

ఉపాధ్యాయ ఉద్యమాలకు పోరుబాట చూపి హక్కుల సాధనలో బాధ్యతల నిర్వహణలో అగ్రగామిగా నిలిచిన ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అభినందనీయురాలని జెఏసి చైర్మన్ వి. గోపాలరెడ్డి అభినందించారు. ఫిబ్రవరి 22న ప్రతినిధుల సభలో ముఖ్య అతిథిగా పాల్గొని సందేశం యిచ్చారు. ఆయన మాట్లాడుతూ ఈ మహాసభల్లో తీసుకున్న నిర్ణయాలు, ఆమోదించిన తీర్మానాలు ప్రభుత్వం ముందు పెట్టి ఫలితాలు సాధించుకునే క్రమంలో మీకు అండగా ఉంటామని హామీ యిచ్చారు. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు 22% ఐఆర్ సాధించడంలో జెఏసికి యుటియఫ్ మద్దతుగా నిలిచిందన్నారు. న్యాయమైన సమస్యలపై సమ్మెలోకి దిగిన ఉపాధ్యాయ ఉద్యమాన్ని ప్రభుత్వం చీల్చే ప్రయత్నం చేయడమేకాక అనేక కక్షసాధింపు చర్యలకు పూనుకోవడం గర్హనీయమన్నారు. ప్రశ్నించే హక్కులేనప్పుడు ఇంక సంఘాలు ఎందుకని ప్రశ్నించారు. ప్రభుత్వానికి చెక్క భజన చేయడానికి సంఘాలు అవసరమా? అన్నారు.



పెన్షన్ ప్రైవేటీకరణ బిల్లును పార్లమెంటులో వామపక్ష ఎంపిలు అడ్డుకున్నందునే అది చట్ట రూపం దాల్చలేదని, హర్షాద్ మెహతాలు, సత్యం వంటి వారిని పెంచి పోషించే ఈ ప్రభుత్వాలు ప్రభుత్వ ఉద్యోగుల అవసరాలను మాత్రం పట్టించుకోరని విమర్శించారు. కొత్త పెన్షను బిల్లును రద్దు చేయడం కొరకు మనమంతా పోరాడాలన్నారు. విద్య, వైద్యం, రోడ్లు తదితర ప్రభుత్వ రంగాలను ప్రైవేటుపరం చేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదని, అన్ని రంగాల్లోనూ ఔట్ సోర్సింగ్ ఎక్కువై పోయిందని ఆ విధానం రద్దు చేయాలని ప్రభుత్వాన్ని గోపాలరెడ్డి డిమాండ్ చేశారు. రాష్ట్రంలోని మూడు లక్షల ఖాళీలను వెంటనే భర్తీ చేయాలని డిమాండ్ చేశారు. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు ఇళ్ళ స్థలాల నిమిత్తమై యిచ్చిన ఉత్తర్వులను అమలు చేయాలని, కేంద్ర ప్రభుత్వం మహిళా ఉద్యోగులకు కల్పించిన ఆరు నెలల ప్రసూతి సెలవు, పిల్లల పెంపకం, చదువులకై యిచ్చిన 2 సం॥ల ఆర్జిత సెలవును రాష్ట్ర ప్రభుత్వ మహిళా ఉద్యోగులకు కల్పించాలని అన్నారు. యుటియఫ్ మహాసభలు సమస్త ఉపాధ్యాయ లోకానికి వెలుగు బాటలు చూపుతాయని ఆకాంక్షించారు.

### యుటియఫ్ పోరాట పటిమగల సంఘం

#### జెఏసి డిప్యూటీ సెక్రటరీ జనరల్ అశోక్‌బాబు ప్రశంస

జెఏసి డిప్యూటీ సెక్రటరీ జనరల్ అశోక్ బాబు మహాసభనుద్దేశించి సందేశం యిస్తూ మహాసభలను విజయవంతం చేసుకొని భవిష్యత్ ప్రణాళికతో సమస్యల

(తరువాయి 33వ పేజీలో)

# మళ్ళీ మొదలైన APTF వారి సిద్ధాంత రాద్ధాంతం

# ఐక్యతను దెబ్బతీసే వాదనలు కొనసాగించవద్దు

అనవసర వాదనలను అలవోకగా సాగించటం ఏపీటిఎఫ్ (257) వారికి అలవాటు. సిద్ధాంతేతర సమస్యలతో సైద్ధాంతిక రాద్ధాంతం చెయ్యటం వారి ప్రత్యేకత. ఐక్య ఉద్యమాలలో రంధ్రాన్వేషణలు చెయ్యటం, తీర్పులు చెప్పటం, ఇతర సంఘాలకు నీతులు చెప్పటం వారికి అలవాటు. 25 ఏళ్ళ క్రితం ఉపాధ్యాయ, ఐక్య ఉపాధ్యాయ పత్రికల్లో రెండు సంఘాల మధ్య వాదోపవాదాలు సీరియల్స్‌గా నెలల తరబడి కొనసాగేవి. ఈ మధ్యన అది సద్దుమణిగింది. ఇప్పుడు మళ్లీ మొదలైంది. ఇటీవలి కాలంలో యుటియఫ్, ఏపీటిఎఫ్ (257) మధ్య పెరుగుతున్న స్నేహం, సహకార వాతావరణానికి విఘాతం కల్గించే పరిస్థితి తయారయింది.

జాక్టో 13 రోజుల సమ్మె అర్థాంతర ముగింపుకి కారణమైన సంఘాలు ఉపాధ్యాయులకు సంజాయిషీ చెప్పుకోవాల్సి వచ్చినప్పుడు సూటిగా చెప్పుకోలేక తమ వైఫల్యాన్ని కప్పిపుచ్చుకోవటానికి యుటియఫ్‌పై నిందలు వేస్తూ తమ పత్రికల్లో వ్రాసుకొన్నారు. వాటన్నింటికీ జవాబు చెబుతూ గత డిసెంబర్ ఐక్య ఉపాధ్యాయలో ఒక వ్యాసం వ్రాయటం జరిగింది. దానిలో భాగంగా అంతకు ముందు నవంబర్ ఉపాధ్యాయ పత్రికలోని సంపాదకీయం యుటియఫ్‌పై చేసిన వ్యాఖ్యలకు జవాబు చెప్పాల్సి వచ్చింది. అది వక్రీకరణ అంటూ గత జనవరి 'ఉపాధ్యాయ'సంచికలో భానుమూర్తిగారు పేరుతో మరో వ్యాసం వ్రాశారు. సమ్మె విరమించిన యుటియఫ్ స్వార్థపూరిత ఎత్తుగడలతో వ్యవహరించిన తీరును మాత్రమే పాలపొంగుతో పోల్చామని వివరణ యిచ్చారు. దానికో సైద్ధాంతిక ప్రాతిపదికని జోడించి నిజమైన చైతన్యాన్ని కాదని పొంగును పట్టాలనే ఎత్తుగడలు వేస్తే వారికి (యుటియఫ్‌కి అని) మిగిలేది గ్లాస్ అడుగున చుక్కలు మాత్రమే' అంటూ తీర్పు చెప్పేశారు. సదరు తీర్పుకి సంబంధించిన పేరాని యథాతథంగా క్రింద పేర్కొంటున్నాను. పరిశీలించగలరు.

"**లేచిపడే కెరటం**; పడిలేచే కెరటం-ఈ రెండింటికి సమానార్థాలు స్ఫురించినా, పురోగమనం ఎప్పుడూ పడిలేచే కెరటాన్నే ఆదర్శంగా తీసుకోవాలి. ప్రతి సూర్యాస్తమయం కూడా మరో అరుణోదయం కోసమే అనుకోవాలి. ఈ వాస్తవాన్ని విస్మరించి, తాత్కాలిక ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని ఉపాధ్యాయుల అసంతృప్తులను అవకాశంగా కొన్ని సంఘాలు తీసుకొని; వారి సమస్యల పట్ల తామొక్కరమే పోరాటాలు చేయగలమనే భ్రమలకు గురిచేసి, పాలపొంగును గ్లాసులోకి పట్టాలను కోవడం అడియాశే అవుతుంది. 13 రోజుల పాటు యావత్ ఉపాధ్యాయ లోకం అత్యంత చైతన్యవంతంగా సాగించిన ఈ సమ్మె ముగింపు అంకంలో కొన్ని సంఘాలు వ్యవహరించిన తీరు ఐక్య ఉద్యమ స్ఫూర్తికి విరుద్ధమే కాదు, ఐక్య ఉద్యమ ఫలితాలను తామొక్కరమే సొంతం చేసుకోవాలనే స్వార్ధ పూరితమైన తాపత్రయంగా వ్యక్తమైంది. అంటే ఇల్లు తగలబడిపోతుంటే, బొగ్గులేరుకుందాం అన్న చందంగా ఉన్నది. ఇది సమస్యల పరిష్కారానికి అవసరమయ్యే నిజాయితీతో కూడిన ప్రయత్నం మాత్రం కాదు".

ప్రధాన సమస్యలు పరిష్కారం కాకుండా సమ్మెని విరమించటం పట్ల ఉపాధ్యాయుల్లో పెల్లుబికిన అసంతృప్తి, ఆందోళనకు అనుగుణంగా పోరాటాన్ని కొనసాగించాలని యుటియఫ్ చేసిన కృషి పాలపొంగు చుక్కల్ని పట్టుకోవటానికి చేసిన స్వార్థపూరిత చర్యగా ఏపిటిఎఫ్ వారికి కనిపిస్తుందట! 13 రోజుల పాటు ఎంతో పట్టుదలగా సమ్మెచేసిన ఉపాధ్యాయుల చైతన్యాన్ని నీరుగార్చింది ఎవరు? అర్థాంతరంగా సమ్మెని విరమించి ప్రభుత్వానికి లొంగిపోయినవారా? ప్రధాన సమస్యలు పరిష్కారం కాకుండా సమ్మెని విరమించటం సరైంది కాదని చెప్పిన యుటియఫ్ మరో రెండు సంఘాలా? అనే విషయాన్ని ఉపాధ్యాయులు బాగానే అర్థం చేసుకొన్నారు. అదిచాలు. ఐక్య ఉద్యమ ఫలితాలను తామొక్కరమే (వారు చెప్పేది యుటియఫ్ గురించే) సొంతం చేసుకోవాలనే స్వార్థపూరితమైన తాపత్రయంగా, ఇల్లు తగల బడిపోతుంటే బొగ్గులేరుకొందామనే చందంగా వుందని ఆరోపించారు. ఉపాధ్యాయుల అసంతృప్తిని, ఆందోళనను ప్రభుత్వంపైకి మళ్లించటానికి చేసిన ప్రయత్నాన్ని బొగ్గులేరుకోవటంగా చిత్రీకరిస్తున్నారంటే ఏపిటిఎఫ్ వారి ఆక్రోశం ఏ స్థాయిలో వుందో అర్థం చేసుకోవచ్చును. ఐక్య ఉద్యమ ఫలితాలు ఏమి వచ్చాయని సొంతం చేసుకోవటానికి! ఏమీ రాలేదని, వచ్చినట్లుగా అనిపించిన అప్రెంటిస్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు జి.ఓ. 2 కరిమింగిన వెలగ పండులాంటిదని ఆ సంఘం వారూ (ఆంధ్రజ్యోతి దినపత్రిక మార్చి 13లో వేణుగోపాల్ గారి వ్యాసం చూడండి) ఘంటాపథంగా చెబుతూనే వున్నారు. అందుకు భిన్నంగా ఏవో ఫలితాలు వచ్చినట్లు, వాటిని సొంతం చేసుకోవటానికి యుటియఫ్ తాపత్రయ పడినట్లు తీర్పులు చెబుతున్నారు. ఆ మాటకొస్తే అరకొరగా వచ్చినట్లు భ్రమింపచేసిన ఐక్య ఉద్యమ ఫలితాన్ని కబ్జా చెయ్యటానికి అంత బిల్డప్ యిచ్చిన (జనవరి 5న స్వంత సభ పెట్టి, ముఖ్యమంత్రికి మొక్కించి, తమ వలనే జి.ఓ.2 వచ్చిందని చెప్పుకొన్న) పిఆర్‌టియుని మాత్రం ఏపిటిఎఫ్ వారు ఏమీ అనలేకపోతున్నారు.

భానుమూర్తి వ్యాసంలోని మరో ఆరోపణ క్రింది విధంగా వుంది.

"యుటియఫ్ వారికి అప్రెంటిస్ ఉపాధ్యాయుల సమస్య పరిష్కారానికి చిత్త శుద్ధి వుంటే, జాక్టో సమావేశంలో 'సమ్మె కొనసాగించాలన్న' తమ దృఢమైన నిర్ణయాన్ని ప్రకటించి, కొన్ని భావ సారూప్య సంఘాలను, చిన్న సంఘాలను ప్రభావితం చేసి, సమ్మెను నీరుగార్చాలనుకునే వారి ప్రాబల్యం లేకుండా అడ్డుకట్ట వేయడానికి ప్రయత్నం చేయాలి. యుటియఫ్ అలా చేయలేదు. జాక్టో కమిటీ సమావేశంలో తన నిర్ణయం ప్రకటించలేదు. బయట మీడియా వారి ముందు ప్రకటించి ఉపాధ్యాయ లోకంలో కొంత గందరగోళం కల్గించడానికి యత్నించింది".

అప్రెంటిస్ సర్వీస్ సమస్యపట్ల యుటియఫ్ చిత్తశుద్ధి ఏమిటో సంబంధిత ఉపాధ్యాయులకు తెలుసు. అందుకు ఏపిటిఎఫ్ వారి సర్టిఫికెట్స్ అక్కర్లేదు. అప్రెంటిస్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు యివ్వాలనే ప్రతిపాదనను 2005 సంవత్సరంలోనే యుటియఫ్ చేసింది. ఆ తర్వాత అది ఐక్య పోరాట డిమాండ్‌గా మారింది. సమ్మె కొనసాగించాలన్న దృఢ నిర్ణయాన్ని జాక్టో సమావేశంలో ప్రకటించకుండా బయట మీడియాకి చెప్పి గందరగోళ పరిచారనేది వారి ముఖ్యమైన ఆరోపణగా వుంది. 'ప్రధాన సమస్యలు పరిష్కారం కాని చర్చలు అసంతృప్తికరం, అందువలన ఈ ఒప్పందం మాకు అంగీకారం కాదు. ఈ సందర్భంలో యితర సంఘాల ధోరణి సమ్మెని కొనసాగించే విధంగా లేదు. అందువలన సమ్మెని కొనసాగించాలా? లేదా అనే విషయంలో మా సంఘం వైఖరిని మా కమిటీతో మాట్లాడుకొని చెబుతామని జాక్టో సమావేశంలో యుటియఫ్ బాధ్యులు చెప్పారు. ఆ తర్వాత వెంటనే యుటియఫ్ బాధ్యులతో

సంప్రదించుకొన్న తర్వాత 'మెజార్టీ సంఘాలు సమ్మెని కొనసాగించేదానికి సుముఖంగా' లేనందున గత్యంతరం లేని పరిస్థితుల్లో యుటియఫ్ కూడ సమ్మెని విరమిస్తుందని ప్రకటించటం జరిగింది. ఆ సందర్భంలో గందరగోళం కల్గింది సమ్మె విరమించిన సంఘాలకే ఉపాధ్యాయ లోకానికి కల్గింది గందరగోళం కాదు తీవ్రమైన అసంతృప్తి. ఐక్య ఉద్యమాల్లో సభ్య సంఘాలు తమ అభిప్రాయాలను సమావేశాల్లో అందరి సమక్షంలో బహిరంగంగా చెప్పుకోవాలనేది యుటియఫ్ వైఖరి. స్వంత అభిప్రాయాల్ని ముందే చెప్పుకొని కొన్ని సంఘాల్ని ప్రభావితం చెయ్యటం అనేది ఐక్య ఉద్యమాల్లో ముఠాలు కట్టటం అవుతుంది. అలాంటి పని యుటియఫ్ చెయ్యదు. యుటియఫ్ అలా చెయ్యలేదు గనుక ఏపిటిఎఫ్ సమ్మెని నీరుగార్చాలనుకునే వారితో కలిసిపోయిందా? నిజాల్ని నిర్భయంగా చెప్పుకోలేక యుటియఫ్‌పై నిందలు వేయటం, ఐక్య ఉద్యమాల నుండి బహిష్కరించటం, ఒంటరి చేసి దెబ్బతీయాలనుకోవటం భావసారూప్య సంఘంగా చెప్పుకొనే ఏపిటిఎఫ్ చెయ్యాల్సిన పనేనా?

సమ్మె విరమించినా సమస్యల పరిష్కారం కోసం పోరాటాన్ని, కొనసాగిస్తామని యుటియఫ్ చెప్పింది. చెప్పినట్టే పోరాటాన్ని కొనసాగించటం జరిగింది. నవంబర్ రెండోవారం నుండి ముఖ్యమంత్రికి అప్రెంటిస్ సర్వీస్ టీచర్లు పెద్ద ఎత్తున ఉత్తరాలు వ్రాశారు. నవంబర్ చివరలో జిల్లా కేంద్రాల్లో 3 రోజులు సామూహిక నిరాహారదీక్షలు జరిగాయి. డిసెంబర్ 3న 10 వేలమంది ఉపాధ్యాయులతో హైదరాబాద్‌లో చలో అసెంబ్లీ జరిగింది. వేలాదిమంది ఉపాధ్యాయులు అరెస్ట్ అయ్యారు. సమస్యలు పరిష్కరించపోతే ఉద్యమాన్ని మరింత ఉధృతం చేస్తామని హెచ్చరించటం జరిగింది. యుటియఫ్ పోరాటానికి అప్రెంటిస్ సర్వీస్ టీచర్లు బాగా స్పందించారు. తదనంతర పరిణామాలను ప్రభుత్వం అర్థం చేసుకొన్నది గనుకనే దిగి వచ్చింది. నోషనల్ ఇంక్రిమెంట్లు యిచ్చినట్లు అనిపించి ఉపాధ్యాయుల ఆగ్రహం నుండి తప్పించుకోవాలనుకొంది. అందుకు పిఆర్‌టియు వారి వేదికను ఎంచుకొన్నది. ప్రభుత్వం, పిఆర్‌టియు కుమ్మక్కయి ఐక్య ఉద్యమ ఫలితాన్ని అపహాస్యంగా చేస్తే దాన్ని పట్టించుకోకుండా యుటియఫ్‌పై సిద్ధాంత రాద్ధాంతం చేసి ఏమి సాధించగలరో ఏపిటిఎఫ్ వారే ఆలోచించుకోవాలి. ఐక్యతను దెబ్బతీసే వాదనలు కొనసాగించటం ఎందుకో పరిశీలించుకోవాలి.

ఇక భానుమూర్తి గారి వ్యాసంలోని మరో అంశం ఐక్య ఉపాధ్యాయ డిసెంబర్ సంచికలోని 'చెన్నుపాటి వారసత్వాన్ని కొనసాగించుదాం' అనే సంపాదకీయం అభ్యంతరకరంగా వుందట! చెన్నుపాటి వారసత్వం మా ఒక్కరికే అన్నట్లుగా సందపాదకీయంలో వుంది. ఆ హక్కు అందరిది కదా అంటున్నారు. చెన్నుపాటి ఆశయాలను త్రికరణ శుద్ధిగా ఆచరించే వారెవరైనా చెన్నుపాటి వారసులే, కాదనే హక్కు ఎవరికీ లేదు. అయితే ఆయన ఆశయాల బాటలోనే పయనిస్తున్నామా లేదా అనేది ఎవరికి వారు స్వీయ విమర్శ చేసుకుంటే సరిపోతుంది. ఎవరికి ఏ అభ్యంతరాలున్నా చెన్నుపాటి ఆశయాల వారసత్వం యుటియఫ్‌దేనని మరొకమారు పునరుద్ఘాటిస్తున్నాము. ఉపాధ్యాయులందరూ ఐక్యం కావాలనేది చెన్నుపాటి ఆశయం. ఆ ఆశయాన్ని ఆంధ్రప్రదేశ్ అంతటా ఏపిటిఎఫ్ కంటే ఎంతో ముందుగా (ఈ సత్యాన్ని) అమలు చేసింది యుటియఫ్ మాత్రమే. కాదనగలరా? సంపాదకీయంలో చెన్నుపాటి గురించే చెప్పుకొన్నారు. ఆయనతో పాటు సింగరాజు రామ కృష్ణయ్య పేరును పేర్కొనకపోవటం ఏమిటని ప్రశ్నిస్తున్నారు. అలా పేర్కొనకపోవటం ఫాసిజపు ఒక లక్షణంగా సూత్రీకరించారు. ముఠా తత్వంతో ఉపాధ్యాయ ఉద్యమంలో చీలికలకు కారణభూతమై, వేర్పాటు వాద శక్తిగా, ఐక్య ఉద్యమాలకు ఆటంకంగా నిలిచిన వారిని కీర్తించాల్సిన అవసరం ఐక్య ఉపాధ్యాయకి లేదు. ఏపిటిఎఫ్‌కి నచ్చిన వారంతా యుటియఫ్‌కి నచ్చాలనుకోవటం వారి అత్యాశ అవుతుంది. అందుకే ఇలాంటి అనవసరపు వాదనలను ఏపిటిఎఫ్ కొనసాగించకుండా వుంటే ఐక్య ఉద్యమానికి మేలు చేసిన వారు అవుతారు.

**(31వ పేజీ తరువాయి... ఉమ్మడి పోరాటేలే.... )**

పరిష్కారానికి ఉద్యమించాలన్న ఆశా భావం వ్యక్తం చేశారు. జాక్టో పక్షాన యుటియఫ్ చేసిన పోరాటాన్ని ప్రస్తావిస్తూ పోరాట పటిమగల సంఘంగా అభివర్ణించారు. సమ్మె అనంతరం కూడా యుటియఫ్ ప్రభుత్వంపై ఒత్తిడి పెంచి సమస్యల్ని పరిష్కరించుకున్నారని, ఉద్యమిస్తున్న ఉపాధ్యాయ, ఉద్యోగ సంఘాల నాయకులకు రాజకీయాలు ఆపాదిస్తున్నారని ఇది ప్రమాదకరమైన ధోరణి అని అన్నారు. ప్రభుత్వ పెన్షన్ రక్షణకు ఖాళీల భర్తీకి ఉద్యమించడంలో జెఏసికి యుటియఫ్ తోడ్పాటు ఉంటుందన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

## రిటైర్మెంట్ వయస్సు 60 ఏళ్ళకు పెంచాలి

హైదరాబాద్ జిల్లా జెఏసి చైర్మన్ సత్యనారాయణ సందేశమిస్తూ ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికులమంతా ఐక్యంగా ఉండడం, ఐక్యంగా ఉద్యమించడం ద్వారానే సమస్యల్ని పరిష్కరించుకోవాలని అన్నారు. పదవీ విరమణ వయస్సును 60 సం॥గా పెంచాలని, ఔట్ సోర్సింగ్ రద్దు చేయాలని డిమాండ్ చేశారు. పెన్షను బిల్లు చట్టమైతే ఒక్కొక్క ఉద్యోగి 8 లక్షల దాకా నష్టపోవలసి వస్తుందని వామపక్షాల వత్తిడి కారణంగానే ఇప్పటివరకూ ఆగిందని, దాన్ని అడ్డుకోవడానికి మనం పోరాట బాట పట్టాలని అన్నారు.

## విభజించి పాలించే ప్రభుత్వ కుట్రని ఎదిరించాలి



**నోముల నర్సింహయ్య:** సిపిఎం శాసన సభాపక్ష నేత నోముల నరసింహయ్య సందేశమిస్తూ ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మిక సమస్యలను అసెంబ్లీలో ప్రస్తావించడం కాని ప్రభుత్వాన్ని నిలదీయడంలో కాని సిపిఎం శాసన సభ్యులే ముందుంటారని అన్నారు. మీరు ఎదుర్కొంటున్న సమస్యలు, డిమాండ్ చేస్తున్న హక్కులన్నీ కూడా రాజ్యాంగానికి లోబడినవే కాని రాజ్యాంగేతరమైనవి కావని, ప్రభుత్వమే నిరంకుశంగా ప్రవర్తిస్తున్నదని ప్రభుత్వం ఉపాధ్యాయ రంగాన్ని విస్మరిస్తే చరిత్ర క్షమించదు అన్నారు. యుటియఫ్ సామాజిక దృష్టితో పని చేస్తుందని విభజించు, పాలించు పద్ధతిని ప్రభుత్వం కుట్రలకు పాల్పడినా యుటియఫ్ బెదరదని యుటియఫ్ చేసే అన్ని పోరాటాలకు తాము అండగా ఉంటామని భరోసా యిచ్చారు.

## ఇంకా రెండు లక్షలమంది ఉపాధ్యాయులు కావాలి

డివైఎఫ్ఐ అధ్యక్షులు ప్రసాద్ సందేశమిస్తూ భవిష్యత్తులో జరిపే పోరాటాలకు ఈ మహాసభలు ఉత్తేజకరంగా, నిర్మాణాత్మకంగా విజయవంతం కావాలని ఆకాంక్షించారు. డిఎస్‌సి పోస్టింగ్స్ విషయంలో యుటియఫ్‌తో కలిసి పోరాడుతున్నామని, కలిసి పనిచేస్తున్నామని పాఠశాలల మూసివేతను వ్యతిరేకిస్తూ హైదరాబాదులో నెల రోజులు పోరాటం చేశామని అన్నారు. ప్రాథమిక విద్యారంగాన్ని పటిష్టపరచకుండా నూరు శాతం అక్షరాస్యత ఎన్ని దశాబ్దాలైనా సాధ్యం కాదని, కనీసం రెండు లక్షల ఉపాధ్యాయులను అపాయింట్ చేస్తే కాని పాఠశాల విద్య పరిపుష్టంకాదని నిరుద్యోగ సమస్యతో యువత ఆందోళన బాట పడుతున్నారని వారందరిని ఐక్యం చేసి ఆత్మస్థైర్యంతో ముందుకు నడిపిస్తున్నది ప్రజాతంత్ర యువజన సంఘం అని అన్నారు.

**ఎస్ఎఫ్ఐ ప్రధానకార్యదర్శి భాస్కర్** మాట్లాడుతూ ప్రభుత్వం ప్రాథమిక విద్యను సర్వనాశనం చేసేందుకు కుట్ర పన్నుతోందని, విద్యార్థులు, ఉపాధ్యాయులు ఐక్యంగా ఉద్యమించి దానిని అడ్డుకోవాలన్నారు. ఉపాధ్యాయులు విద్యారంగ రక్షణతో పాటు సామాజిక బాధ్యతలను కూడా గుర్తించాలని అన్నారు.

నల్లగొండలో జరిగిన యుటియఫ్ 11వ రాష్ట్ర మహాసభల సందర్భంగా రెండు రోజులు జరిగిన ప్రతినిధుల సభకు రాష్ట్ర గౌరవాధ్యక్షులు సిహెచ్. సుభాష్‌చంద్రబోసు, అధ్యక్షులు ఐ. వెంకటేశ్వర రావు, సహాధ్యక్షులు ఎన్. రమణయ్య శాస్త్రి, రాష్ట్ర కార్యదర్శి సి. కమలకుమారి అధ్యక్షవర్గంగా వ్యవహరించారు. ఫిబ్రవరి 20న సిఐటియు రాష్ట్ర అధ్యక్షులు ఎస్. వీరయ్య ప్రతినిధుల సభను ప్రారంభించి ప్రసంగించారు.

# సంఘం కార్యకలాపాల నివేదిక

**(ది. 16.5.2007 నుండి 18.02.2009 వరకు)**

**(గత 2 సంవత్సరాలలో సంఘం నిర్వహించిన ఆందోళన, పోరాటాలు, స్వతంత్ర కార్యాచరణ, ఐక్య ఉద్యమాలలో భాగస్వామ్యం, గత మహాసభ నిర్దేశించిన కర్తవ్యాలు, అమలు జరిగిన తీరును సమీక్షిస్తూ, సంఘ నిర్మాణం, అనుభవాలతో కూడిన సవివరమైన నివేదికను రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ మహాసభలో ప్రవేశ పెట్టారు. దాని నుండి నిర్మాణ నివేదికను మినహాయించి, మిగిలిన వాటిలో ముఖ్యమైన అంశాలను సంక్షిప్తీకరించి ప్రచురిస్తున్నాము.)**

**అధ్యక్షా ! మిత్రులారా!**

యుటియఫ్ 10వ రాష్ట్ర మహాసభ 2007 మే 14, 15 తేదీల్లో విజయవాడలో జరిగింది. మారిన నిబంధనావళి ప్రకారం 11వ రాష్ట్ర మహాసభలు నల్లగొండలో జరుపుకుంటున్నాము. గత 21 నెలల కాలంలో అనేక విస్తృతమైన ఉద్యమాలు, పోరాటాలు చేశాము. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానాల ఫలితంగా సమాజంలో మధ్య తరగతి వర్గంగా వున్న ఉపాధ్యాయ రంగంపైన తీవ్రమైన ప్రభావం చూపిన అనేకాంశాలు వున్నాయి. ప్రజా ఉద్యమాలలో పనిచేసే కార్యకర్తలుగా మనం నిత్యం ఎదుర్కొంటున్న సమస్యల మూలాలు తెలుసుకొని పరిష్కారాలను అన్వేషించడానికి సమకాలీన ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిణామాలను కూడా పరిశీలించడం అవసరం.

**అంతర్జాతీయ పరిస్థితులు సంక్షిప్తంగా**

ప్రపంచంలో అమెరికా పెత్తనానికి, డాలరు గుత్తాధిపత్యానికి గండి పడే రోజులు వచ్చాయి. ఆర్థిక మాంద్యం అమెరికాను కుదిపేస్తున్నది. ఫలితంగా లక్షలాదిమంది ఉద్యోగాలు కోల్పోయారు. ముఖ్యమైన 11 పెద్ద బ్యాంకులతో బాటు ప్రభుత్వ రంగంలో కూడా వందలాదిగా బ్యాంకులు బోర్డులు తిప్పేశాయి. అమెరికా ఆర్థిక సంక్షోభ ప్రభావం ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై పడింది.

అధ్యక్ష ఎన్నికల్లో బుష్ యుద్ధోన్మాద, ఆర్థిక అరాచక విధానాలకు విసిగిన అమెరికా ప్రజలను ఒబామా యిచ్చిన 'మార్పు' నినాదం బాగా ఆకర్షించింది. ఒబామా ప్రకటనలు అధికారంలో మార్పు తప్ప అమెరికా ఆర్థిక, విదేశాంగ విధానాలలో మార్పు కాదనే విషయాన్ని బలపరుస్తున్నాయి.

చైనా ఆర్థిక రంగంతోపాటు అనేక రంగాల్లో శరవేగంగా దూసుకుపోతోంది. లాటిన్ అమెరికా దేశాలతో నూతన సంబంధాలు, పరస్పర సహకారం పెంచుకొంటున్నది. 2008లో జరిగిన బీజింగ్ ఒలంపిక్స్‌ను ఇంతకుముందు ఎన్నడూ కనివిని ఎరుగని విధంగా తనదైన శైలిలో నిర్వహించి శతాధిక పతకాలను సాధించి ప్రపంచాన్ని ఆశ్చర్యపరిచింది.

శతాబ్దాల రాచరిక పాలనకు నేపాల్ ప్రజలు చరమగీతం పాడారు. పదేళ్ళ సాయుధ పోరాటం అనంతరం ఎన్నికలలో పాల్గొని మావోయిస్టు నేత ప్రచండ నాయకత్వంలో గణతంత్ర నేపాల్‌లో నూతన ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. పాకిస్తాన్‌లో మహిళలు ఉద్యోగాలు చేయరాదని ఉన్నత చదువులు చదవరాదని తాలిబన్లు ఆంక్షలు విధిస్తున్నారు.

**జాతీయ పరిస్థితులు**

దేశ ప్రయోజనాలను పణంగా పెట్టి మన్మోహన్ ప్రభుత్వం అమెరికాతో అణు ఒప్పందం కుదుర్చుకొంది. అణు ఒప్పందంలో రహస్యంగా ఉన్న ప్రమాదకర షరతులపై వామపక్షాలు అభ్యంతరాలు తెలియజేసినా, మన్మోహన్ ప్రభుత్వం అమెరికాతో ఒప్పందానికే సిద్ధపడడంతో వామపక్షాలు యుపిఏ ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరించుకున్నాయి. దరిమిలా జరిగిన విశ్వాస పరీక్షలో గెలుపొందేందుకు యుపిఏ ప్రభుత్వం అనైతిక పద్ధతులకు పాల్పడింది.

ప్రపంచ ఆర్థిక మాంద్యం ప్రభావం మన దేశంపై కూడ పడింది. వామపక్ష పార్టీలు పోరాడి సంరక్షించిన ఫైనాన్షియల్ రంగంలో ప్రభుత్వరంగ సంస్థల ఆధిపత్యం, ఇతర నిబంధనల కారణంగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలతో పోల్చుకుంటే భారత్‌పై ప్రపంచ ఆర్థిక సంక్షోభ ప్రభావం కాస్త తక్కువగానే ఉంది. అయినా స్టాక్ మార్కెట్లు భారీ పతనాన్ని చవి చూసాయి. విదేశీ మారక నిల్వలు తరిగిపోయాయి. ఎగుమతుల్లో, పారిశ్రామిక వృద్ధిలో క్షీణత కలిగింది. వాణిజ్య పంటల రేట్లు తగ్గడంతో రైతులు నష్టపోయారు. ఉద్యోగాల కోత పెరుగుతోంది. రానున్న కాలంలో కోటి మంది ఉద్యోగాలు కోల్పోనున్నారని అసోచామ్, ఇతర సంస్థలు చెబుతున్నాయి. ఆహార, నిత్యావసర సరకుల ధరలు ప్రభుత్వం అదుపు చేయలేకపోయింది.

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల 6వ వేతన నివేదిక వెలువడింది. కేంద్ర ప్రభుత్వం, పలు రాష్ట్రాల ప్రభుత్వాలు అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల సంఘాలు సంయుక్తంగా ఇచ్చిన పిలుపు మేరకు 30.10.07 మరియు 20.08.08న ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు దేశ వ్యాపిత సార్వత్రిక సమ్మెలు అత్యంత జయప్రదంగా నిర్వహించారు.

**రాష్ట్ర పరిస్థితులు** ప్రపంచ బ్యాంకు జీతగాడు అంటూ చంద్రబాబును విమర్శించి అధికారంలోకి వచ్చిన వై.ఎస్. నాయకత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం అనతికాలంలోనే ప్రపంచ బ్యాంకు బాట పట్టింది. పేద ప్రజలకు ప్రయోజనం కల్గించే పేరుతో ప్రవేశ పెట్టిన పథకాలు ఆచరణలో అక్రమార్కులకు లబ్ధి చేకూరుస్తున్నాయి. రాజీవ్ ఆరోగ్యశ్రీ పథకంతో కార్పొరేట్ హాస్పిటల్స్‌కు, స్కాలర్ షిప్‌ల పేరుతో కార్పొరేట్ పాఠశాలలకు లబ్ధి చేకూరుస్తున్నారు. జలయజ్ఞం, ఉపాధి హామీ పథకం, ఇందిరమ్మ వంటి పథకాలలో అవతవకలు వెలుగు చూశాయి. సెజ్‌ల పేరుతో రైతుల నుండి వేలాది ఎకరాలను సేకరించి ప్రభుత్వం రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నది. ప్రజాతంత్ర ఉద్యమాలపై ఉక్కుపాదం మోపుతున్నారు. వివిధ సంఘాలలో చీలికలు ప్రోత్సహించి విభజించి పాలించే బ్రిటీషు విధానాలను అవలంభిస్తున్నారు. ప్రభుత్వాధి నేతలలో అహంకార ధోరణి పెరిగింది. రాష్ట్రంలో జెఎసి ఆధ్వర్యంలో ప్రభుత్వ ఉద్యోగులు సమిష్టిగా పోరాడి పిఆర్‌సి నియామకం చేసుకోవడంతోపాటు 22% ఐఆర్ సాధించుకొన్నారు. జాక్టోలోని కొన్ని సంఘాలు, కొందరు ఉపాధ్యాయ ఎమ్మెల్సీలు తమ స్వార్థ ప్రయోజనాల కోసం ఉపాధ్యాయుల ఆకాంక్షలను, ప్రజా ఉద్యమాల భవిష్యత్‌ను బలి చేసి టీచర్ల సమ్మెను నిర్వీర్యం చేశారు. ఆర్‌టిసి ఉద్యోగులు, పంచాయతీరాజ్ ఉద్యోగులు, గ్రామ సేవకులు, అంగన్వాడీ ఉద్యోగులు ఈ కాలంలో పలు ఆందోళన పోరాటాలు నిర్వహించారు.

**విద్యారంగం పరిస్థితి** కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విద్యారంగానికి అత్యధిక ప్రాధాన్యత ఇస్తున్నట్లు ప్రజలలో అభిప్రాయం కలిగిస్తూ విద్యారంగంలో ప్రపంచీకరణ క్రమాన్ని వేగవంతం చేసే దిశగా ప్రయాణం చేస్తున్నాయి. బడా వ్యాపారుల ప్రతినిధులైన బిర్లా, అంబానీలు తయారు చేసిన పత్రమే ఆచరణలో ప్రభుత్వ విధాన పత్రంగా తయారైంది. ప్రాథమిక విద్యను స్వచ్ఛంద సంస్థలకు, స్థానిక సంస్థలకు అప్పజెప్పాలని, హైస్కూల్ విద్యలో పబ్లిక్-ప్రైవేట్ భాగస్వామ్యాన్ని ప్రోత్సహించాలని, ఉన్నత విద్యను కార్పొరేటీకరించాలనేదే బిర్లా-అంబానీ నివేదిక సారాంశం. దేశ వ్యాప్తంగా సక్సెస్ పథకం పేరుతో 6,000 మోడల్ ఉన్నత పాఠశాలలను పబ్లిక్ ప్రైవేట్ భాగస్వామ్యంలో ప్రారంభించారు. అందుకోసం మాధ్యమిక విద్యామిషన్ పెట్టారు. విద్యారంగ నిధుల్లో అధిక భాగం వీటికి కేటాయిస్తూ మిగిలిన లక్షలాది స్కూళ్లను నిర్వీర్యం చేస్తున్నారు. 2008-09 బడ్జెట్‌లో మరియు 2009-10 ఓటాన్ అకౌంట్ బడ్జెట్‌లో విద్యకి పెద్దపీట వేసినట్లు చెప్పారు. ఎస్ఎస్ఏకి రు. 13,100

కోట్లు, మధ్యాహ్న భోజనానికి రు. 8వేల కోట్లు కేటాయించినట్లు చూపించారు. కానీ విద్యని ప్రాథమిక హక్కుగా అమలు చేయటానికి కేటాయింపులు ఏమి చెయ్యాలేదు.

రాష్ట్రంలో పాఠశాల విద్యారంగాన్ని పెద్ద ప్రయోగశాలగా మార్చివేశారు. విద్యావేత్తల సూచనలను గాని, ఉపాధ్యాయ సంఘాల సలహాలనుగాని స్వీకరించకుండా పరిణామాలను పరిశీలించకుండా ముందుకుపోతున్నారు. జి.ఓ.నం. 32ను విడుదల చేసి రాష్ట్రంలో 651 క్రొత్త గురుకుల పాఠశాలలను ప్రారంభిస్తున్నామని చెప్పారు. క్రొత్త ప్రాంతాలలో ఆ పాఠశాలలను ఏర్పాటు చేయకుండా ఇప్పటికే 3 సొసైటీల ఆధ్వర్యంలో నడుస్తున్న 493 పాఠశాలలకు తోడు 158 గిరిజన సంక్షేమ ఆశ్రమ పాఠశాలలను ఈ లెక్కలో చూపి కేంద్రం సొమ్ముతో రాష్ట్ర ప్రభుత్వం సోకులు చేయడానికి పూనుకున్నది. ఈ పాఠశాలలలో 5వ తరగతి నుండి 12వ తరగతి వరకు సిబిఎస్ఇ సిలబస్‌తోపాటు ఇంగ్లీషు మీడియంలో బోధన ఉంటుంది. పాఠశాలలకు అవసరమైన వసతి సౌకర్యాలను కల్పించనేలేదు. 3 సొసైటీలను మెగా సొసైటీగా మార్చి పూర్తిగా ప్రభుత్వ యాజమాన్యంలో ఉన్న గిరిజన సంక్షేమ ఆశ్రమ పాఠశాలలను ఈ సొసైటీలో చేర్చడం ప్రభుత్వం విద్యారంగాన్ని వదలించుకోవాలని చూస్తున్న ప్రయత్నాలలో భాగమే.

జిల్లా పరిషత్, ప్రభుత్వ హైస్కూళ్ళలో నాణ్యమైన విద్యను అందించే పేరుతో రాష్ట్రంలో 6500 హైస్కూల్స్‌ను సక్సెస్ స్కీమ్‌లో గుర్తించి తెలుగు మీడియంకు సమాంతరంగా ఇంగ్లీషు మీడియం, సిబిఎస్ఇ సిలబస్‌తో అమలు చేస్తున్నారు. ఒకే పాఠశాలలో ఒక సెక్షన్‌లో 6 నుండి 10వ తరగతి వరకు తెలుగు మీడియంలో స్టేట్ సిలబస్, 6 నుండి 12వ తరగతి వరకు మరొక సెక్షన్‌లో ఇంగ్లీష్ మీడియంలో సెంట్రల్ సిలబస్ అంటూ విద్యారంగంలో గందరగోళం సృష్టిస్తున్నారు. 2 కి.మీ.లోపు ఉన్న 4 వేలకు పైగా యుపి స్కూల్స్‌లోని 6,7 తరగతులను హైస్కూల్స్‌లో కలిపారు. దీనితోపాటు స్కీములో లేని 3000 హైస్కూల్స్ మూసివేతకు కసరత్తు చేస్తున్నారు. పోస్టుల అప్‌గ్రేడేషన్ పేరుతో ప్రాథమిక పాఠశాలలో ఎస్‌జిటి పోస్టులు రద్దు చేస్తున్నారు. కి.మీ. పరిధిలోని ప్రాథమిక పాఠశాలలన్నింటినీ కలిపి పెద్ద ప్రాథమిక పాఠశాలగా ఏర్పాటు చేసే ఆలోచన చేస్తున్నారు.

డ్రాపౌట్స్‌ని అదుపు చేయడానికి, బాలికా విద్యని మెరుగు పరచడానికి, తద్వారా నాణ్యమైన విద్యను పెంపొందించడానికి పాఠశాల విద్యను రెండు ముక్కలు చేసి ప్రాథమిక, సెకండరీ అనే రెండు భాగాలుగా విభజిస్తున్నట్టు పాఠశాల విద్యాశాఖమంత్రి ప్రకటించారు. తమిళనాడు, కేరళ రాష్ట్రాల మాదిరిగా ప్లస్ టు ను పాఠశాల విద్యలో కలుపుతున్నట్లు చెప్పారు. ఎలాంటి వివరణ లేకుండా రెండు డైరెక్టరేట్‌లు, ఇద్దరు మంత్రులు, ఒకే ప్రిన్సిపల్ సెక్రటరీ అంటూ గందరగోళం సృష్టించారు. క్షేత్ర స్థాయిలో పర్యవేక్షణ, తనిఖీ వ్యవస్థను నిర్వీర్యం చేస్తూ పై స్థాయిలో మంత్రులు, ఉన్నతాధికారుల సంఖ్యను పెంచుతున్నారు. ఈ విధానం వలన పాఠశాల విద్యకి తలభారంగా మారింది.

ఈ కారణంగా గ్రామీణ ప్రాంతాలలోని పేదలు, దళిత, గిరిజన వర్గాల విద్యార్థులు అధికంగా నష్టపోయే ప్రమాదం ఉన్నది. మౌలిక మార్పులు చేసే సందర్భంలో ఎవరితో సంప్రదించకుండా అసెంబ్లీలో చర్చించకుండా ప్రభుత్వం ఏకపక్షంగా వ్యవహరించడం సమర్థనీయం కాదు. కొందరికి నాణ్యమైన విద్యను అందించే పేరుతో మరెందరికో విద్యావకాశాలను దూరం చేసే ప్రభుత్వ చర్యలను తిప్పికొట్టాలి.

## గత మహాసభ యిచ్చిన కర్తవ్యాలు ఈ కాలంలో జరిగిన ఉద్యమాలు

విజయవాడలో జరిగిన 10వ రాష్ట్ర మహాసభ 5 రకాల ప్రధాన కర్తవ్యాలు అమలు చెయ్యాలని పిలుపునిచ్చింది. ఆ కర్తవ్యాలను అమలు చెయ్యటానికి కృషి చేస్తూ ఈ కాలంలో ముందుకొచ్చిన సమస్యలపైన ఉద్యమాలు చేశాము. గత మహాసభ కర్తవ్యాలు పేర్కొంటున్నాము.

**1. ఉపాధ్యాయుల మనుగడకు ఆధారమైన విద్యారంగాన్నే రక్షించుకోవాల్సిన కర్తవ్యం అత్యవసరం అయింది. విద్యారంగాన్ని దెబ్బతీస్తున్న ప్రభుత్వ పథకాలు, చర్యలపైన చెదురుమదురుగా చేస్తున్న ఆందోళనల స్థాయిని అధిగమించి, విద్యారంగరక్షణ కోసం విస్తృతమైన విశాలమైన రాష్ట్ర వ్యాపిత ఐక్య ఉద్యమాన్ని నిర్వహించాలి. ఈ కర్తవ్య దీక్షకై అన్ని స్థాయిల్లో యుటిఎఫ్ శాఖలు కదిలి, అన్ని సంఘాలు, సంస్థలను కలుపుకొని ప్రణాళికబద్ధమైన కార్యక్రమాన్ని అమలు జరపాలి.**

**2. ఉపాధ్యాయుల బదిలీలు, ప్రమోషన్‌లు, రిక్రూట్‌మెంట్ వంటి తక్షణం పరిష్కారం కావాల్సిన సమస్యలపై వెంటనే పోరాట కార్యక్రమాలు చేపట్టాలి. మున్సిపల్ టీచర్లకూ బదిలీలు, ప్రమోషన్‌లకు స్పష్టమైన రూల్స్‌ని సాధించాలి. గిరిజన, ఎయిడెడ్, మున్సిపల్ పాఠశాలల టీచర్ల సమస్యలు, ఎస్‌సి, ఎస్‌టి టీచర్ల ప్రత్యేక సమస్యల పరిష్కారానికి ప్రత్యేక కార్యక్రమాలతోపాటు ఉపాధ్యాయులు అందరి సాధారణ సమస్యలపైన స్వతంత్ర కార్యాచరణ నిర్వహిస్తూ ఐక్య పోరాటాలకు పూనుకోవాలి.**

**3. తదుపరి పిఆర్‌సి కోసం రానున్న రెండు సంవత్సరాల కాలంలో మొత్తం ఉద్యోగులు, ఉపాధ్యాయుల్ని చైతన్యపర్చి, ఉద్యమాలకు సిద్ధం చేసే ప్రచారం, ఆందోళన కార్యక్రమాలు చేపట్టాలి.(4,5 నిర్మాణ కర్తవ్యాలు ఎడిట్ చేయబడినవి)**

వీటిలో మొదటి కర్తవ్యాన్ని అమలు చేశాము. రెండో కర్తవ్యం సగ భాగం పూర్తయింది. మూడవ కర్తవ్యంలో ఒకడుగు ముందుకు వేశాము. రెండో అంకానికి అనలు వేశాము. ఈ కాలంలో ముందుకొచ్చిన అన్ని సమస్యలపై నా ఆందోళనలు, పోరాటాలు చేశాము. వాటి వివరాలు పేర్కొంటున్నాము.

**విద్యా రక్షణ ఉద్యమము** రాష్ట్ర విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యలపైన ప్రత్యేకంగా రాష్ట్ర వ్యాప్త ఆందోళన, పోరాటాలు చెయ్యాలనే సంకల్పంతో విద్యారక్షణ ఉద్యమం పెద్ద ఎత్తున నిర్వహించాము. ఈ ఉద్యమం ఐక్య కార్యాచరణగా చెయ్యాలని ప్రయత్నించాము. 2007 ఆగస్ట్ 27న హైదరాబాద్‌లో రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించాం. 16 సంఘాల బాధ్యులు పాల్గొన్నారు. దాని కొనసాగింపుగా జిల్లాల్లో రౌండ్ టేబుల్ సమావేశాల కోసం కృషి చేశాం. ఉపాధ్యాయ సంఘాలు కలసి వచ్చే పరిస్థితి లేకపోయింది. విద్యార్థి, అధ్యాపక సంఘాలు కలసి వచ్చినా అది విస్తృతమైన ఐక్య కార్యాచరణగా జరిగే అవకాశం లేనందున స్వతంత్ర కార్యాచరణగానే కొనసాగించాము. 2008 జనవరి నుండి మార్చి 3 వరకు రాష్ట్ర వ్యాప్త కార్యక్రమంగా నిర్వహించాము.

జనవరి చివరి 10 రోజుల్లో 83 మండలాల్లో సర్వే జరిగింది. సర్వే ఆధారంగా ముఖ్యమైన 12 సమస్యలతో డిమాండ్ల పత్రాన్ని రూపొందించాం. దానిని ముఖ్యమంత్రికి మెమోరాండంలు చేసి రాష్ట్ర వ్యాప్తంగా 8 లక్షల మందితో సంతకాలు సేకరించాము. సదరు మెమోరాండం బండిల్స్‌ని మార్చి 6వ తేదీన ముఖ్యమంత్రికి సమర్పించాము. ఫిబ్రవరి 16 నుండి 24 వరకు జిల్లాల్లో సదస్సులు జరిపాము. ఫిబ్రవరి చివరి వారం నుండి మార్చి 3 దాకా రాష్ట్రంలోని 6 కేంద్రాల నుండి విద్యా రక్షణ జాతాలు నిర్వహించాము. ఈ జాతాలు మార్గమధ్యంలో ప్రచారం చేసుకొంటూ 10వేల కిలోమీటర్లు పర్యటించాయి. మార్చి 3న హైదరాబాద్‌లో 8 వేలమంది ఉపాధ్యాయులతో విద్యారక్షణ మహాప్రదర్శన చేశాం. ఆ సందర్భంగా ఇందిరాపార్క్‌వద్ద పెద్ద బహిరంగ సభ జరిగింది. ఆ సభలో ప్రతిపక్ష నాయకుడితో సహా వివిధ పక్షాల నాయకులు, పలువురు విద్యార్థి, అధ్యాపక సంఘాల నాయకులు, మన ఎమ్మెల్సీలు సందేశాలు యిచ్చారు. రాష్ట్రంలోని విద్యారంగ సమస్యలను పరిశీలించి తగిన సిఫారసులు చెయ్యటానికి విద్యా కమీషన్ వెయ్యాలనే తీర్మానం ఆమోదించి దానిని రాష్ట్ర ముఖ్యమంత్రికి పంపించటం జరిగింది. ఫలితాలు సాధించేదాకా ఆ ఉద్యమాన్ని కొనసాగించాల్సిన అవసరం ఉన్నది.

**సర్వీస్ రూల్స్ - ప్రమోషన్‌లు** ఏకీకృత సర్వీస్ రూల్స్ సాధన కోసం మన సంఘం స్వతంత్రంగా, యితర సంఘాలతో కలిసి అనేక ప్రాతినిధ్యాలు చేశాం. 2007 జులై 11,12 తేదీల్లో మన సంఘం తరపున ఎమ్మెల్సీ రామిరెడ్డి, రాష్ట్ర

అధ్యక్షులు ఐ. వెంకటేశ్వర రావు అన్ని సంఘాలతో కలిసి ఢిల్లీ వెళ్లారు. అక్టోబర్ 7న ఎస్‌టిఎఫ్ఐ తరపున రాష్ట్రపతిని కలిసిన సందర్భంలో ఏకీకృత సర్వీస్ రూల్స్‌కి అనుమతించాలని మన సంఘం ప్రాతినిధ్యం చేసింది. డిసెంబర్ 4,5 తేదీల్లో ఎమ్మెల్సీలు రామయ్య, రామిరెడ్డి, లక్ష్మణరావు గార్లతో కలిసి ఢిల్లీలో కేంద్ర హోంమంత్రి శివరాజ్ పాటిల్‌ని, అధికారులను కలిసి మాట్లాడటం జరిగింది. కేంద్ర ప్రభుత్వం వేసిన కొర్రీలకు రాష్ట్ర ప్రభుత్వం నుండి క్లారిఫికేషన్‌లు యిప్పించే దానికి చాలా కాలం కృషి చేశాం. రాష్ట్రం నుండి పంపిన వివరణల మేరకు ఏకీకృతానికి అనుమతించాలని 2008 మే 13న మన సంఘం నుండి 4గురు ఎమ్మెల్సీలు, 3గ్గురు రాష్ట్ర నాయకుల బృందం ఢిల్లీ వెళ్లి రాష్ట్రపతిని కలిసి మాట్లాడటం జరిగింది. ప్రభుత్వం సీరియస్‌గా తీసుకోకపోవటం వలన కాలహరణం జరిగింది. అందువలన ఉపాధ్యాయులకు, విద్యార్థులకు అపారమైన నష్టం జరిగింది. ఈ నష్టాన్ని నివారించాలనే లక్ష్యంతో మన సంఘం చొరవ తీసుకొని అడ్‌హాక్ రూల్స్ రూపొందించాలని, బదిలీలు, ప్రమోషన్‌లు జరిపించాలనే డిమాండ్‌ని 2008 ఆగస్ట్ నుండి ముందుకు తీసుకొచ్చింది. ఏకీకృత సర్వీస్ రూల్స్ కోసం కృషి చేస్తూనే, ఈలోగా జరుగుతున్న నష్టాన్ని నివారించటం కోసం అడ్‌హాక్ రూల్స్‌తో మేనేజిమెంట్ వారీగా బదిలీలు, ప్రమోషన్‌లు వెంటనే జరిపించాలనే మన సంఘం చేసిన ప్రతిపాదనను ఇతర సంఘాలు అంగీకరించటానికి కొంతకాలం పట్టింది. ఆ తర్వాత ప్రభుత్వం తెములుచ్చుకొని జి.ఓలు యివ్వటానికి మరికొంతకాలం పట్టింది. ఎట్టకేలకు అడ్‌హాక్ రూల్స్ జి.ఓలు యిప్పించుకొని బదిలీలు సాధ్యంకాకపోయినా ప్రమోషన్‌లు సాధించుకొన్నాము. ఒకేసారి 33 వేలమందికిపైగా ఎస్ఏ ప్రమోషన్‌లు వచ్చాయి. దాదాపు 6 వేలమంది హైస్కూల్ హెడ్మాష్టర్‌లుగా ప్రమోషన్‌లు పొందారు. ఇదే వరవడితో వచ్చే వేసవి సెలవుల్లో బదిలీలు జరిపించాలి.

**భాషా పండితులు, పిఇటిల పోస్టుల అప్‌గ్రేడేషన్** కొరకు హైదరాబాదులోని ఇందిరా పార్కు వద్ద 2009 జనవరి 11న ధర్నా నిర్వహించడమైనది. పిడిఎఫ్ ఎమ్మెల్సీలు మరియు సంఘంగా అనేక పర్యాయములు ప్రభుత్వానికి ప్రాతినిధ్యం చేయడమైనది. సక్సెస్ పాఠశాలల్లో ఎస్‌జిటిలను జి.ఓ 363 తేది 10.11.2008 ద్వారా 15,584 పోస్టులు స్కూలు అసిస్టెంట్‌లుగా అప్‌గ్రేడ్ చేశారు. మరో 12,210 పోస్టులు క్రొత్తగా మంజూరు చేశారు. ఈ మొత్తం 27,794 స్కూల్ అసిస్టెంట్ పోస్టులలో భాషా పండితులు, ఫిజికల్ ఎడ్యుకేషన్‌లకు కేటాయింపు లేకుండా అన్యాయం చేశారు. ఈ అన్యాయాన్ని అరికట్టాలని అన్ని హైస్కూల్స్‌లోకి భాషా పండితుల పోస్టులు, పిఇటి పోస్టులను స్కూలు అసిస్టెంట్ పోస్టులుగా అప్‌గ్రేడ్ చేయాలని డిమాండ్ చేస్తూ వీటి సాధన కొరకు తక్షణ కర్తవ్యంగా ప్రమోషన్ కౌన్సిలింగ్ కేంద్రాల వద్ద నల్ల బ్యాడ్జీలు ధరించి నిరసన ప్రదర్శనలు చేయడమైనది. 2009 జనవరి 11న రాష్ట్ర ధర్నా జరపడమైనది. పిడిఎఫ్ ఎమ్మెల్సీల ద్వారా శాసన మండలిలో విద్యామంత్రిని ప్రశ్నించి హామీని పొందడమైనది. తక్షణమే ఈ సమస్య పరిష్కారము కొరకు పెద్ద ఎత్తున ఉద్యమము నిర్మించవలసియున్నది.

**ఉద్యోగులు, ఉపాధ్యాయులకు ఇళ్ల స్థలాలు** యివ్వాలనే డిమాండుతో జులై 2007 చివరి వారంలో లక్ష కరపత్రాలు వేసి పంచాము. మన కరపత్రం చూసిన ఉద్యోగులు స్పందించారు. జులై 26న ప్రభుత్వ కార్యదర్శికి మెమోరాండం యిచ్చి ఉద్యోగుల ఇళ్ళ స్థలాల సమస్య ప్రాధాన్యతను వివరించాము. ఈ సమస్యను జాయింట్ స్టాఫ్ కౌన్సిల్ సమావేశాల్లో చర్చించాలని కోరాము. జులై 31న మన సంఘం రాష్ట్ర కార్యాలయంలో రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించాము 12 సంఘాల నాయకులు పాల్గొన్నారు. ఈ సమస్యపైన ఉద్యమం నిర్మించాల్సిన అవసరం వుందని అందరూ అంగీకరించారు.

**పిఆర్‌సి అనామలీస్ కమిటీకి** 11 అంశాలతో కూడిన మెమోరాండం జూన్ 2007లోనే సమర్పించాము. దానిపైన రెండు దఫాలు చర్చలు జరిపాము ఓఎంసీ ద్వారా నష్టపోయినవారికి తదుపరి స్టేజిలో ఫిక్సేషన్ చెయ్యాలని, సబ్సీక్వెంట్ ఇంక్రిమెంటు తేదీకి ఆప్షన్ అవకాశం యివ్వాలని, కేటగిరీ 3 టీచర్స్‌కి మూల వేతనంలో జరిగిన నష్టాన్ని పూడ్చాలని, స్టెపప్ సదుపాయం కల్పించాలని, మరణించిన ఉద్యోగుల అంత్యక్రియల ఖర్చుకు రు. 5 వేలు చెల్లించాలని, ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ స్కూల్స్ హెడ్మాష్టర్‌లకు డ్యూటీ అలవెన్సు పెంచాలని, అదనపు అర్హతలకు అదనపు ఇంక్రిమెంట్లు పునరుద్దరించాలని తదితర విషయాలపైన మన సంఘం వాదనలు వినిపించాము. ఏజెన్సీ అలవెన్సుల విషయంలో జరిగిన లోపాలను ఎత్తి చూపుతూ ప్రత్యేక మెమోరాండం యిచ్చాము.

**ఎలక్టోరల్ రోల్స్ విధులు, ఎస్ఎస్ఏ** వారి విజ్ఞాన వేళాలు బహిష్కరించాలని మన సంఘం తీసుకొన్న చొరవకి ఉపాధ్యాయులు స్పందించారు. సోదర ఉపాధ్యాయ సంఘాలు కూడ సానుకూలంగానే స్పందించాయి. అయితే బహిష్కరణ సంపూర్ణంగా జరిగిందని చెప్పలేము. అందుకవసరమైన ఏర్పాట్లు కూడ సకాలంలో జరగలేదు. మన అలజడితో వెనక్కి తగ్గిన ఎస్ఎస్ఏ వారు విజ్ఞాన మేళా కార్యక్రమాలను వాయిదా వేశారు.

**అఖిలభారత ఉద్యమంలో** భాగంగా విద్యారంగ సమస్యలపైన 2 లక్షల సంతకాలు సేకరించాము. దేశం మొత్తం మీద సేకరించిన సంతకాలతో కూడిన మెమోరాండంని అక్టోబర్ 7న ఢిల్లీలో రాష్ట్రపతి గౌ॥ శ్రీమతి ప్రతిభా పాటిల్ గారికి సమర్పించటం జరిగింది. ఆ కార్యక్రమంలో మన సంఘం ప్రతినిధులు ముగ్గురు పాల్గొన్నారు.

**మధ్యాహ్న భోజన పథకముపై ఢిల్లీలో ప్రాతినిధ్యం** మధ్యాహ్న భోజన పథకాన్ని 10వ తరగతి వరకు విస్తరించాలని, ఎస్ఎస్ఏ నిదులు దుర్వినియోగాన్ని అరికట్టడానికి తగు చర్యలు తీసుకోవాలని కోరుతూ యుటియఫ్ రాష్ట్ర నాయకత్వం మరియు ఎమ్మెల్సీలు కెవిస్. లక్ష్మణరావు, చుక్కారామయ్య, డి. రామిరెడ్డి, కె. జార్జివిక్టరు 2007 డిసెంబరు 5న ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి అరుణ్‌కుమార్ రథ్‌ను కలసి చర్చించి మెమోరాండం ఇచ్చినారు.

**చారిత్రాత్మక ధర్నా** బదిలీలు, ప్రమోషన్లు, రిక్రూట్ మెంట్‌తో పాటు అప్రెంటీస్ సర్వీస్, ఎయిడెడ్ సమస్యలు తదితర ముఖ్య సమస్యల పరిష్కారం కోసం 2007 ఆగష్టు 8న జిల్లా కేంద్రాలలో ధర్నాలు చేశాము. మొత్తం 7786 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ఆ పోరాట కొనసాగింపుగా సెప్టెంబరు 19న హైదరాబాదులోని ఇందిరా పార్కు వద్ద సామూహిక ధర్నా చేశాము. జోరుగ వర్షం కురుస్తూ, క్రింద నీళ్ళు పారుతున్నా ఎంతో పట్టుదలతో క్రమశిక్షణగా కదలకుండా ధర్నా చేశాము. మన ఎమ్మెల్సీలతో పాటు సిపియం శాసన సభ పక్షనాయకులు శ్రీ నోముల నర్సింహయ్య, జెఎసి చైర్మన్ శ్రీ.వి.గోపాల రెడ్డి ధర్నాలలో సందేశాలు యిచ్చారు. విద్యామంత్రి స్వయంగా వచ్చి వర్షంలో తడుస్తూనే సమస్యలు పరిష్కరిస్తామని హామీ యిచ్చారు.

**పంచాయతీలకు అధికారాలు ఉత్తర్వుల్లో వైరుధ్యాలు తొలగించాలి** స్థానిక సంస్థలకి అధికారాల పేరుతో ఉపాధ్యాయులపై పెత్తనం చేసే చర్యలను యుటియఫ్ తీవ్రంగా వ్యతిరేకించింది. పాఠశాల విద్యాశాఖ ముఖ్యకార్యదర్శి యిచ్చిన జి.ఓ.2లో పాఠశాల పర్యవేక్షణ కోసం ఏర్పడే సర్పంచ్‌తో కూడిన కమిటీ ఉపాధ్యాయుల హాజరు, బోధనలో నాణ్యత, పాఠశాలలకు వసతుల కల్పన, మధ్యాహ్న భోజనం వంటి విషయాలను పర్యవేక్షించాలని పేర్కొన్నారు. ఒక గ్రామ పంచాయితీ పరిధిలో ఉండే పాఠశాలలన్నింటిపైనా ఈ కమిటీకి అధికారాలు యిచ్చారు. కమిటీ సమావేశాలకు ఉపాధ్యాయులు హాజరు కావాలనే తదితర అంశాలు పాఠశాల విద్యాశాఖ నిబంధనలకు విరుద్ధంగా వున్నాయని యుటియఫ్ ఆందోళన వ్యక్తం చేస్తూ రాష్ట్రంలోని అన్ని జిల్లా కేంద్రాలలో నిరసనలు, అవగాహన సదస్సులు నిర్వహించింది.

**గిరిజన పాఠశాలల ఉపాధ్యాయుల సమస్యల** పరిష్కారం కోసం పలు ప్రాతినిధ్యాలు, పోరాటాలు చేశాము. 2008 జనవరి 2న అన్ని ఐటిడిఏ కార్యాలయాల ఎదుట ధర్నాలు జరిగాయి. గిరిజన పాఠశాలల ఉపాధ్యాయుల వివిధ సమస్యల గురించి చర్చించమని గిరిజన సంక్షేమ శాఖమంత్రికి, అధికారులకు మెమోరాండం యిచ్చినప్పటికి ఫలితం లేకపోవడంతో పోరాటానికి పిలుపు ఇవ్వడమైనది. జనవరి 7న హైదరాబాద్‌లోని గిరిజన సంక్షేమ సంచాలకుల కార్యాలయం ఎదుట రాష్ట్ర ధర్నా జరిగింది. మొత్తం 450 మంది పాల్గొన్నారు. ధర్నా అనంతరము జరిగిన చర్చలలో గిరిజన పాఠశాలల ఉపాధ్యాయులకు ఏకీకృత సర్వీసు రూల్స్‌లో చేర్చడానికి తగిన ప్రతిపాదనలు పంపుతామని, అదనపు పోస్టుల కోసం ప్రతిపాదనలు పంపుతామని, స్పెషల్ డిఎస్‌సి పరిశీలిస్తామని తదితర ముఖ్య సమస్యల పరిష్కారానికి అధికారులు అంగీకరించారు.

**ఎయిడెడ్ పాఠశాలలు, ఉపాధ్యాయుల సమస్యలు** పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ పలు ఉద్యమాలు చేసినా ప్రభుత్వం మొండివైఖరితో ఎయిడెడ్ విద్యా సంస్థలను నిర్వీర్యం చేయడానికి కుట్రపన్నుతున్నది. 2007 నవంబరు 16న ఎయిడెడ్ టీచర్ల చలో అసెంబ్లీ కార్యక్రమం జరిగింది. సుందరయ్య పార్క్ నుండి బయలుదేరిన ర్యాలీని పోలీసులు నిరాకరించినా ఎదురొడ్డి ర్యాలీ చేయడానికి ఉపాధ్యాయులు సిద్దపడినారు. ర్యాలీ, సభ విజయవంతమైనాయి. మన ఎమ్మెల్సీలు, జె.ఎ.సి. నాయకులు పాల్గొని సందేశాలిచ్చారు.

ఎయిడెడ్ టీచర్ల సమస్యలపైన జనవరి 24న జిల్లాల్లో ధర్నాలు నిర్వహించాము. మొత్తం 3 వేల మంది ఉపాధ్యాయుల పాల్గొన్నారు. ఐక్య కార్యాచరణలో ఎసిఎఐఈ ఆధ్వర్యంలో రాష్ట్ర కేంద్రములో సామూహిక నిరీహారదీక్ష 2008 మార్చి 26న జరిగినది. దీక్షలో 32 మంది పాల్గొన్నారు. జాక్టో సమ్మె సందర్భంగా యిచ్చిన హామీలు నేటికి అమలుకు నోచుకోలేదు. అన్‌ఎయిడెడ్ సర్వీస్‌కు చెందిన చట్టము 37/2005ను ప్రాస్పెక్టివ్‌గా అమలు చేయడానికి మరియు మెడికల్ రీయింబర్స్‌మెంట్ సౌకర్యంకు సంబంధించిన ఫైల్ ముఖ్యమంత్రి వద్ద క్లియరెన్స్‌కు సిద్ధంగా వున్నది.

**మున్సిపల్ ఉపాధ్యాయులు** సర్వీసు ప్రొవిన్షలైజేషన్ మరియు సర్వీసు రూల్స్ కోసం అనేక ప్రాతినిధ్యాలు చేశాము. మున్సిపల్ పరిపాలన సంచాలకుల వారు రూపొందించిన మున్సిపల్ ఉపాధ్యాయుల సర్వీస్ రూల్స్ ముసాయిదా కాపీని పరిశీలించి చర్చించినాము.

మున్సిపల్ పాఠశాలలు, ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కారానికి ప్రత్యేకంగా ఉద్యమాన్ని నిర్మించడానికి 2008 జనవరి 19న విజయవాడలో రాష్ట్ర సదస్సు నిర్వహించడమైనది. 13 జిల్లాల నుండి వచ్చిన ప్రతినిధులు చర్చించి సమస్యల సాధనకు మూడు దశల పోరాట కార్యక్రమాన్ని సదస్సు ఆమోదించింది. సమస్యల మెమోరాండంపై ఫిబ్రవరి 4 నుండి 8 వరకు ఉపాధ్యాయులతో సంతకాలు చేయించిరి. చాలా కాలం తర్వాత మున్సిపల్ ఉపాధ్యాయుల కోసం ప్రత్యేకంగా చేపట్టిన కార్యక్రమాలు విజయవంతమైనవి. ఫిబ్రవరి 18,19,20 తేదీలలో అన్ని మున్సిపల్ కేంద్రాలలో ధర్నాలు జరిగినాయి. మొత్తం మున్సిపల్ టీచర్లలో 30% మంది పాల్గొన్నారు. సంతకాలు 62% మంది చేశారు. అత్యధిక సంఖ్యలో మహిళలు పాల్గొన్నారు. సంతకాలతో కూడిన మెమోరాండంను ఫిబ్రవరి 21న శాసన మండలిలో రాష్ట్ర ముఖ్యమంత్రికి సమర్పించడం జరిగింది. రాష్ట్ర కమిటీతో మున్సిపల్ అధికారులు చర్చలు జరిపినారు. ఫలితంగా జీతాలు చెల్లింపు, ప్రమోషన్ల విషయాలలో నిబంధనలు రావడం జరిగింది. సర్వీసు రూల్స్, ప్రొవిన్షనైజేషన్‌కు సంబంధించి ప్రాసెస్ జరుగుచున్నది. సర్వీసు రూల్సు తయారు చేయడానికి రిటైర్డ్ విద్యాశాఖ ఉన్నతాధికారి జి.వి. సుబ్బారావును ప్రభుత్వము నియమించింది. వీటి సాధనకు రాష్ట్ర స్థాయిలో ఒక కార్యక్రమాన్ని రూపొందించవలసి యున్నది.

**విజయవంతమైన సామూహిక నిరాహార దీక్షలు** ఎయిడెడ్ టీచర్ల అన్‌ఎయిడెడ్ సర్వీస్‌ని మరియు పండితుల అప్‌గ్రేడ్ సర్వీస్‌ని హరించిన ప్రభుత్వ చట్టాలను రద్దు చేయాలని, అప్రెంటిస్ సర్వీస్‌కు నోషనల్ ఇంక్రిమెంట్లు యివ్వాలని తదితర ముఖ్య సమస్యలను పరిష్కరించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ దశలవారీ పోరాట కార్యక్రమం నోటీస్‌ని 2008 మార్చి 14న రాష్ట్ర ప్రభుత్వానికి యివ్వడమైనది. ఆ మేరకు మార్చి 27 నాడు రాష్ట్రంలోని అన్ని జిల్లా కేంద్రాల్లో సామూహిక నిరాహారదీక్షలు విజయవంతంగా జరిగాయి.

**యస్‌సి, యస్‌టి టీచర్ల సమస్యలు** పరిష్కారములో విద్యాశాఖాధికారులు, విద్యామంత్రికి అనేక సందర్భాలలో ప్రాతినిధ్యం చేసి పట్టు బట్టినా ఫలితం లేదు. గిరిజన సంక్షేమ అధికారులకూ గిరిజన టీచర్ల ప్రత్యేక సమస్యలు అర్ధంకావడంలేదు. రాష్ట్ర ఎస్‌సి, ఎస్‌టి కమీషన్ ఛైర్మన్‌కి నవంబరు 19న మెమోరాండం యిచ్చి సదరు టీచర్లకు జరుగుతున్న అన్యాయాన్ని వివరించాము. సానుకూలంగా స్పందించి ముఖ్యమంత్రి, విద్యామంత్రితో మాట్లాడి పరిష్కరిస్తానని హామీ యిచ్చారు. కానీ ఒక్కటీ పరిష్కారం కాలేదు. స్పెషల్ విద్యావాలంటీర్‌లుగా పనిచేసిన యస్‌సి, యస్‌టి. బిసి తదితర ఉపాధ్యాయులకు 2003 మార్చి నుండి 2005 అక్టోబరు వరకు చేసిన సర్వీసుకు రక్షణ కల్పించాలని పదే పదే ప్రభుత్వాన్ని డిమాండ్ చేశాము. 2008 ఏప్రిల్ 13న అన్ని జిల్లా కేంద్రాలలో సమస్యలతో కూడిన మెమోరాండం కాపీని డా॥ బి.ఆర్. అంబేద్కర్ విగ్రహాలకు యిచ్చి నిరసన తెలిపినాము. ఈ సమస్యలపై 2008 ఫిబ్రవరి 11న ధర్నా నిర్వహించాము. శాసన మండలిలో పిడిఎఫ్ ఎమ్మెల్సీలు స్పెషల్ విద్యావాలంటీర్ల సమస్యలపై వేసిన ప్రశ్నకు విద్యామంత్రి జి.ఓ. నెం. 748 అమలు చేస్తామని, నోషనల్ ఇంక్రిమెంట్లు యిస్తామని హామీ యిచ్చినారు. యస్‌సి, యస్‌టి ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కారము కొరకు నిరంతరము పోరాటము కొనసాగిస్తూనే ఉన్నాము.

**సింగరేణి టీచర్ల సమస్యల కొరకు** సింగరేణి కాలరీస్ యాజమాన్యంలోని పాఠశాలల్లో పని చేస్తున్న బోధన, బోధనేతర ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించాలని కోరుతూ పిడిఎఫ్ ఛైర్మన్, ఎమ్మెల్సీ చుక్కా రామయ్య నేతృత్వంలో యుటియఫ్ ప్రతినిధి బృందం 2008 మే 16న సింగరేణి కాలరీస్ ఛైర్మన్ మరియు మేనేజింగ్ డైరెక్టరు ఎస్. నరసింహారావుతో చర్చించారు. 2002 ఫిబ్రవరిలో సిబ్బంది నిర్వహించిన 21 రోజుల సమ్మె కాలాన్ని అర్హత గల సెలవుగా ప్రకటించాలని, సర్వీసుకు, ఇంక్రిమెంటుకు నష్టం జరగకుండా నివారించాలని కోరుతూ మెమోరాండం యిచ్చారు. పాఠశాల విద్యాశాఖ ఉపాధ్యాయులకు వర్తింపజేసే సౌకర్యాలను సింగరేణి ఉపాధ్యాయులకు కూడా యివ్వాలని కోరారు. పరిష్కారానికి చర్యలు తీసుకుంటామని డైరెక్టరు హామీ యిచ్చారు.

**మహిళా టీచర్ల కార్డు క్యాంపెయిన్స్** ఉపాధ్యాయరంగంలో దాదాపు నలభై శాతము మహిళా టీచర్లు ఉన్నారు. ప్రభుత్వ, ప్రైవేటు రంగాలలో వీరి సంఖ్య నానాటికి పెరుగుతున్నది. కాని అందుకనుగుణంగా సౌకర్యాలు పెరగకపోగా వేధింపులు, దాడులు, అత్యాచారాలు నానాటికి పెరిగిపోతున్నాయి. మహిళా టీచర్లు భయాందోళనకు గురి అగుచున్నారు. వారిని చైతన్య పరచడానికి రాష్ట్ర స్థాయిలోను, జిల్లాలలోను మహిళా విభాగాలను ఏర్పాటు చేయడమైనది. గత ఆగస్టులో విజయవాడలో జరిగిన రెండు రోజుల మహిళా టీచర్ల సమ్మేళనం చర్చించి తీర్మానించిన అంశాలను ప్రభుత్వము దృష్టికి తీసుకెళ్ళడానికి రాష్ట్రములోని మహిళా ఉపాధ్యాయులచే ముఖ్యమంత్రికి ఉత్తరాలు వ్రాయించడమైనది. అక్టోబరు 15 నుండి 31 వరకు మహిళా ఉపాధ్యాయులు సంఘాలతో నిమిత్తము లేకుండా అందరూ పోస్టు కార్డు ఉద్యమంలో పాల్గొనిరి.

**3వ కేటగిరి టీచర్లకు అనామలీస్‌లోనూ అన్యాయమే** పిఆర్‌సి 2005 వేతనాల్లోని అసంబద్ధతలను సవరించుతూ రాష్ట్ర ప్రభుత్వం ఆగస్టు 2నాడు యిచ్చిన ఉత్తర్వుల్లో 3వ క్యాటగిరి ఉపాధ్యాయుల వేతన స్కేల్‌ని సవరించకపోవడం పట్ల యుటియఫ్ తీవ్రమైన నిరసన తెలియజేస్తున్నది. సెకండరీగ్రేడ్, పండిట్స్, పిఇటీ తదితర కేటగిరి 3 టీచర్ల వేతన స్కేలు రు. 5470-1238 నుండి 5750-13030కి పెంచాలని యుటియఫ్ అనామలీస్ కమిటీకి పదే పదే విజ్ఞప్తి చేయడం జరిగింది. 2005,1999 వేతన స్కేళ్ళలో ఈ ఉపాధ్యాయులకు జరిగిన అన్యాయాన్ని కమిటీ ఛైర్మన్ ఎన్. రంగాచారి కూడా అంగీకరించారు. కానీ అనామలీస్ కమిటీ సిఫారసులను అంగీకరిస్తూ ప్రభుత్వం యిచ్చిన జి.ఓ. 217లో కేటగిరీ 3 టీచర్ల వేతనాన్ని పెంచకపోవడం చాలా అన్యాయం. కమిటీ, ప్రభుత్వం ఇప్పటికైనా ఈ విషయాన్ని పునఃపరిశీలన జరిపి తగు న్యాయం చేయాలని యుటియఫ్ డిమాండ్ చేస్తున్నది.

**చలో అసెంబ్లీ ఉద్రిక్తం** ఉపాధ్యాయుల ఏకీకృత సర్వీసు రూల్సు కొరకు చిత్తశుద్ధితో ప్రయత్నించాలని, బదిలీలు, పదోన్నతులు తక్షణమే నిర్వహించాలని, అప్రెంటిస్ టీచర్ల సమస్యలు తదితరమైనవి పరిష్కరించాలని కోరుతూ సెప్టెంబరు 4న యుటియఫ్ నాయకత్వంలో ఉపాధ్యాయులు కదం తొక్కారు. ఉపాధ్యాయులు ఇందిరాపార్కునుండి అసెంబ్లీ వైపు దూసుకుపోవడానికి ఉరకలు వేయగా పోలీసులు తాళ్ళు, ముళ్ళ కంచెలతో అడ్డుకున్నారు. వాటిని నెట్టుకొని వెళ్ళడానికి పిడిఎఫ్ ఎమ్మెల్సీలు, ఉపాధ్యాయులు ప్రయత్నించగా ఉద్రిక్తత నెలకొంది.

**జి.ఓ. 223 రద్దు చేయాలి** పాఠశాల ఉపాధ్యాయులు జూనియర్ లెక్చరర్లుగా ప్రమోషను పొందే సదుపాయాన్ని రద్దు చేస్తూ ఉన్నత విద్యాశాఖ యిచ్చిన జి.ఓ. 223ని వెంటనే రద్దు చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశాము. మన ఎమ్మెల్సీలు ప్రాతినిధ్యం చేశారు. యుటియఫ్ ఆధ్వర్యంలో సెప్టెంబరు 19,20 తేదీలలో ఉపాధ్యాయుల అన్ని కేంద్రాలలో ఈ జి.ఓ. కాపీలను దగ్ధం చేసి తీవ్ర నిరసన తెలిపారు. దీనితో ప్రభుత్వం జి.ఓ. 223ను అబెయన్సులో పెడుతున్నట్లు ప్రకటించింది.

**విద్యాహక్కు బిల్లులో సవరణ** విద్యా హక్కు బిల్లు-2005లో ఉపాధ్యాయుల సర్వీస్‌ని స్కూల్ బేస్డ్ కేడర్‌గా నియంత్రించాలనే విషయంలో కేంద్ర ప్రభుత్వం దేశ వ్యాప్తంగా జరిగిన ఉపాధ్యాయుల ఉద్యమ ఫలితంగా వెనక్కి తగ్గింది.

ఈ బిల్లుపై రాష్ట్రంలో యుటియఫ్, దేశ వ్యాప్తంగా ఎస్‌టిఎఫ్‌ఐ చేసిన ఆందోళన, పోరాటాల్లో స్కూల్ బేస్డ్ కేడర్ అంశాన్ని తొలగించాలని డిమాండ్ చేయడమైనది. ఈ సమస్యపై గత మూడు సంవత్సరాలుగా రాష్ట్ర వ్యాప్తంగా జరిగిన సభలు, సమావేశాలలో యుటియఫ్ పెద్ద ఎత్తున ప్రచారం చేసిన ఫలితంగా విద్యాహక్కు బిల్లు-2008గా పునర్ రచన చేసిన ముసాయిదా పత్రంలో స్కూలు బేస్డ్ కేడర్ విషయాన్ని తొలగించారు.

**అప్రెంటీస్ సర్వీస్ సమస్య పరిష్కారం అయ్యేదాకా నిరంతర పోరాటం**

జాక్టో ఆధ్వర్యంలో 13 రోజులు సమ్మె పోరాటం చేసినా అప్రెంటీస్ సర్వీస్ తదితర ముఖ్యమైన సమస్యలు పరిష్కారం చేయని ప్రభుత్వ నియంతృత్వ వైఖరిని ఖండిస్తూ 2008 డిసెంబరు 8,9 తేదిలలో జరిగిన రాష్ట్ర కార్యవర్గము నిర్ణయము మేరకు అప్రెంటీస్ సర్వీస్‌కు రెండు నోషనల్ ఇంక్రిమెంట్లు యిచ్చి పెన్షన్‌కు లెక్కించాలని, స్పెషల్ విద్యావాలంటీర్ల సర్వీస్‌ని రెగ్యులర్ సర్వీస్‌గా పరిగణించాలని, డిఎస్‌సి 2003 ఉపాధ్యాయులకు పెన్షన్ పథకాన్ని వర్తింపచేయాలనే డిమాండ్లతో నాలుగు దశల పోరాట కార్యక్రమము రూపొందించడమైనది.

ప్రాంతీయ కేంద్రాలలో అవగాహనా సదస్సులు జరిపాము. ముఖ్యమంత్రికి అప్రెంటీస్ సర్వీసు సమస్యలపై లక్షకు పైగా కార్డులు వ్రాయించడమైనది. నవంబరు 26,27,28 తేదీలలో జిల్లా కలెక్టరేట్ ఎదుట సామూహిక రిలే దీక్షలు జరిగినవి. యితర సంఘాలలోని అప్రెంటీస్ టీచర్లు కూడా సమ్మె సందర్భంగా మన నిర్ణయం, ఆ తదుపరి పోరాట కొనసాగింపుపై మంచి స్పందన కనబరిచారు. సమ్మె విరమణ పట్ల అసంతృప్తి జ్వాలలు చెలరేగాయి. ప్రభుత్వ వైఖరి మరియు కొందరు ఎమ్మెల్సీల పైరవీల ఫలితంగా ఐక్య ఉద్యమంలో బేదాభిప్రాయాలు వచ్చిన తరువాత 2008 డిసెంబరు 3న జరిగిన ఛలో అసెంబ్లీ ఉద్రిక్తమైనది. ఉపాధ్యాయులు ప్రవాహంలా కదలి వచ్చిరి. ర్యాలీకి పోలీసులు అనుమతించకపోవడంతో ఇందిరా పార్కు వద్ద భారీ సభ నిర్వహించడమైనది. మీడియా మొత్తము మన సభ వద్దే కేంద్రీకరించారు. మన ఎమ్మెల్సీలు మరియు వివిధ పార్టీల నాయకులు ప్రసంగించిరి. శాసన మండలిలో అదే రోజు ఈ సమస్యలపై చర్చించడానికి పిడిఎఫ్ ఎమ్మెల్సీల ఒత్తిడి తేవడంతో 311 నిబంధన క్రింద అనుమతించి చర్చను వాయిదా వేయడంతో ఛలో అసెంబ్లీకి సిద్దపడ్డాము. ముళ్ళతీగ, ఫెన్సింగ్, వాటర్ పైపులు ఎన్ని అడ్డంకులు చేసినా దూసుకు వెళ్ళే క్రమంలో పోలీసులకు, మనకు పెద్ద ఎత్తున పెనుగులాట జరిగి గాయాలు అయినాయి. బట్టలు చిరిగిపోయినాయి. ఫలితంగానే ప్రభుత్వము దిగివచ్చి నోషనల్ ఇంక్రిమెంట్లు జి.ఓ. యిచ్చింది. అప్రెంటీస్ సర్వీసు పెన్షన్‌కు వర్తింపజేయాలని మరియు ఎయిడెడ్, మున్సిపల్ టీచర్లకు వర్తింపజేస్తూ సవరణ ఉత్తర్వుల కొరకు ప్రాతినిధ్యం చేయడమైనది.

**డి.ఇ.ఓ. కార్యలయాల వద్ద ధర్నాలు** జాక్టో సమ్మె విరమణ సదర్భంగా ప్రభుత్వము నవంబర్ 15 నాటికి బదిలీలు, ప్రమోషన్ల షెడ్యూలు విడుదల చేస్తామని యిచ్చిన హామీని నిలబెట్టుకోలేదు. ప్రభుత్వ వైఖరిని నిరసిస్తూ 2008 డిసెంబరు 19,20 తేదీలలో అన్ని జిల్లాల డి.ఇ.ఓ కార్యాలయాల ఎదుట తక్షణమే బదిలీలు, ప్రమోషన్ల షెడ్యూలు విడుదల చేయాలని కోరుతూ ధర్నాలు నిర్వహించడమైనది.

**ముఖ్యమైన విషయాలు, సందర్భాల్లో సంఘం వైఖరి**

1. ఉద్యోగాల్లో స్థానికులకు 80% రిజర్వ్ చేసే విధానాన్ని మన సంఘం బలపర్చింది. రిజర్వేషన్‌ని అతిక్రమించి అపాయింట్ అయిన స్థానికేతర ఉద్యోగులను స్వంత జిల్లాలకు పంపే సందర్భంలో స్వచ్ఛంద బదిలీలకు అనుమతించాలని, భార్యాభర్తలకు మినహాయింపులు యివ్వాలని డిమాండ్ చేశాము.
2. ప్రభుత్వ పాఠశాలల్లో ఇంగ్లీష్ మీడియంని పెట్టాలనే ప్రభుత్వ నిర్ణయం 6వ తరగతి నుండి మాత్రమే వుండాలని, అది కూడ ప్యారలల్ సెక్షన్‌గా వుండాలని, తెలుగు మీడియం రిప్లేస్ చేయవద్దని చెప్పాము. ప్రాథమిక విద్య మాతృభాషలోనే కొనసాగాలనే డిమాండ్ చేశాము.
3. ఏడవ తరగతికి కామన్ పరీక్ష విధానాన్ని విరమించాలనే నిర్ణయాన్ని సమర్ధించాము. పరీక్ష పత్రాల ఎవల్యూషన్‌ని ప్రైవేట్ ఏజెన్సీలతో చేయించాలనే ప్రతిపాదనను వ్యతిరేకించాము.
4. మధ్యాహ్న భోజన పథకాన్ని 10వ తరగతి వరకూ విస్తరించాలని డిమాండ్ చేశాం. ఈ పథకం అమలు చేస్తున్న కార్మికుల పోరాటాన్ని బలపర్చాం. కార్పొరేట్ సంస్థలకి అప్పగించే విధానాన్ని వ్యతిరేకించాము.
5. పాఠశాలలపై పంచాయితీలకు అధికారాలు యిస్తూ ఇచ్చిన జి.ఓ. 2లోని ఉపాధ్యాయులను వేధింపులకు గురి చేసే అంశాలను తొలగించాలని డిమాండ్ చేశాము. ప్రతి వారం పంచాయతీ విద్యా సబ్ కమిటీ జరిపే సమావేశాలకు ఉపాధ్యాయులు హాజరు కావాలనే విషయాన్ని, ఆ కమిటీ ఉపాధ్యాయుల హాజరు, బోధనా నైపుణ్యాన్ని పరిశీలించాలనే విషయాన్ని వ్యతిరేకించాము.
6. పాఠశాల విద్యను రెండు ముక్కలుగా చేసే ప్రభుత్వ చర్యని వ్యతిరేకించాము. ప్రైమరీ, సెకండరీగా రెండు డైరెక్టరేట్‌లు ఏర్పాటు చెయ్యాలని, ఇంటర్‌ని సెకండరీ విద్యలో కలుపుతామనే చర్యలు అసమంజసంగా వున్నాయని చెప్పాము. మంత్రులకు రాజ్యాలు పంచిస్తున్నట్లుంది తప్ప యిది విద్యారంగానికి వుపయోగపడేది కాదని చెప్పాము. ఒక్క పాఠశాల విద్య పునర్ వ్యవస్థీకరించదలిస్తే కేంద్ర విధానాన్ని అనుసరించవచ్చునని వివరించాము.

## ఐక్య ఉద్యమాలు

**జూన్ 10న దేశ వ్యాప్త నిరసన** అధిక ధరలను అరికట్టాలని, పెన్షన్ ప్రైవేటీకరణ ఆపాలని, కేంద్ర 6వ వేతన సంఘం సిఫార్సులలోని అసంబద్ధతలను సవరించాలని డిమాండ్ చేస్తూ దేశ వ్యాప్తంగా జూన్ 10న జరిగిన ఈ కార్యక్రమంలో స్కూల్ టీచర్స్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంఘాలన్నీ పాల్గొని నిరసన తెలిపినాయి.

**గ్రేటర్ హైదరాబాద్ పరిధిలో ఉద్యోగులకు 30% హెచ్‌ఆర్‌ఏ** నగరంలో వున్న కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు సెప్టెంబరు నుండే 30% హెచ్‌ఆర్‌ఏ చెల్లిస్తుండగా, రాష్ట్ర ప్రభుత్వం సమస్యను దాటవేస్తూ ఉంది. దీన్ని నిరసిస్తూ జెఏసి మరియు ఆర్‌టిసి కార్మిక సంఘాలు ఐక్యంగా దశల వారీ పోరాటాన్ని చేస్తూ జనవరి 27 నుండి సమ్మెకు పిలుపునివ్వడంతో ప్రభుత్వం దిగివచ్చి జనవరి 10న జెఏసి ప్రతినిధులతో ఆర్థికమంత్రి, ముఖ్యమంత్రి చర్చించి తగు ఉత్తర్వులు ఇవ్వడానికి అంగీకరించిరి. ఇది ఉద్యోగ, ఉపాధ్యాయుల, కార్మికుల సమిష్టి విజయం.

**జి.ఓ. 32పై రౌండ్ టేబుల్ సమావేశము** రాష్ట్ర యుటిఎఫ్ కార్యాలయంలో రెసిడెన్షియల్ స్కూల్సు సంఘాలు, విద్యార్థి సంఘాలు, కాలేజీ సంఘాల బాధ్యులతో మార్చి 26న సమావేశం ఏర్పాటు చేసి జి.ఓ. 32తో పాఠశాల విద్యలో ప్రవేశిస్తున్న ప్రమాదకర పరిణామాలను నివారించడానికి ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు తయారు చేసి ప్రభుత్వానికి మెమోరాండం యిచ్చాము.

**జి.ఓ. 76పై పోరాటము** పాఠశాల విద్యారంగంలో సంస్కరణలపై విద్యావేత్తలు, మేధావులు, ప్రజా ప్రతినిధులు, ఉపాధ్యాయ సంఘాల సూచనలను పెడచెవిన పెట్టి రాష్ట్ర ప్రభుత్వం ఏకపక్షంగా జారీ చేసిన జి.ఓ. 76ను నిలిపివేయాలని, ఉన్నత పాఠశాలలో ప్రవేశ పెడుతున్న ఆంగ్లమాధ్యమంలో స్టేట్ సిలబస్‌ను ప్రవేశ పెట్టాలని, యుపి పాఠశాలల్లో రద్దు చేసిన 6,7 తరగతులను పునరుద్దరించాలని డిమాండ్ చేస్తూ జాక్టో పిలుపుతో 2008 జూన్ 24న రాష్ట్రంలోని అన్ని మండల కేంద్రాలలో ధర్నా కార్యక్రమాలు జరిగినవి. దీనికి కొనసాగింపుగా జూన్ 27న కలెక్టరు కార్యాలయం వద్ద పికెటింగ్‌లు జరిగినవి. పిడిఎఫ్ ఎమ్మెల్సీలు ఆయా జిల్లాలలో పాల్గొని అరెస్ట్ అయినారు.

**సార్వత్రిక సమ్మె** కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక, ఉద్యోగ వ్యతిరేక విధానాలకు, ధరల పెరుగుదలకు నిరసనగా కేంద్ర, రాష్ట్ర ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాలు యిచ్చిన పిలుపు మేరకు ఆగస్టు 20న జరిగిన దేశవ్యాప్త సార్వత్రిక సమ్మె విజయవంతమైనది.

**జెఏసి పోరాటము - ఐ.ఆర్.సాధన** ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికుల విశాల పోరాట వేదిక జెఏసి రాష్ట్ర కార్యదర్శి వర్గం పునర్నిర్మాణము 2007 జూన్ 5న జరిగింది. మన సంఘానికి కో-చైర్మన్, కార్యదర్శి హోదా లభించింది. రాష్ట్ర స్థాయి ఐక్య ఉద్యమాలలో నిరంతర కృషికి ప్రాధాన్యతనిస్తూ ఉద్యమాల్లో మన సంఘం ప్రధాన పాత్ర వహించడం జరుగుచున్నది. ఐ.ఆర్.సాధనలో మన సంఘం క్రియాశీలకంగా వ్యవహరించింది. సంఘాలను సమైక్య

పరచడంలో, రాష్ట్ర వ్యాప్తంగా ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికులను చైతన్య పరచుటలో 2008 జూన్ 15-30 లలో జిల్లా కేంద్రాలలో సభలు, సెప్టెంబరు 8-16 వరకు తాలూకా, మండల స్థాయి సమావేశాలు, సదస్సులు, సెప్టెంబరు 18 జిల్లా కేంద్రాలలో ర్యాలీలు, ధర్నాలు జరిగాయి. ఛలో సచివాలయం ముందస్తు ఏర్పాట్లకు సదస్సులు తదితర కార్యక్రమాల రూప కల్పన అమలులో మన సంఘం ప్రధాన భాగస్వామ్యము వహించింది.

ఐఆర్ ప్రస్తుత వేతనాలమీద 40% యివ్వాలనేది జెఎసి డిమాండ్. అందుకు తగిన ఆధారాలు, ప్రాతి పదికలను సోదాహరణంగా ప్రభుత్వానికి వివరించింది. అయితే ప్రభుత్వము కూరగాయలు బేరమాడినట్లు వ్యవహరించింది. 1958 నుండి మొదలైన పిఆర్‌సిల చరిత్రలో 2005 పిఆర్‌సిలోనే ఉద్యోగులకు అపార నష్టం ఈ ప్రభుత్వ హయాములోనే జరిగింది. కావున పోగొట్టుకొన్న చోటే రాబట్టుకోవాలనే పట్టుదలతో జెఎసి నాయకత్వం కృషి చేసింది. చర్చలు జరిగిన 6 సమావేశాలలో ముఖ్యమంత్రి స్వయంగా 4 సమావేశాలలో పాల్గొన్నారు. 5%తో మొదలయి 13% వరకు రోజుకో శాతం చొప్పున పెరుగుతూ వచ్చింది. జెఎసి ఒకేసారి 30% కు తగ్గి అంతకంటే తగ్గేది లేదని తేల్చి చెప్పింది. చర్చలు జరుగుచున్న రీత్యా సెప్టెంబరు 25న జరగాల్సిన ఛలో సెక్రటేరియేట్‌ను అక్టోబరు 16కు వాయిదా చేయడమైనది. ఈ కాలములో రాష్ట్ర వ్యాప్తంగా తిరిగి ఉద్యోగులందరిని జెఎసి నాయకత్వం కదిలించింది. ఉద్యమ తీవ్రతను గమనించిన ప్రభుత్వం దిగివచ్చి చివరకు 22% ను రెండు దఫాలుగా యిస్తూ ఉత్తర్వులు యివ్వడానికి అంగీకరించింది.

**జాక్టో ఆధ్వర్యంలో దీక్షలు స్పాట్ బహిష్కరణ** జాక్టో ఆధ్వర్యంలో 2008 ఏప్రిల్ 9 నుండి 18 వరకు రిలే నిరాహార దీక్షలు, ఏప్రిల్ 19న ఆమరణ నిరాహారదీక్ష జరిగింది. ప్రతి రోజు వివిధ సంఘాల నాయకులు 15 మంది కూర్చున్నారు. వారికి మద్దతుగా రోజూ సగటున 200 మంది పాల్గొన్నారు. ఆమరణ నిరాహార దీక్షలో రాష్ట్ర అధ్యక్షులు శ్రీ. ఐ. వెంకటేశ్వరరావు పాల్గొన్నారు. 19వ తేదీన యస్‌యస్‌సి స్పాట్ వ్యాల్యుయేషన్ దిగ్బంధనానికి యిచ్చిన పిలుపు చాలా జిల్లాలలో విజయవంతమయింది. దానితో ప్రభుత్వం దిగి వచ్చింది. జాక్టోతో చర్చలు జరిపి మినిట్స్ యిచ్చింది. అప్రెంటీస్ సర్వీస్ సమస్యలపై ప్రతిపాదనలు పంపింది.

### ఉపాధ్యాయుల సమ్మె - తదనంతర పరిణామాలు

అక్టోబర్ 22 నుండి నవంబర్ 3 వరకు 13 రోజులు పాఠశాల ఉపాధ్యాయుల సమ్మె జరిగింది. సమ్మె దాదాపు సంపూర్ణంగా (90%) జరిగింది. జిల్లా పరిషత్, మండల పరిషత్ పాఠశాలల ఉపాధ్యాయులు అంతా సమ్మెలో పాల్గొన్నారు. మున్సిపల్ పాఠశాలల ఉపాధ్యాయుల్లో అధిక భాగం సమ్మెలో పాల్గొన్నారు. ప్రభుత్వ పాఠశాలలు, ఎయిడెడ్ పాఠశాలల ఉపాధ్యాయులు 60% మంది పాల్గొన్నారు. గిరిజన పాఠశాలల ఉపాధ్యాయుల్లో తక్కువ మంది సమ్మె చేశారు. మొత్తం మీద పాఠశాలలు అన్నీ మూతబడినట్లే సమ్మె జరిగింది. 1986 తదుపరి 22 సంవత్సరాల తర్వాత ఉపాధ్యాయులు చేసిన పెద్ద పోరాటంగా రాష్ట్ర ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో నిలుస్తుంది. సమ్మెకి సన్నాహాలు పెద్దగా జరగకపోయినా, సమ్మె చేసే అనుభవం సరిగా లేకపోయినా సమ్మె సక్సెస్‌ఫుల్‌గా జరిగింది. ఈ తరం యువతరం ఉపాధ్యాయులు ఎంతో ఉత్సాహంగా, ధైర్యంగా సమ్మెలో పాల్గొన్నారు.

సమ్మె జరిగిన అన్ని రోజులూ రోజుకో కార్యక్రమం జరిగింది. మండల, పట్టణ కేంద్రాలు, పాత తాలూకా కేంద్రాలు, జిల్లా కేంద్రాల్లో నిరసన ప్రదర్శనలు, ధర్నాలు, పికెటింగ్‌లు, జిల్లా పరిషత్ సమావేశాలను అడ్డుకోవటం వంటి కార్యక్రమాలు జరిగాయి. అనేక మంది మంత్రులను ఘెరావ్ చేశారు. హైకోర్టులో ప్రజాప్రయోజనాల వ్యాజ్యం వేసినా, ఉపాధ్యాయులు సమ్మె చేయటం సరైంది కాదని న్యాయమూర్తులు మందలించినా ఉపాధ్యాయుల వెనకడుగువేయలేదు. ఉపాధ్యాయులు ఎంతో పట్టుదలతో సమ్మెలో పాల్గొన్నారు.

ఉపాధ్యాయుల సమ్మెకి విశాలమైన మద్దతు లభించింది. అధికార పార్టీతో సహా అన్ని రాజకీయ పార్టీలు సమ్మెని సంపూర్ణంగా బలపరిచాయి. ప్రొగ్రెసివ్ డెమోక్రటిక్ ఫ్రంట్ (పిడిఎఫ్) ఎమ్మెల్సీలు సమ్మెకి అండగా పనిచేశారు. జిల్లాల్లో జరిగిన అన్ని రకాల పోరాటాల్లో పాల్గొన్నారు. ముఖ్యమంత్రికి, మంత్రికి ప్రాతినిధ్యాలు చేశారు. ప్రెస్, మీడియా ద్వారా ఉపాధ్యాయుల సమ్మెని బలపరుస్తూ, ప్రభుత్వ వైఖరిని ఎండగట్టారు.

ఉపాధ్యాయుల సమ్మెను విచ్ఛిన్నం చేయటానికి ప్రభుత్వం తీవ్రమైన కృషి చేసింది. సామ దాన భేద దండోపాయాలు ప్రయోగించింది. రాబోయే ఏప్రిల్ దాకా ఎలాంటి ఆర్థిక సమస్యలు పరిష్కరించే అవకాశం లేదని, ఎఫ్ఆర్‌బిఎం చట్టం ఒప్పుకోదని గత పోరాటాల్లో ఉపాధ్యాయులపై పెట్టిన కేసులు ఎత్తివేస్తామని, మరికొన్ని చిన్న చిన్న సమస్యలు పరిష్కరిస్తామని నచ్చచెప్పే ప్రయత్నం చేసింది. అప్రెంటీస్ సర్వీస్ తదితర ప్రధాన సమస్యల కోసం పట్టుబట్టవద్దని అభ్యంతరం చెప్పింది. హైస్కూల్ హెడ్మాస్టర్లు, మండల విద్యాశాఖాధికారులకు సమ్మెలో పాల్గొనే హక్కులేదని మెమోలు యిచ్చారు. విద్యావాలంటీర్లు విధిగా పాఠశాలల్లోనే వుండాలని ఆదేశాలు యిచ్చారు. హెడ్మాస్టర్లు సంఘం, ఎయిడెడ్ టీచర్ల సంఘాలను సమ్మె నుంచి తప్పుకున్నట్లు ప్రకటనలు చేయించారు. హైకోర్టులో వేసిన ప్రజాప్రయోజనాల వ్యాజ్యాల ద్వారా సమ్మెని దెబ్బతీయవచ్చునని భావించారు. పిఆర్‌టియు, ఎస్‌టియు సంఘాలను వారి ఎమ్మెల్సీల ద్వారా వెనక్కి లాగారు. ఇది రాజకీయ సమ్మె అని, ఈ సమ్మెని సిపిఎం పార్టీ నడిపిస్తోందని, ఇది మావోయిస్టుల చేతుల్లోకి పోతుందని ముఖ్యమంత్రి ఆగ్రహం వ్యక్తం చేశారు. దున్నపోతుకీ, గాడిదలకు మెమోరాండాలు ఇవ్వటం ఏమిటని, సాక్షి దినపత్రికలను తగులబెట్టటం ఏమిటని, ఇలాంటి పనులా ఉపాధ్యాయులు చేసేది అంటూ మండిపడ్డారు. ఇటీవలనే 22% తాత్కాలిక భృతి తీసుకొని మళ్ళీ ఇప్పుడు అప్రెంటీస్ సర్వీస్‌కి నోషనల్ యింక్రిమెంట్లు అడగటం ఏమిటని అసహనంగా వ్యవహరించారు. సమస్యలు పరిష్కారం కాకుండానే సమ్మె అర్థాంతరంగా ముగిసింది. సమ్మె చేసిన ఉపాధ్యాయులు తీవ్రమైన అసంతృప్తికి గురైనారు.

ఈ సమ్మెను నడిపించిన ఉపాధ్యాయ సంఘాల సంయుక్త కార్యాచరణ సమితి (జాక్టో)లో సంఖ్య రీత్యా 22 ఉపాధ్యాయ సంఘాలు వున్నా అందులో 10 సంఘాలు మాత్రమే రెగ్యులర్‌గా కార్యక్రమాల్లో పాల్గొన్నారు. యుటిఎఫ్, పిఆర్‌టియు, ఎస్‌టియు, ఏటిఎఫ్ సంఘాలు నాయకత్వం బాధ్యతలు నిర్వహించాయి. 13 రోజుల దాకా సమ్మెని పట్టుదలగా కొనసాగించినా ఎమ్మెల్సీలు మోహన్‌రెడ్డి, సుబ్బారెడ్డిల జోక్యంతో కొన్ని సంఘాలు సమ్మె విరమించటానికి సిద్ధపడ్డాయి. అప్రెంటీస్ సర్వీస్, స్పెషల్ విద్యావాలంటీర్ల సర్వీస్, ఎయిడెడ్ టీచర్ల అన్‌ఎయిడెడ్ సర్వీస్ వంటి ముఖ్యమైన సమస్యలు పరిష్కారం కాకుండా సమ్మెను విరమించటం సరైంది కాదని యుటియఫ్ అభ్యంతరం చెప్పింది. డిటిఎఫ్, టిఎన్‌యుఎస్ సంఘాలు యుటియఫ్ నిర్ణయాన్ని బలపర్చాయి. యుటిఎఫ్ కూడ సమ్మెను విరమించాల్సి వచ్చినా ఈ సమస్యలు పరిష్కారం అయ్యేదాకా నిరంతరం పోరాటాలు చేస్తామని ప్రకటించింది. దానితో ఉపాధ్యాయులు ముఖ్యంగా అప్రెంటీస్ సర్వీస్‌తో పనిచేసిన ఉపాధ్యాయులు యుటిఎఫ్ వైఖరిని బలపర్చారు. అందుకనుగుణంగానే అప్రెంటీస్ సర్వీస్ సమస్య పరిష్కారం కోసం యుటిఎఫ్ పోరాటం కొనసాగించింది. రాష్ట్ర వ్యాప్తంగా సదస్సులు జరిగాయి. ముఖ్యమంత్రికి 2 లక్షల ఉత్తరాలు వ్రాశారు. నవంబర్ 26,27,28 తేదీల్లో జిల్లా కేంద్రాల్లో నిరాహారదీక్షలు జరిగాయి. డిసెంబర్ 3న జరిగిన చలో అసెంబ్లీ కార్యక్రమంలో వేలాది మంది ఉపాధ్యాయులు అరెస్టు అయ్యారు. వచ్చే ఆర్థిక సంవత్సరంలో సానుభూతితో మాత్రమే పరిశీలించగలనని ప్రవచించిన ముఖ్యమంత్రి మనసు మార్చుకొని నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వక తప్పలేదు. ఇంక్రిమెంట్లు తామే ఇప్పించామని చెప్పుకునేందుకు ఒక సంఘం వారు విద్యా సదస్సు పెట్టి, లక్షలాది రూపాయిలు వసూలు చేసి ఉపాధ్యాయులను తరలించి సదస్సు రాజకీయ వేదికగా మార్చేశారు. అయినా ఆ సమావేశం కంటే ముందే ఉపాధ్యాయుల చేతికి జి.ఓ కాపీ అందింది.

## సదస్సులు - సమావేశాలు

**వ్యవస్థాపక దినోత్సవములు** ప్రతి సంవత్సరము ఆగస్ట్ 10న యుటిఎఫ్, 12న ఎన్టిఎఫ్ఐ ఆవిర్భావ దినోత్సవ వేడుకలను ఘనంగా నిర్వహించుకొంటున్నాము. ఆగస్ట్ 10న చాలా మండల, పట్టణ కేంద్రాలలో జెండాలు ఎగుర వేసి ఆ రోజు కార్యవర్గ సమావేశములు జరిపి క్యాంపెయిన్ల పరిస్థితిని సమీక్షించుట జరిగినది.

**అమర జీవుల వర్థంతి సభలు** అమరజీవులు వర్ధంతి సభలను ప్రతి సంవత్సరము జనవరి 12న మైనేని, మార్చి 21న ఏవిఎస్, డిసెంబరు 9న చెన్నుపాటి వర్ధంతులను పురస్కరించుకుని ఆయా నెలలో చివరి వరకు రాష్ట్రమంతటా జిల్లా, మండల, పట్టణ కేంద్రాలలో వర్ధంతి సభలు జరుపుకొనుట జరుగుతున్నది.

**ఏవిఎస్‌గారి 7వ వర్థంతి** సందర్భంగా ప్రతి సంవత్సరము ఏవిఎస్ మెమోరియల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో స్మారకోపన్యాసాన్ని ఏర్పాటు చేస్తున్నాము. అమరజీవి అప్పారి వెంకటస్వామి గారి 7వ వర్ధంతి సందర్భంగా 2008 మార్చి 22న విశాఖపట్టణంలో స్మారకోపన్యాసం ప్రముఖ విద్యావేత్త ఎమ్మెల్సీ చుక్కారామయ్య "ఉపాధ్యాయ ఉద్యమం-సామాజిక బాధ్యత' అనే అంశంపై ప్రసంగించారు. సమాజాభివృద్ధిలో ఉపాధ్యాయులు కీలక పాత్ర వహించి ఏవిఎస్‌గారి ఆశయాలను నెరవేర్చాలన్నారు. విశాఖ, విజయనగరం, ప్రకాశం, తూర్పుగోదావరి జిల్లాల నుండి మొత్తం 612 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**యుటిఎఫ్ సీనియర్ నాయకులు పారుపల్లి సత్యనారాయణ** గారు యుటియఫ్ ఖమ్మం జిల్లా ఉద్యమ నిర్మాతల్లో ఒకరు, జీవితాంతం సంఘంతో మమేకమైన త్యాగశీలి, సంఘజీవి. ఖమ్మం జిల్లాలో ఉద్యమ విస్తరణకు ఆయన నిరంతరం శ్రమించారు. ఏ బాధ్యతల్లో లేనప్పటికీ సాధారణ కార్యకర్తగా, ఇతరులకు ఆదర్శప్రాయునిగా పనిచేశారు. నిరాడంబరతకు, ఖచ్చితత్వానికి పెట్టింది పేరు. తన అభిప్రాయాల్ని నిర్మొహమాటంగా వెల్లడించేవారు. యుటియఫ్ కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ వ్యవస్థాపక కార్యదర్శిగా నిజాయితీగా పని చేశారు. ఉద్యమంలో పనిచేసిన కాలంలో ఎందరో కార్యకర్తలకు స్ఫూర్తిని కలిగించారు. హైదరాబాద్, ఖమ్మంలోని యుటియఫ్ కార్యాలయాలను తానే దగ్గరుండి కట్టించారు. కా॥ పారుపల్లి వితరణశీలి ప్రతి సంవత్సరం సంఘానికి రు.10,000 విరాళం యివ్వాలనే నియమం పెట్టుకున్నారు. తొలుత రాష్ట్ర శాఖకు, గత 9 సంవత్సరాలుగా ఖమ్మం జిల్లా శాఖకు (గత 3 సంవత్సరాల నుండి రూ.15000/-) విరాళం ఇచ్చేవారు. వారి శ్రీమతి పారుపల్లి హేమలత పేరున ఖమ్మం జిల్లా కార్యాలయంలో మహిళా విశ్రాంతి భవనాన్ని నిర్మించేందుకు 2 లక్షల విరాళం యిచ్చారు. తుది శ్వాసవరకు సంఘంతోనే గడపాలనే కోరికతో చివరి 4 నెలల కాలంలో ఖమ్మం యుటియఫ్ కార్యాలయాలంలోనే మకాం వున్నారు. కా॥ పారుపల్లి సత్యనారాయణ (80) ఏప్రిల్ 6న హైదరాబాద్ నిమ్స్‌లో అనారోగ్యంతో మరణించారు. వారి మృతదేహాన్ని నిమ్స్ నుండి రాష్ట్ర కార్యాలయానికి తీసుకువచ్చి అక్కడి నుండి ఖమ్మం తరలించారు. హైదరాబాద్‌లో యుటియఫ్ ప్రధానబాధ్యులతో పాటు యుటియఫ్ సీనియర్ నాయకులు, ఆయనతో సాన్నిహిత్యం ఉన్న పలువురు ప్రముఖుల సమక్షంలో అంత్యక్రియలు సాంప్రదాయేతర పద్ధతిలో ఘనంగా జరిగాయి. ఏప్రిల్ 13న ఖమ్మంలో యుటియఫ్ ఆధ్వర్యంలో కా॥ పారుపల్లి సంస్మరణ సభ నిర్వహించబడింది.

**ఉపాధ్యాయ ఉద్యమనేత మాజీ ఎమ్మెల్సీ యం.జె. మాణిక్యరావు** గారు 2008 నవంబరు 17న గుంటూరులో మరణించారు. యుటిఎఫ్ రాష్ట్ర నాయకత్వం మరియు ఎమ్మెల్సీలు డి.రామిరెడ్డి, కె.ఎస్. లక్ష్మణరావులు, గుంటూరు జిల్లా కమిటీ వారు ఎం.జె. మాణిక్యరావు గారి భౌతిక కాయాన్ని సందర్శించి నివాళులర్పించి అంతిమ యాత్రలో పాల్గొన్నారు. అనంతరం సంతాప సభ నిర్వహించబడినది.

## యుటియఫ్ నాయకుల చైనా పర్యటన

చైనా ప్రభుత్వ ఆహ్వానం మేరకు మన దేశంలోని విద్యారంగం, ఉపాధ్యాయ ఉద్యమంలో పని చేస్తున్న 9మంది ప్రముఖులు 2008 జులై 5 నుండి 15 వరకు 11 రోజులు చైనాలో పర్యటించారు. ఈ బృందంలో ఆంధ్రప్రదేశ్ నుండి శాసనమండలిలో ప్రొగ్రెసివ్ డెమోక్రటిక్ ఫ్రంట్ చైర్మన్ ఎమ్మెల్సీ డా॥ చుక్కారామయ్య, ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్(యుటియఫ్) రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఎన్. నారాయణ వున్నారు. పదకొండు రోజుల పర్యటనలో చైనా ప్రభుత్వ ప్రముఖులు, అధికారులతో 14 సమావేశాలు జరిగాయి. 3 యూనివర్సిటీలు, 4 హైస్కూళ్ళు, 3 ప్రైమరీ స్కూల్స్, 2 పాలిటెక్నిక్ కాలేజీలు సందర్శించటం జరిగింది. ఒలెంపిక్ గేమ్స్‌లో చైనా సూపర్ పవర్‌గా సాధించిన విజయం ఆ దేశ ప్రాథమిక విద్య నుండే క్రీడలకు యిస్తున్న ప్రాధాన్యతలో ప్రతిఫలిస్తుంది. విద్యారంగ వికాసానికి భారత దేశం ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ఎంతో నేర్చుకోవాల్సి వుందనే విషయాన్ని పర్యటించిన బృందం గమనించటం జరిగింది.

## త్రిపుర రాష్ట్ర సదస్సులో యుటియఫ్ వాణి

త్రిపుర ప్రభుత్వ ఉపాధ్యాయ సంఘం (టిజిటిఏ) రాష్ట్ర మహాసభ సందర్భంగా 2008 సెప్టెంబర్ 7న అగర్తలాలో రాష్ట్ర స్థాయి విద్యా సదస్సు జరిగింది. ఆ సదస్సులో కేరళ విద్యాశాఖ మంత్రి శ్రీ ఎం.ఏ. బేబి, ఎస్టిఎఫ్ఐ ఉపాధ్యక్షులు, ఏపి యుటియఫ్ ప్రధానకార్యదర్శి ఎన్. నారాయణ ప్రధాన వక్తలుగా పాల్గొన్నారు.

## శాసనమండలి ఎన్నికలు - ఫలితాలు

మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్ పట్టభద్రుల నియోజకవర్గానికి ది. 15.12.2008 నాడు ఎన్నికలు జరిగాయి. ఆ 4 జిల్లాల యుటియఫ్ శాఖల అభిప్రాయాల మేరకు మన సంఘం రాష్ట్ర కార్యదర్శి శ్రీమతి సి. కమలకుమారి పోటీ చేశారు. ప్రచారంలో బలమైన అభ్యర్థిగా గుర్తింపు వచ్చింది. కానీ నాలుగవ స్థానం లభించింది. కమల కుమారిగారికి 4962 ఓట్లు వచ్చాయి. కాంగ్రెస్ పార్టీ అభ్యర్థితో సమాన స్థాయిలో నిలిచాము. ఈ ఎన్నికల్లో టిఆర్ఎస్ అభ్యర్థి నారదాసు లక్ష్మణరావు గెలిచారు.

తూర్పు, పశ్చిమగోదావరి ఉపాధ్యాయ నియోజకవర్గం, కృష్ణ, గుంటూరు ఉపాధ్యాయ నియోజకవర్గం మరియు మహబూబ్‌నగర్-రంగారెడ్డి-హైదరాబాద్ పట్టభద్రుల నియోజకవర్గం, వరంగల్-ఖమ్మం-నల్లగొండ పట్టభద్రుల నియోజకవర్గం ఎన్నికలు ది. 6.2.2008 నాడు జరిగాయి. కృష్ణ,గుంటూరు టీచర్స్ ఎమ్మెల్సీగా మన అభ్యర్థి శ్రీ కె.ఎస్. లక్ష్మణరావు మొదటి కౌంట్‌లోనే 5697 ఓట్ల భారీ మెజార్టీతో గెలిచారు. పునరుద్ధరించబడిన తర్వాత శాసన మండలిలో యిప్పటి వరకూ జరిగిన ఎన్నికల్లో ఇదొక రికార్డ్ బ్రేక్ రిజల్టు. ఉపాధ్యాయ సంఘాల్లో హెడ్మాస్టర్ల సంఘం, ఎస్టియు, టిఎన్‌యుఎస్, పిఇటీ సంఘాలు, కాలేజీ అధ్యాపకుల సంఘాలు, రెసిడెన్షియల్ స్కూల్స్ టీచర్ల సంఘాలు మన అభ్యర్థికి మద్దతు యిచ్చాయి.

తూర్పు, పశ్చిమ గోదావరి టీచర్స్ ఎమ్మెల్సీగా పోటీ చేసిన మన అభ్యర్థి శ్రీ సిహెచ్. సుభాష్‌చంద్రబోస్‌కి 5488 ఓట్లు వచ్చాయి. 312 ఓట్ల తేడాతో ఓడిపోయారు. మన ప్రత్యర్థి కార్పొరేట్ విద్యా వ్యాపారి చైతన్యరాజు ఓటర్లకు పంచిన వెండిగ్లాసులు, చీరలు, కుక్కర్లు తదితర లంచాలను ప్రతిఘటించక పోవటం వలన మనం గెలవలేక పోయాము. మన సంఘం ఎంత బలంగా వున్నా, మనం ఎంత పెద్ద ఎత్తున క్యాంపెయిన్ చేసినా, ఎంత విశాలమైన మద్దతు కూడ గట్టినా ప్రత్యర్థి ప్రలోభాలను ఎదిరించలేకపోతే గెలువజాలము. గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీలుగా గెలిచిన డా॥ కె. నాగేశ్వర్, శ్రీ దిలీప్ కుమార్‌ల విజయానికి ఆయా జిల్లాల్లో మన సంఘం నాయకులు, కార్యకర్తలు కృషి చేశారు.

ఈసారి ఎన్నికల్లో తూర్పు, పశ్చిమగోదావరి ఉపాధ్యాయ నియోజకవర్గంలో పిఆర్‌టియు, ఎస్టియు సంఘాలు కార్పొరేట్ విద్యా వ్యాపారితోనే అంటకాగాయి.

ఏపీటిఎఫ్(257) వారు రిటైర్డ్ ఆర్జేడీ ఇ.ఆర్. అప్పారావుకి అనుకూలంగా పనిచేసినా చివరి దశలో వారు కూడ కార్పోరేట్ విద్యా వ్యాపారికే కొమ్ముకాశారు. హెడ్మాష్టర్ల సంఘం హెడ్మాష్టరైన సత్యనారాయణకి కూడ నిజాయితీగా పని చేయలేకపోయింది. కృష్ణ-గుంటూరు ఉపాధ్యాయ నియోజకవర్గంలో పిఆర్‌టియుతో పాటు ఏపీటిఎఫ్ (257) కూడా కార్పొరేట్ విద్యా వ్యాపారికే సేవ చేశాయి. డిటిఎఫ్ వారు వారి సంఘానికి అనుకూలంగా పని చెయ్యటం లేదనే వంకతో శ్రీ లక్ష్మణరావుకి వ్యతిరేకంగా పని చేశారు.

## శాసన మండలి - పిడిఎఫ్ కృషి

2007 మార్చిలో మొదటి సారి శాసన మండలి కొరకు అన్ని నియోజక వర్గాలలో ఎన్నికలు జరిగాయి. యు.టి.ఎఫ్, జన విజ్ఞాన వేదిక, ఎల్.ఐ.సి, ఆక్టా మొదలగు సంఘాలల్లో పనిచేసి మన ఉద్యమంతో సత్సంబంధాలు కల్గివున్న అభ్యర్థులను మనం బలపర్చాము. ప్రకాశం-నెల్లూరు-చిత్తూరు జిల్లాల ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి యు.టి.యఫ్ మాజీ అధ్యక్షుడు డి. రామిరెడ్డి, పట్టభధ్ర నియోజక వర్గం నుండి జె.వి.వి. నాయకులు విఠపు బాలసుబ్రహ్మణ్యం, గుంటూరు-కృష్ణ ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి ఆక్టా నాయకులు కె.యస్. లక్ష్మణరావు. ఉభయ గోదావరి జిల్లాల ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి యు.టి.యఫ్ గౌ॥ అధ్యక్షులు చెరుకూరి సుభాస్ చంద్రబోస్, పట్టబధ్రుల నియోజక వర్గం నుండి తూర్పుగోదావరి జిల్లా యు.టి.యఫ్ నాయకులు కె. జార్జివిక్టర్. విశాఖపట్నం-శ్రీకాకుళం-విజయనగరం పట్టభద్రుల నియోజక వర్గం నుండి ఎల్.ఐ.సి నాయకులు యం.వి.యస్. శర్మ. నల్లగొండ-ఖమ్మం-వరంగల్ జిల్లాల ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి ప్రముఖ విద్యావేత్త ఐ.ఐ.టి రామయ్యగారు, పట్టభద్రుల నియోజక వర్గం నుండి శ్రీమతి బుగ్గవీటి సరళ, హైదరాబాద్, మహబూబ్ నగర్, రంగారెడ్డి జిల్లాల పట్టభద్రుల నియోజక వర్గం నుండి ఉస్మానియా విశ్వ విద్యాలయ ప్రొపెసర్ డా॥ కె. నాగేశ్వర్ గార్లను బలపరిచాము. కర్నూలు, అనంతపురం జిల్లాల ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి పోచంరెడ్డి సుబ్బారెడ్డి. విశాఖపట్నం, శ్రీకాకుళం, విజయనగరం ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి సి.హెచ్. ప్రభాకరరావు. హైదరాబాద్-రంగారెడ్డి మహబూబ్‌నగర్ ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి ఎ. రాజేందర్ బాబుకు మద్దతిచ్చాము. వీరిలో డి.రామిరెడ్డి 3137 ఓట్లతోను, వి. బాలసుబ్రహ్మణ్యం 26901 ఓట్ల మెజార్టీతోను, కె.యస్. లక్ష్మణ రావు 3450 ఓట్ల మెజార్టితోను, కె. జార్జివిక్టరు 12372 మెజార్టితోను, యం.వి.యస్ శర్మ 17079 మెజార్టితోను, కె.నాగేశ్వర్ 463 ఓట్ల మెజార్టితో గెలిచారు.

సి.హెచ్.సుభాష్ చంద్రబోస్ 346 ఓట్లతోను, బి.సరళ 9953 ఓట్లతో ఓడిపోయారు. మద్దతిచ్చిన అభ్యర్ధులలో పి.సుబ్బారెడ్డి 1829 ఓట్లతో గెలుపొందారు.

వీరిలో శ్రీయుతులు చుక్కా రామయ్య, డి.రామిరెడ్డి, కె.యస్. లక్ష్మణరావు (ఉపాధ్యాయ నియోజక వర్గాలు), వి. బాలసుబ్రహ్మణ్యం, కె. జార్జివిక్టర్, యం.వి.యస్. శర్మ, డా॥ కె. నాగేశ్వర్ (పట్టభద్ర నియోజక వర్గం) ఏడుగురు Progressive Democratic Front (P.D.F) గా ఏర్పడినారు. దీనికి చుక్కా రామయ్య గారు (Chairman), డి.రామిరెడ్డి (Floor Leader), యం.వి.యస్ శర్మ (Deputy Floor Leader), కె. జార్జి విక్టర్ Whip & Convenor గా ఎన్నుకోబడ్డారు. శాసన మండలిలో కాంగ్రెస్, టి.డి.పిల తరువాత పి.డి.యఫ్‌దే పెద్ద గ్రూపు.

2007 మార్చి నుండి ఇప్పటి వరకు 7 సమావేశాలు జరిగాయి. సమావేశాలలో మన గ్రూప్ సభ్యులు శాసన మండలి ఔన్నత్యాన్ని కాపాడడానికి కృషిచేశారు. ప్రభుత్వం యిస్తానన్న 2 కోట్ల విలువైన ఇండ్ల స్థలాలను తృణప్రాయంగా తిరస్కరించి అందరికి ఆదర్శంగా నిలబడ్డారు. వివిధ రంగాల సమస్యలను సమర్ధవంతంగా ప్రాతినిధ్యం చేయడానికి కృషిచేశారు. వీరు శాసన మండలిలో ఉపాధ్యాయ సంఘాలకు ప్రత్యామ్నాయ వేదికలుగా కాకుండా ఉపాధ్యాయ ఉద్యమాలను బలపరుస్తూ వారి పోరాటాలకు పూర్తిగ సహకరించారు. పోరాటాలలో పాల్గొన్నారు. యు.టి.యఫ్ చేపట్టిన అన్ని కార్యక్రమాలకు చేదోడు వాదోడుగా ఉన్నారు.

2007 స్పాట్ బహిష్కరణ సమయంలో ప్రతిష్టంబన ఏర్పడినప్పుడు మన యం.యల్.సి లు ప్రభుత్వంతో చర్చించి ఒప్పందానికి మార్గం సుగమం చేశారు. 2008 లో జాక్టో నిర్వహించిన సమ్మె సందర్భంగా ప్రభుత్వంతో చర్చలు జరుపడానికి సమ్మె ముగింపుకు కృషి చేశారు. ఇప్పుడు కొందరు చెప్పుకుంటున్నట్లుగా నవంబర్ 3 వ తేదిన కుదిరిన ఒప్పందం ఉపాధ్యాయ యం.యల్.సిల తోను, ఆనాడు జాక్టోలోని అన్ని సంఘాలతోను జరిగిన ఒప్పందమే గాని, కొన్ని సంఘాలకి పరిమితం అయిన ఒప్పందం కాదు. ఏకీకృత సర్వీసులు సాధించడానికి ఢిల్లీకి వెళ్లి అక్కడ మంత్రులతోను రాష్ట్రపతితోను ప్రాతినిధ్యం చేసిన వారిలో పి.డి.యఫ్ యం.యల్.సి లు కూడా ఉన్నారు.

ఏకీకృత సర్వీసు రూల్సు జాప్యం అగుచున్న విషయం గమనించి ముందుచూపుతో అడహాక్ పద్దతిపై ఏమేనేజ్‌మెంట్‌కు ఆమేనేజ్‌మెంటుకు పాత పద్దతిలో బదిలీలు, ప్రమోషన్లు జరపాలని 2008 అక్టోబరు నెలలోనే మన యం.యల్.సిలు ప్రభుత్వానికి సూచించారు. కొంత మంది యం.యల్.సి లు దీనిని తిరస్కరించారు. అయినా మన యం.యల్.సి లు గట్టిగా పట్టు బట్టినందువల్లనే గత నెలలో ప్రమోషన్ జరిగాయి.

ఎయిడెడ్ ఉపాధ్యాయులకి సంబందించిన 37 వ యాక్టును భవిష్యత్తుకే గాని వెనుకటి తేది నుండి అమలు జరుపరాదని మన సంఘాలు కోరినా ప్రభుత్వం తిరస్కరిస్తూ వచ్చింది.

2003 మార్చి నెలలో ఈ విషయమై ప్రతిపక్ష నాయకుడి హోదాలో శ్రీ డా॥ వై.యస్. రాజశేఖరరెడ్డి గారు చేసిన ప్రతిపాదనను రికార్డులనుండి మన యం.యల్.సిలు వెలికి తీసి ముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకొని వచ్చినందువల్లనే ప్రభుత్వంవైఖరిలో మార్పు వచ్చింది. ప్రస్తుతం ఆ సమస్య పరిష్కారానికి దగ్గరలో ఉంది.

తాజాగా జరిగిన శాసన మండలిలో సక్సెస్ స్కూల్సు, భాషా పండితులు, పి.యి.టిల అప్ గ్రెడేషన్ విషయం ప్రశ్నల ద్వారా శాసన మండలిలో ప్రభుత్వాన్ని నిలదీసి ఆ సమస్య పరిష్కారానికి కృషి చేశారు. ఉపాధ్యాయ సంఘాలకు ప్రభుత్వానికి నవంబర్ 3 వ తేదిన జరిగిన అగ్రిమెంట్ అమలు విషయమై 311 అంశం కింద శాసన మండలిలో చర్చకు పెట్టి వారం రోజులలో అన్ని సమస్యలపై అగ్రిమెంట్ ఇస్తామని విద్యామంత్రిచే శాసన మండలిలో వాగ్దానం చేయించారు.అదే అంశంపై 311 లో నోటీసు యిచ్చిన ఇతర యం.యల్.సిలు ప్రభుత్వంతో లాలూచిపడి ఉపసంహరించు కున్నారు. కాని మన యం.యల్.సిలు ఉపసంహరించుకోకపోవడంతో వారుకూడ చర్చలలో పాల్గొనవలసి వచ్చింది.

## ఎస్‌టిఎఫ్ఐ- నిర్మాణం-కార్యక్రమాలు

సిసిఎస్‌టిఓ (కో ఆర్డినేషన్ కమిటీ ఆఫ్ స్కూలు టీచర్సు ఆర్గ నైజేషన్స్) పేరుతో ప్రారంభమై 2000 సంవత్సరంలో ఎస్‌టిఎఫ్ఐగా కలకత్తాలో ఆవిర్భవించి ప్రథమ మహాసభ 2002లో కేరళలోని పాల్ఘాట్‌లో ద్వితీయ మహాసభ, 2005 ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాదులో తృతీయ మహాసభ, 2009 జనవరి 29,30 ఫిబ్రవరి ఒకటి తేదీల్లో హర్యానాలోని హిస్సార్‌లో నాల్గవ మహాసభ విజయవంతంగా జరుపుకున్నది. ప్రారంభంలో ఆంధ్రప్రదేశ్ తమిళనాడు, బెంగాల్ కేరళ, త్రిపుర వంటి రాష్ట్రాల్లో ప్రారంభమైనా కొన్నాళ్ళకే అనేక రాష్ట్రాలకు వ్యాపించింది. పుదుచ్చేరి, హర్యానా, రాజస్థాన్, పంజాబ్, కాశ్మీర్‌లతో పాటు ఇప్పుడు అస్సాం, ఒరిస్సా, కర్నాటక, మహారాష్ట్ర, బీహార్‌లకు విస్తరిస్తున్నది. మొత్తం పది లక్షలమంది సభ్యులలో 18 రాష్ట్రాలకు ఎస్‌టిఎఫ్ఐ ప్రాతినిధ్యం వహిస్తున్నది. ప్రథమంలో డి. రామిరెడ్డి, అజిత్‌బాగ్‌లు, తుషార్ పంచానన్, అధ్యక్ష, ప్రధానకార్యదర్శులుగా పని చేయగా 3,4వ మహాసభల్లో కార్తీక్ మండల్, కె. రాజేంద్రన్ అధ్యక్ష, కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. హిస్సార్‌లో జరిగిన 4వ మహాసభలో ఆంధ్రప్రదేశ్ నుండి ఎన్. నారాయణ, ఎం. సంయుక్త ఉపాధ్యక్షులుగా, ఐ. వెంకటేశ్వర రావు కార్యదర్శిగా, సిహెచ్. రవి కార్యవర్గ సభ్యునిగా మరియు పి. బాబురెడ్డి, కె. విజయగౌరి, ఏ. నర్సిరెడ్డి,

ఏ. ఇజ్రాయల్ రాజు, జి. ప్రభుదాస్, ఎన్. కిష్టయ్య, కె. సురేష్ కుమార్ జనరల్ కౌన్సిల్ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు.

**ఆందోళనా పోరాటాలు :-**

1. విద్యా హక్కు బిల్లుపై సవరణలు కోరుతూ రాష్ట్రపతికి కోటి సంతకాల మెమోరాండం సమర్పించడం.
2. ఆంధ్రప్రదేశ్ ఎస్ఎస్ఏలో జరిగిన అవినీతిపై విచారణ జరిపించాలని కేంద్ర ఎస్ఎస్ఏ అధికారులకు విజ్ఞాపన పత్రం ఇవ్వడం.
3. పెన్షన్ ప్రైవేటీకరణ బిల్లుకు వ్యతిరేకంగా రాష్ట్రంలోనూ కేంద్రంలోనూ సమిష్టి ఉద్యమంలో పాల్గొనడం.
4. విద్యారంగ పరిరక్షణ అంశంపై ఢిల్లీలో అఖిలభారత సదస్సు నిర్వహించడం.
5. సమ్మె హక్కుపై అధిక ధరల నియంత్రణకై, పెట్రోలు ఛార్జీలు తగ్గింపుకై అఖిలభారత సమ్మెలో పాల్గొనడం.
6. విద్యా కాషాయీకరణకు వ్యతిరేకంగా సదస్సులు సమావేశాలు నిర్వహించడం.

మొదలగు అనేక కార్యక్రమాలు చేపట్టడం జరిగింది.

దేశ రాజధానిలో కేంద్ర కార్యాలయం :- ఎస్‌టిఎఫ్ఐ కేంద్ర కార్యాలయాన్ని ఢిల్లీలో ఏర్పాటు చేయాలని జాతీయ నాయకత్వం నిర్ణయించింది. 2009 ఆగస్టు 12 ఎస్‌టిఎఫ్ఐ వ్యవస్థాపక దినోత్సవం నాటికి ఇది కార్యరూపం దాల్చాలని, కేంద్ర కార్యాలయాలన్నింటికి అందుబాటులో ఉండడం ద్వారా ఉత్తర భారతంలో ఉద్యమ విస్తృతికి, విద్యారంగ అభ్యున్నతికి అవకాశం ఏర్పడుతుందని ఆశిద్దాం.

## ఎస్‌టిఎఫ్ఐ మహిళా ఉపాధ్యాయుల జాతీయ సదస్సు

2008 ఆగస్టు 24,25 తేదీలలో మొదటిసారిగా మహిళా ఉపాధ్యాయినుల జాతీయ సదస్సు యుటియఫ్ ఆధ్వర్యంలో విజయవాడలో ఉత్తేజకరంగా సాగింది. ఉపాధ్యాయులుగా విద్యారంగ ప్రైవేటీకరణతో, ఇంకా అనేకానేక సమస్యలను పురుషులతో పాటు ఎదుర్కొంటున్నా మహిళలుగా అనేక ఇబ్బందులను, ఆటంకాలను ఎదుర్కొంటున్న మహిళా ఉపాధ్యాయులు ఏకమై జాతీయ స్థాయిలో తమ గళం విప్పారు. మహిళా ఉపాధ్యాయులకు పాఠశాలల్లో తగు సౌకర్యాలు లేకపోవడం, ప్రసూతి సెలవుల్లో వివిధ స్థాయిల్లో తేడాలుండడం, పని భారంలో వివక్ష, రక్షణలేక పోవడం, రవాణా సౌకర్యాలు, పసి పిల్లల రక్షణ కేంద్రాల ఏర్పాటు మొదలైన సమస్యలపై ఉద్యమించాలని తీర్మానించారు. ఈ డిమాండ్సు కారణంగానే కేంద్ర ప్రభుత్వం అక్టోబరులో మహిళా ఉద్యోగులకు ఆరు నెలల ప్రసూతి సెలవు, పిల్లల చదువు, పెంపకానికి ఉపయోగించుకునేందుకు 2 సం॥ ఆర్జిత సెలవులను మంజూరు చేస్తూ ఉత్తర్వులు ఇచ్చింది. ఈ ఉత్తర్వులను అన్ని రాష్ట్రాలు అమలు చేస్తూ ఉత్తర్వులు ఇవ్వాలని ఎస్‌టిఎఫ్ఐ ప్రాతినిధ్యాలు జరుపుతున్నది.

ఆరు వందల మంది ప్రతినిధులు పదిహేను రాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహిస్తూ సదస్సులో పాల్గొన్నారు. బెంగాల్‌కు చెందిన శ్రీమతి మిత్రా భట్టాచార్య కన్వీనర్‌గా 18 మందితో జాతీయ మహిళా కన్వీనింగ్ కమిటీ ఏర్పడింది. ఆ కమిటీలో యుటియఫ్ నుండి కె. విజయగౌరి, డి.ఎల్. ప్రసన్నకుమారి కమిటీ సభ్యులుగా ఎన్నికయ్యారు.

## ప్రాతినిధ్యాలు

సెక్రటేరియట్, డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ కార్యాలయాలలో విధానపరమైన విషయాలు మరియు వ్యక్తిగత సమస్యలపైనా నిరంతర ప్రాతినిధ్యాలు చేస్తున్నాము. మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్, ట్రెజరీ డైరెక్టర్, ఎ.పి.జి.ఎల్.ఐ, కమీషనర్ ట్రైబల్ వెల్ఫేర్ కార్యాలయాలలో విధానపరమైన సమ్యలపైనా, జిల్లాల నుండి వస్తున్న సమస్యలపైనా లేఖలు సమర్పించి ప్రాతినిధ్యాలు చేస్తున్నాము. నిరంతరం వెంటాడితే తప్ప ఫైళ్ళు కదిలే పరిస్థితి లేదు. ఎ.జి. ఆఫీసులో పెన్షన్, పియఫ్ సమస్యలపై ప్రాతినిధ్యాలు చేయడం జరిగింది. కేంద్రంలో లేనప్పుడు కొన్ని సమస్యలు వెంటాడి పరిష్కారం చేయడంలో వెనుకబడి పోతున్నాము.

## అనుభవాలు

1. 10వ రాష్ట్ర మహాసభ తర్వాత గడిచిన 21 నెలల కాలంలో 28 రకాల ముఖ్యమైన ఆందోళన, పోరాట కార్యక్రమాలు జరిగాయి. అందులో 18 స్వతంత్ర కార్యాచరణవి, 6 ఐక్య పోరాటాలు, 4 అఖిలభారత ఉద్యమాలు. 276 పత్రికా ప్రకటనలు యిచ్చాము. తరుచుగా ప్రెస్‌మీట్‌లు పెట్టాము. 33 కరపత్రాలు వేశాము. 4 పోస్టర్‌లు వేశాము. 400 ప్రాతినిధ్యాలు చేశాము. ప్రభుత్వం నిర్వహించిన సమావేశాలు, చర్చలు దాదాపు అన్నింట్లో పాల్గొని యుటియఫ్ వాదనలు వినిపించాము.
2. ఐక్య ఉద్యమాల్లో మరింత చొరవగా పాల్గొన్నాము. జెఏసి పోరాటంలో ప్రముఖ పాత్ర పోషించాము. ఐఆర్ సాధనలో మంచి కృషి చేశాము. జాక్టో పోరాటాల్లో యుటియఫ్ ప్రత్యేకతను నిలబెట్టాము. రాజీలేని పోరాట సంస్థగా పని చేశాము. ఇతర సంఘాల్లోని సభ్యుల అభిమానాన్ని చూరగొన్నాము. మొత్తం ఉపాధ్యాయ ఉద్యమ శ్రేయోభిలాషుల ప్రశంసలు పొందాము. విద్యారక్షణ ఉద్యమం ఒక దశ కార్యక్రమాన్ని పూర్తి చేశాము.
3. సర్వీస్ రూల్స్ సమస్యతో పాఠశాల విద్యారంగంలో ఏర్పడిన ప్రతిష్టంభనను ఛేదించడానికి మన సంఘం చేసిన కృషి ఫలించింది. పాఠశాల విద్యాశాఖ చరిత్రలో, ఉపాధ్యాయ ఉద్యమ ప్రస్థానంలో ఒకేసారి 35 వేల మందికి ప్రమోషన్‌లు లభించాయి. అన్ని హైస్కూళ్ళకు హెడ్మాస్టర్ పోస్టులు భర్తీ అయినవి. సక్సెస్ స్కూల్స్ వరకైనా అన్ని సబ్జెక్టులకూ టీచర్లు అపాయింట్ అయ్యారు. జి.ఓ. 363 ద్వారా జరిగిన అప్‌గ్రేషన్‌లో పండిట్స్, పిఇటీలకు అన్యాయం జరగటంతో ఆయా ఉపాధ్యాయులలో తీవ్ర అసంతృప్తి నెలకొన్నది.
4. ఏకీకృతం లేకపోయినా ప్రభుత్వ, పంచాయితీరాజ్ ఉపాధ్యాయులకు ప్రమోషన్‌లు రావటంతో గిరిజన, మున్సిపల్ టీచర్ల సర్వీస్ రూల్స్, ప్రమోషన్‌ల సమస్యలు ముందుకొస్తున్నాయి. డిఎస్‌సి 2008 నియామకాలు జరిగే దాకా నిరుద్యోగ ఉపాధ్యాయుల ఉద్యమాలు పెరిగే అవకాశం వుంది. ఎయిడెడ్ పాఠశాలల్లో ఖాళీ పోస్టులు భర్తీ, ప్రమోషన్‌లకు పరిష్కారం ఏమిటనేది ముఖ్యమైన సమస్యగా మారుతుంది.
5. ఉపాధ్యాయ ఉద్యమంలో ప్రభుత్వ జోక్యం పెరిగింది. అధికార పక్షం, ప్రతిపక్షంకి అనుకూలంగా ఉపాధ్యాయ ఉద్యమాన్ని మలుచుకొనే చర్యలు పెరిగాయి. దీనితో ఉపాధ్యాయ ఉద్యమంలో చీలికలు, లొంగుబాట్లు తదితర పరిణామాలు సంభవించాయి. ఈ పరిస్థితుల్లో ఉపాధ్యాయ ఉద్యమం ఐక్యతను, స్వతంత్రను నిలబెట్టటం ప్రధాన కర్తవ్యంగా ముందుకొచ్చింది.
6. టీచర్, గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీ ఎన్నికల్లో ప్రభుత్వ పెత్తందారీ జోక్యం పెరిగింది. కార్పొరేట్ విద్యా వ్యాపారుల అవినీతి, అక్రమ చర్యలు పెరిగిపోతున్నాయి. టీచర్ కాని వారు టీచర్ ఎమ్మెల్సీలుగా గెలిచే పరిస్థితి దాపురించింది. సమస్యలపై ఐక్యంగా పోరాడే సంఘాలు ఎమ్మెల్సీ ఎన్నికల్లో చీలిపోవటం జరుగుతున్నది.

ఉద్యమాభివందనములతో

**ఎన్. నారాయణ**, రాష్ట్ర ప్రధానకార్యదర్శి

# ఐక్య ఉపాధ్యాయ పత్రిక నివేదిక

## (2007 మే నుండి 2009 ఫిబ్రవరి వరకు)

**అధ్యక్షా ! మిత్రులారా !**

ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజల సామాజిక, ఆర్థిక, రాజకీయ హక్కులను పరిరక్షించడంలో పత్రికల పాత్ర కీలకమైనది. ప్రతి పత్రికకూ ఒక లక్ష్యం, వర్గ దృక్పథమూ వుంటాయి. నేడు వెలువడుతున్న పత్రికలలో ఎక్కువ భాగం పెట్టుబడిదారులు, మార్కెట్ శక్తుల చేతుల్లోనే వున్నాయి. అవి ఆయా వర్గాల ప్రయోజనాలను పరిరక్షించేందుకే కృషి చేస్తున్నాయి. కొన్ని పత్రికలు మాత్రమే సమాజ హితం కోసం, సమాజంలో అత్యధిక సంఖ్యలో వున్న జన సామాన్యం హక్కుల పరిరక్షణ కోసం కృషి చేస్తూ ఏటికి ఎదురీదుతున్నాయి. రెండవ కోవకు చెందినదే మన "ఐక్య ఉపాధ్యాయ". కేవలం ఉపాధ్యాయుల సర్వీస్ సమస్యలకే పరిమితంగాకుండా వారిలో సామాజిక స్పృహను, శాస్త్రీయ ఆలోచనను కలిగించేందుకు కృషి చేస్తున్న ఏకైక పత్రిక మన ఐక్య ఉపాధ్యాయ. వర్తమాన విద్యారంగంతో పాటు, సామాజిక, ఆర్థిక రంగాలలో వస్తున్న ప్రమాదకర పరిణామాలను నిశితంగా పరిశీలించి, అందుకు కారణాలను విశ్లేషించి, ప్రతిఘటించేందుకు అవసరమైన చైతన్యాన్ని ఉపాధ్యాయులకు కలిగించే ప్రయత్నం చేస్తున్నది.

మన సంఘం ఆవిర్భవించిన 4 నెలలకే అధికార వాణిగా ఐక్య ఉపాధ్యాయను 1975 జనవరిలో అమరజీవి మైనేని వెంకటరత్నం ప్రధాన సంపాదకత్వంలో అమరజీవి అప్పారి వెంకటస్వామి మార్గదర్శ కత్వంలో ప్రారంభమైంది. సంఘ సభ్యత్వంతో పాటు పత్రిక సర్కులేషన్‌ను క్రమంగా పెంచుకుంటూ రాష్ట్రంలో అత్యధిక సర్క్యులేషన్ కలిగిన విద్యా విషయక మాస పత్రికగా ఎదిగింది. సంఘ అభివృద్ధికి, ఉపాధ్యాయులలో సామాజిక చైతన్యం పెంపొందించడానికి అవిరళమైన కృషి చేస్తున్నది. 2007 మే 14,15 తేదీలలో విజయవాడలో నిర్వహించబడిన రాష్ట్ర 10వ మహాసభల అనంతరం జూన్ 7,8 తేదీలలో హైదరాబాద్‌లో నిర్వహించబడిన రాష్ట్ర కార్యవర్గ సమావేశంలో సిహెచ్. రవి ప్రధాన సంపాదకునిగా, ఐ. వెంకటేశ్వర రావు, ఎం. సంయుక్త, ఎ.వి. సత్యనారాయణ, ఆర్.నరసింహాచారి సభ్యులుగా నూతన సంపాదక వర్గం నామినేట్ చేయబడింది. వీరందరూ తమ తమ స్థాయిలో పత్రిక నిర్వహణలో భాగం పంచుకున్నారు. మహాసభ అనంతరం 2007 మే, జూన్ నెలలకు కలిపి ఒకే సంచికతో సహా, 2009 ఫిబ్రవరి వరకు మొత్తం 21 సంచికలు వెలువడినవి. ఈ సంచికలలోని శీర్షికలను పరిశీలించుదాము.

1. **ముఖచిత్రాలు** ఉపాధ్యాయ ఉద్యమ పోరాట దృశ్యాలు, ఫోటోలను, కార్టూన్లు, ఇలస్ట్రేషన్లను సందర్భానుసారంగా ప్రచురించబడినవి....

ఇటీవలి కాలంలో పత్రిక కోసం ప్రత్యేకంగా వేయిస్తున్న ముఖ చిత్రాలు ఆకర్షణీయంగా వుంటూ పత్రికకే హైలైట్‌గా వుంటున్నాయని పలువురు ప్రశంసిస్తున్నారు.

**సంపాదకీయాలు** ప్రతి నెలా ఉపాధ్యాయ ఉద్యమం లేదా వర్తమాన సామాజిక అంశాలపై సంపాదకీయాలు ప్రచురించబడినవి. జూన్ నెలల పత్రికలో ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణ కోసం యుటిఎఫ్ చేపట్టిన విద్యారక్షణ ఉద్యమాన్ని వివరిస్తూ విద్యారంగ పరిరక్షణకు ఉద్యమిద్దాం అని, జులై నెలలో సర్వీసు రూల్స్ సంక్షోభాన్ని, ఆగస్ట్‌లో యుటిఎఫ్ దినోత్సవంను పురస్కరించుకొని వృత్తి ధర్మాన్ని కాపాడుకుందామని, అక్టోబర్‌లో గ్రామీణ గురుకులాలలను ప్రభుత్వమే నెలకొల్పాల్సిన అవసరాన్ని, నవంబర్‌లో ప్రభుత్వ విద్యారంగానికి ఎదురౌతున్న ముప్పును, ఏప్రిల్‌లో ఏం కొనేటట్టులేదు-ఏం దినేటట్టులేదు అంటూ ధరల పెరుగుదల ప్రభావాన్ని, మే లో అమెరికన్ పాలకుల దుష్ప్రచారాన్ని ఖండించండి అంటూ ఎవరు ఎక్కువగా తింటున్నారో గణాంకాలతో సహా వివరించాము. అక్టోబర్‌లో ఎక్కడమ్మా నీకు రక్షణ? అంటూ మహిళలపై జరుగుతున్న దాడులను ఖండించాము, నవంబర్‌లో ఉపాధ్యాయుల చారిత్రాత్మక సమ్మె జరిగిన తీరును, ఉపాధ్యాయుల పోరాట పటిమను అభినందిస్తూ ప్రభుత్వ వైఖరిని ఎండగట్టాము. డిసెంబర్‌లో చెన్నుపాటి వారసత్వం కొనసాగించుదాం అంటూ సమ్మె అనంతర పరిణామాలలో ప్రభుత్వ వైఖరిని అర్థం చేసుకోవడంలో ఇతర సంఘాల వైఫల్యాన్ని ఎండగట్టాము. ఫిబ్రవరిలో ప్రమోషన్లతే ఇచ్చారు కానీ..... బదిలీలు జరపకపోవడం, పోస్టులు రద్దు చేయడం, పదోన్నతుల నిర్వహణలో ప్రభుత్వ నిర్లక్ష్యం, అధికారుల అలసత్వం తదితర అంశాలను విమర్శనాత్మకంగా వివరించనైనది. సంపాదకీయాలు సందర్భోచితంగా ఉంటున్నాయని, మరింత పదునైన పదజాలం వాడాలని కొందరు పాఠకుల అభిప్రాయంగా వుంటున్నది.

**వ్యాసాలు** విద్యారంగం, ఆర్థిక, సామాజిక అంశాలకు సంబంధించిన వ్యాసాలను ప్రత్యేకంగా ఐక్య ఉపాధ్యాయ కొరకు వ్రాయిస్తున్నాము. అవసరాన్ని బట్టి ముఖ్యమైన వ్యాసాలను ఆంగ్ల పత్రికలలో వచ్చిన వాటిని అనువదించి మన పత్రిక ద్వారా పాఠకులకు అందిస్తున్నాము. నూతన రచయితలు పంపిన వ్యాసాలు కూడా సమాచారవంతంగా వుంటే ప్రచురిస్తున్నాము.

**నియమనిబంధనలు** సర్వీసు నిబంధనలు, ఆదాయం పన్ను ఎల్‌టిసి, వేతన స్థిరీకరణ నియామకాలు, సెలవు నిబంధనలు, సమాచార హక్కు చట్టం మెడికల్ రీయింబర్స్‌మెంట్ తదితర సర్వీసు విషయాలపై వ్యాసాలు ప్రచురించబడినవి.

**పరిశోధనా వ్యాసం** కృష్ణా జిల్లా గన్నవరం మండలం ముస్తాబాద్‌కు చెందిన శ్రీనివాస్ "ప్రభావ వర్గాలు" అనే అంశంపై యుటియఫ్‌ను పరిశోధక అంశంగా ఎంచుకొని పరిశోధనా వ్యాసాన్ని సమర్పించి ఎంఫిల్ పట్టాను పొందారు. ఆ వ్యాసాన్ని వరంగల్ జిల్లా యుటియఫ్ కార్యకర్తలు డి. కిరణ్ కుమార్, డి. నవీన్ కుమార్‌లు అనువదించగా ఐక్య ఉపాధ్యాయలో 4 నెలల పాటు ధారా వాహికగా ప్రచురించాము.

**కథలు - గేయాలు**

ఐక్య ఉపాధ్యాయ పత్రికను సర్వజనామోదంగా తీర్చిదిద్దాలనే ఉద్దేశ్యంతో సందేశాత్మక కథలు, కవితలను తరచుగా ప్రచురించడం జరిగింది. గత కాలంలో 11 కథలు, పలు కవితలు ప్రచురించబడినవి.

**కథలు - కవితలు పోటీ**

ఔత్సాహిక రచయితలను ప్రోత్సహించడానికి, సృజనాత్మక, అభ్యుదయ సాహిత్యాన్ని పాఠకులకు అందించడం కోసం 2008 జూన్, జులై నెలల్లో కథలు – కవితలు పోటీని నిర్వహించాము. సాహితీ స్రవంతి రాష్ట్ర కేంద్రం సహకారంతో రచనలను పరిశీలించి బహుమతులకు ఎంపిక చేయనైనది. బహుమతి పొందిన కథలు, కవితలు పత్రికలో ప్రచురించబడినవి. మిగిలిన వాటిలో ప్రచురణార్హమైన వాటిని వీలును బట్టి ప్రచురించవలసి వుంది.

**విద్యావీక్షణం** విద్యారంగంలో వస్తున్న పరిణామాలను గమనించి విశ్లేషించి ఈ శీర్షిక ద్వారా పాఠకులకు అందజేస్తున్నాము. రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఎన్. నారాయణ నిర్వహిస్తున్నారు.

**ప్రశ్నోత్తరాలు** ఈ శీర్షికను క్రమం తప్పకుండా నిర్వహిస్తున్నాము. సర్వీసు విషయాలపై పాఠకులు అడిగే సందేహాలకు రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు సమాధానాలను ఇస్తున్నారు.

**వార్తా ప్రపంచం** విశ్వవ్యాప్త అభ్యుదయ ఉద్యమ విశేషాలు, జాతీయ, రాష్ట్ర విద్యారంగం, సామాజిక రంగంలో ఆసక్తికరమైన, తెలుసుకోవలసిన విషయాలను సేకరించి ఈ శీర్షిక ద్వారా సంక్షిప్తంగా అందజేస్తున్నాము. శీర్షిక నిర్వహణకు ఎ.వి. సత్యనారాయణ సహకరిస్తున్నారు.

**పాఠకుల అభిప్రాయాలు** ఇటీవల కాలంలో ఈ శీర్షిక ప్రాధాన్యతను కోల్పోయింది. పాఠకుల నుండి స్పందన కరువైంది. ఫోన్ ద్వారా లేదా మౌఖికంగా పత్రికపై అభిప్రాయం తెలియజేస్తున్నారు కానీ, లేఖల ద్వారా లేదా ఎస్ఎంఎస్‌ల ద్వారా అభిప్రాయాలను తెలియజేయడం లేదు.

**ఇంటర్వ్యూలు** విద్యారంగం, సామాజిక అంశాలపై ప్రముఖ వ్యక్తుల అభిప్రాయాలను ప్రశ్నలు-జవాబుల రూపంలో ఇంటర్వ్యూ శీర్షిక ద్వారా ప్రచురించనైనది.

**మనలోమనం** శీర్షికను పునరుద్ధరించాము. యుటిఎఫ్ ఖమ్మం జిల్లా సీనియర్ నాయకులు కె. శ్రీనివాసులు "నాయకులెలావుండాలి" అంటూ నాయకుల ప్రవర్తనా,

వ్యవహార సరళిపై విమర్శనాత్మక వ్యాసాలు వ్రాస్తున్నారు.

**ఇతర శీర్షికలు** సంపాదక లేఖలు, మండలి ముచ్చట్లు, మనము - మన ఆరోగ్యం, పరిశోధన, ఆవేదన - నివేదన తదితర శీర్షికల క్రింద లభ్యతను బట్టి వివిధ అంశాలను ప్రచురించడం జరిగింది.

ప్రభుత్వం విడుదల చేసిన ముఖ్యమైన జి.ఓలను ముద్రిస్తూ వాటిపై తెలుగులో వివరణను, యుటిఎఫ్ వైఖరిని కూడా ప్రత్యేక వార్తలుగా ప్రచురించాము. రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన కార్యక్రమాలతో పాటు, జిల్లా మండల శాఖలు, జెఏసి, జాక్టో నిర్వహించిన ఉద్యమాలు, సమావేశాలు, కార్యక్రమాలపై అందిన వార్తలను ఉద్యమ వార్తలు శీర్షిక ద్వారా పాఠకులకు అందజేశాము. సంబంధిత ఫోటోలను నాణ్యత, అందిన సమయాన్ని బట్టి కవర్ పేజిపై రంగులలోను లేదా నలుపు, తెలుపులలో లోపలి పేజీల్లోను ముద్రించనైనది. సంఘానికి, పత్రికకు విరాళాలిచ్చిన దాతల ఫోటోలను పత్రిక 3వ కవర్ పేజీపై ముద్రించనైనది.

**సర్క్యులేషన్** పత్రికలోని వ్యాసాలు, శీర్షికలు, వార్తలు, వాటిని ప్రచురించడంలో సంపాదకవర్గం తీసుకుంటున్న శ్రద్ధ మన పత్రికను అగ్రగామి పత్రికగా నిలుపుతున్నాయనడంలో సందేహం లేదు. అయితే ఆ మేరకు ఉపాధ్యాయ బాహుళ్యంలోనికి విస్తృతంగా పత్రికను తీసుకెళ్ళడంలో విఫలమౌతున్నాము. పత్రికా కార్యాలయంలో సిబ్బంది కొరత, చిరునామాల ముద్రణలో అచ్చుతప్పులు, పోస్టల్ మిస్సింగ్ తదితర కారణాల వల్ల పత్రిక చేరటం లేదనే పిర్యాదులను పూర్తిగా నిరోధించలేకపోతున్నాము. పిర్యాదులను గతంకంటే కొంత తగ్గించగలిగాము. అయినప్పటికీ చందాల పెంపుదలకు పత్రిక మిస్సింగే ప్రధాన ఆటంకంగా చూపుతున్నారు. అయితే నిబంధనావళి ప్రకారం అన్ని స్థాయిలలో ఆఫీస్ బేరర్లుగా ఎన్నికైన కార్యకర్తలందరూ పత్రిక చందాదారులు కావాలి. కాని చాలా మండల శాఖలు, కొన్ని జిల్లా శాఖలు కూడా ఈ నిబంధనను పట్టించుకోవటం లేదు. పత్రిక క్యాంపెయిన్‌పై సరైన దృష్టి పెట్టకపోవటం వల్లనే మనం రాష్ట్ర మహాసభలో నిర్ణయించుకున్న విధంగా మొత్తం సభ్యత్వంలో కనీసం 5వ వంతు పత్రిక చందాలు చేర్పించడంలో విఫలమైనాము. ప్రస్తుతం పత్రిక సర్క్యులేషన్ వార్షిక 10,933, దశాబ్ది 3540 జీవిత 739 వెరశి మొత్తం చందాలు 15,212. ఇవి కాక కాంప్లిమెంటరీలు 310, దశాబ్ది గ్రూప్‌లలో 258 ఉన్నాయి. నెల్లూరు జిల్లా నుండి 2000 వార్షిక చందాలు రావాల్సి వున్నాయి. ప్రస్తుతం యుటియఫ్ సభ్యత్వంతో పత్రిక చందాలను పోల్చి చూస్తే (6:1) ప్రతి 6గురు సభ్యులకు ఒక పత్రిక చొప్పున, రాష్ట్రంలోని మొత్తం ఉపాధ్యాయుల సంఖ్యతో పోల్చితే (16:1) ప్రతి 16 మంది ఉపాధ్యాయులకు ఒక పత్రిక చొప్పున మన పత్రిక సర్క్యులేషన్ ఉన్నది. జిల్లాల వారీగా ఖమ్మం (3:1), నల్లగొండ (4:1), మహబూబ్ నగర్ (4:1), హైదరాబాద్ (4:1), తూర్పుగోదావరి (5:1), ప్రకాశం (5:1), వరంగల్ (5:1) జిల్లాలు మాత్రమే మన గత మహాసభ నిర్ణయించిన లక్ష్యాన్ని (5:1ని) చేరుకున్నాయి / అధిగమించాయి. నెల్లూరు జిల్లా నుండి రావలసిన 2000 వార్షిక చందాలు వస్తే ఆ జిల్లా 2.7:1 నిష్పత్తిలో అన్ని జిల్లాలకంటే అగ్రస్థానంలో నిలుస్తుంది. జిల్లాల వారీ మూడు సంవత్సరాల సర్క్యులేషన్ వివరాలు అనుబంధంలోని పట్టికలో యివ్వబడినవి.

**దశాబ్ది చందాలు** రు. 500/-లకు 10 సం॥ల పాటు పత్రిక అందజేసే విధంగా దశాబ్ది చందా పథకాన్ని 2006 జనవరిలో ప్రారంభించాము. ఇప్పటి వరకు 3540 చందాలు చేర్పించబడినవి. దశాబ్ది చందాలు ఐదుగురు కలిసి గ్రూపుగా ఐదు వాయిదాలలో చెల్లించే అవకాశం కల్పించబడింది. కార్యకర్తల కోరిక మేరకు స్కీమును ఇంకా కొనసాగిస్తున్నాము. 642 చందాలతో తూర్పుగోదావరి జిల్లా మొదటి స్థానంలోను, 623 చందాలతో ఖమ్మం జిల్లా రెండవ స్థానంలోను, 575 చందాలతో పశ్చిమగోదావరి జిల్లా మూడవ స్థానంలోను వున్నవి. సర్క్యులేషన్ స్థిరంగా వుండాలంటే అన్ని జిల్లాలు దశాబ్ది చందాలపై ప్రత్యేక శ్రద్ధ పెట్టి చేర్పించాలి.

**క్యాంపైన్లు - ఫలితాలు** పట్టిక

**యాడ్స్ (ప్రకటనలు)** పత్రిక న్యూస్ ప్రింట్, ముద్రణా ఖర్చులు భారీగా పెరిగాయి. వాటిని తట్టుకుంటూ పత్రికా కార్యాలయాన్ని పరిపుష్టం చేసుకోవడం, ఆధునిక సౌకర్యాలను సమకూర్చుకోవడంతో పాటు అదనపు ఆకర్షణతో పత్రికను ముద్రించడానికి అవుతున్న ఖర్చులను భరించడం యిప్పుడున్న చందాలతో సాధ్యం కాదు. పత్రిక ఆర్థిక యిబ్బందులకు లోనుకాకుండా, స్వయం సమృద్ధితో నిర్వహింపబడాలంటే సర్క్యులేషన్‌నైనా పెంచుకోవాలి లేదా వ్యాపార ప్రకటనల ద్వారా అదనపు ఆదాయమైనా రాబట్టుకోవాలి. గత 22 నెలల కాలంలో పత్రికకు వచ్చిన యాడ్స్ జిల్లాల వారీగా ఈ విధంగా వున్నాయి.

| | కలర్ | బ్లాక్ & వైట్ |
|---|---|---|
| ఖమ్మం | 1/2 | $1\frac{1}{2}$ |
| చిత్తూరు | 1/2 | - |
| మహబూబ్‌నగర్ | 1 | - |
| అనంతపురం | - | 1/4 |
| తూర్పుగోదావరి | 1/2 | - |
| సెంటర్ | 6 | $1\frac{3}{4}$ |

ప్రతి జిల్లాశాఖ సంవత్సరంలో కనీసం 2 పేజీల ప్రకటనలు సేకరించి పంపాలన్న కార్యవర్గ నిర్ణయాన్ని ఖమ్మం జిల్లాశాఖ మాత్రమే అమలు పరిచింది. ఇంకా మహబూబ్‌నగర్, చిత్తూరు, తూర్పుగోదావరి, అనంతపురం జిల్లాలు మినహా మిగిలిన జిల్లా శాఖలు యాడ్స్ కొరకు ఏ మాత్రం కృషి చేయకపోవడం విచారకరం.

**ఆర్థిక పరిస్థితి** గత 21 నెలల కాలంలో పత్రిక నిర్వహణ ఖర్చు రు. 20,67,636/-లు సగటున నెలకు రు.98,500/-లు. దశాబ్ది చందాలు మినహాయించి మొత్తం ఆదాయం రు. 17,43,682/-లు సగటున నెలకు ఆదాయం రు. 83,032/-లు అంటే నెలకు సుమారు రు. 15,468/-లు లోటు వుంటున్నది. దశాబ్ది చందాల ఫిక్స్‌డ్ డిపాజిట్స్‌పై వచ్చే వడ్డీని ఏ నెలకు ఆ నెల తీసుకుంటే తప్ప ఈ లోటు భర్తీ అయ్యే పరిస్థితి కనపడటం లేదు. ఆర్థిక పరిస్థితి మెరుగు పడాలంటే తప్పనిసరిగా పత్రికలో ప్రతి నెల రెండు పేజీల యాడ్స్ వేయాలి. సర్క్యులేషన్ 20వేలకు పై బడి పెంచుకోవాలి. లేదంటే చందా మొత్తాన్ని పెంచడం మినహా గత్యంతరం లేదు.

**విరాళాలు** ఉద్యోగ విరమణ, వివాహము, పుట్టిన రోజులు, గృహ ప్రవేశాలు, వర్ధంతులు తదితర సందర్భాలను పురస్కరించుకొని పత్రికకు విరాళాలు సేకరించి పంపే సాంప్రదాయం గతంలో బాగా వుండేది. క్రమంగా తగ్గిపోతున్నది. పత్రికకు కనీసం రు. 500/- విరాళం యిస్తే వారి ఫోటోను పత్రికలో ప్రచురించి అభినందనలు తెలియజేస్తున్నాము. ప్రతి నెల పలువురు ఉపాధ్యాయులు రిటైరవుతున్నారు. వేల రూపాయలు ఖర్చు పెట్టి ఫంక్షన్లు చేసుకుంటున్నారు. కనుక ఫంక్షన్లకు హాజరయ్యే కార్యకర్తలు పత్రికకు విరాళాల సేకరణపై కూడా దృష్టి పెట్టాలని లోగడ సూచించాము. పరిమితంగానే (రు.39,545లు) విరాళాలు వచ్చినవి. దివంగత యుటియఫ్ సీనియర్ నాయకులు పారుపల్లి సత్యనారాయణ గారి జ్ఞాపకార్థం వారి కుటుంబ సభ్యులు ఐక్య ఉపాధ్యాయకు ఎల్.జి. ఫ్లాట్రాన్ కలర్ టి.వి.ని బహూకరించారు. దాతలందరికీ ధన్యవాదములు.

**కృతజ్ఞతలు** పత్రిక కవర్ పేజీ డిజైన్‌లో సహకరించిన చిత్రకారులు కె. ఆనందా చారి (యుటిఎఫ్ కార్యకర్త, ఖమ్మం), కరుణాకర్ (కార్టూనిస్ట్), యం. గణేష్ (డిజైనర్), బసవేశ్వరరావు, మధు (డిజైనర్స్ ప్రజాశక్తి), ఫోటోలను తీసి ఉచితంగా అందజేసిన హరిబాబు, రమణ (ప్రజాశక్తి ఫోటోగ్రాఫర్స్), ఎడిటింగ్, ప్రూఫ్ రీడింగ్‌లో సహకరించిన ఆర్. విక్రం (ఖమ్మం), డి.మస్తాన్‌రావు, కథలు-కవితల పోటీలకు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించిన సాహితీ స్రవంతి రాష్ట్ర కేంద్రం బాధ్యులకు, వ్యాసకర్తలకు, రచయితలకు, అనువాదకులకు, కార్యాలయ సిబ్బందికి, సర్క్యులేషన్ పెంపుదలకు సహకరిస్తున్న నాయకులు, కార్యకర్తలందరికీ, ఇంకా పత్రికా నిర్వహణలో ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకారం అందిస్తున్న ప్రతి ఒక్కరికీ పేరు పేరున సంపాదక వర్గం పక్షాన కృతజ్ఞతలు తెలియజేయుచున్నాము.

**ముగింపు** పత్రికను కార్యకర్తల, పాఠకుల మనోభావాలకనుగుణంగా తీసుకురావడంలో కొంత వరకు విజయం సాధించామని సంతృప్తి చెందుతున్నాం. అయితే సమరశీల పోరాట సంస్థ యుటియఫ్ అధికార వాణిగా పత్రికను మరింత పదునెక్కించాల్సిన అవసరం ఉన్నదని భావిస్తున్నాము. అందుకు రాష్ట్ర మహాసభ ప్రతినిధులందరి సహకారం అవసరం. పత్రికా నిర్వహణను కూడా సంఘ కార్యకలాపాల్లో ఒకటిగానే భావించి తగిన ప్రాధాన్యత యిస్తారని ఆశిస్తున్నాము. మన ఉద్యమ వాణిని దశదిశలా విస్తరింపజేద్దాం.

**ఉద్యమాభివందనములతో**

**సంపాదక వర్గం పక్షాన**

Ch. Ravi

**(సిహెచ్.రవి)**, ప్రధాన సంపాదకులు

# ఐక్య ఉపాధ్యాయ సర్క్యులేషన్

| క.సం. | జిల్లా | 2007 మే | | | | 2008 జనవరి | | | | 2009 ఫిబ్రవరి | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వార్షిక | దశాబ్ది | జీవిత | మొత్తం | వార్షిక | దశాబ్ది | జీవిత | మొత్తం | వార్షిక | దశాబ్ది | జీవిత | మొత్తం |
| 1. | శ్రీకాకుళం | 279 | 09 | 03 | 291 | 256 | 11 | 03 | 270 | 262 | 14 | 02 | 278 |
| 2. | విజయనగరం | 201 | 03 | 01 | 205 | 123 | 09 | 01 | 133 | 186 | 23 | - | 209 |
| 3. | విశాఖపట్నం | 153 | 05 | 10 | 168 | 166 | 12 | 01 | 179 | 189 | 21 | 10 | 220 |
| 4. | తూర్పుగోదావరి | 1361 | 144 | 250 | 1755 | 1238 | 379 | 236 | 1853 | 1,339 | 642 | 207 | 2188 |
| 5. | పశ్చిమగోదావరి | 445 | 360 | 215 | 1020 | 676 | 413 | 250 | 1339 | 586 | 575 | 79 | 1240 |
| 6. | కృష్ణ | 568 | 137 | 92 | 797 | 689 | 161 | 95 | 945 | 511 | 240 | 64 | 815 |
| 7. | గుంటూరు | 626 | 132 | 74 | 832 | 722 | 221 | 80 | 1023 | 664 | 299 | 27 | 990 |
| 8. | ప్రకాశం | 710 | 120 | 166 | 996 | 1060 | 151 | 157 | 1368 | 1,678 | 215 | 44 | 1937 |
| 9. | నెల్లూరు | 2802 | 27 | 86 | 2915 | 2880 | 35 | 63 | 2978 | 606 | 41 | 82 | 729 |
| 10. | చిత్తూరు | 285 | 21 | 15 | 321 | 324 | 28 | 17 | 369 | 341 | 30 | 15 | 386 |
| 11. | కడప | 60 | 05 | 03 | 68 | 92 | 10 | 04 | 106 | 109 | 14 | 03 | 126 |
| 12. | కర్నూలు | 421 | 06 | 08 | 435 | 353 | 07 | 08 | 368 | 364 | 09 | 01 | 374 |
| 13. | అనంతపురం | 248 | 25 | 06 | 279 | 227 | 32 | 08 | 267 | 203 | 54 | 04 | 261 |
| 14. | ఖమ్మం | 992 | 393 | 72 | 1457 | 657 | 478 | 65 | 1200 | 1,078 | 623 | 64 | 1765 |
| 15. | వరంగల్ | 476 | 26 | 14 | 516 | 464 | 47 | 15 | 526 | 356 | 96 | 14 | 466 |
| 16. | కరీంనగర్ | 148 | 13 | 27 | 188 | 149 | 17 | 14 | 180 | 129 | 22 | 04 | 155 |
| 17. | అదిలాబాద్ | 263 | 39 | 34 | 336 | 242 | 61 | 30 | 333 | 187 | 88 | 21 | 296 |
| 18. | ఎం.నగర్ | 295 | 76 | 62 | 433 | 278 | 97 | 63 | 438 | 314 | 124 | 47 | 485 |
| 19. | నల్లగొండ | 1242 | 93 | 53 | 1388 | 1128 | 130 | 68 | 1326 | 993 | 201 | 10 | 1204 |
| 20. | నిజామాబాద్ | 69 | 09 | 14 | 92 | 24 | 13 | 14 | 51 | 29 | 18 | 09 | 56 |
| 21. | మెదక్ | 162 | - | 09 | 171 | 152 | - | 04 | 156 | 177 | 02 | 04 | 183 |
| 22. | రంగారెడ్డి | 117 | 16 | 04 | 137 | 233 | 34 | 03 | 270 | 273 | 49 | 01 | 323 |
| 23. | హైదరాబాద్ | 225 | 63 | 09 | 297 | 363 | 118 | 28 | 509 | 358 | 140 | 27 | 525 |
| | ఇతరములు | - | - | - | - | 01 | - | - | 01 | 2,001 | - | - | 2,001 |
| | | 12,148 | 1,722 | 1,227 | 15,097 | 12,497 | 2,464 | 1,227 | 16,188 | 12,933 | 3,540 | 739 | 17,212 |

# రాష్ట్ర మహాసభ ఆమోదించిన ముఖ్యమైన తీర్మానాలు

**1) భాషా పండితుల,వ్యాయామోపాధ్యాయ పోస్టులను అప్‌గ్రేడ్ చేయాలి.**

ఉన్నత పాఠశాలల్లో భాషాపండితుల, వ్యాయామోపాధ్యాయ పోస్టులను కేటగిరీ 2 పోస్టులుగా అప్‌గ్రేడ్ చేస్తామని ప్రభుత్వం ఉపాధ్యాయ సంఘాలకు హామీ యిస్తూ వచ్చింది. అయితే 2008 నవంబర్ 10న విడుదల చేసిన ప్రభుత్వ ఉత్తర్వులు 363 నందు హైస్కూళ్లలో 15,554 సెకండరీ గ్రేడ్ టీచరు పోస్టులను మాత్రమే స్కూలు అసిస్టెంట్ కేడర్‌గా అప్‌గ్రేడ్ చేసింది. సక్సెస్ ఉన్నత పాఠశాలల కోసం 12,210 స్కూల్ అసిస్టెంట్ పోస్టులను కొత్తగా మంజూరు చేసింది. ఆ పోస్టులు భాషాపండితులు పి.ఇ.టి. మినహా ఇతర సబ్జెక్టులకే కేటాయించారు. భాషాపండితులు 3555, వ్యాయామ ఉపాధ్యాయులు 2206 పోస్టులు కొత్తగా మంజూరు చేసినప్పటికీ కేటగిరి 3 పోస్టులుగానే మంజూరు చేసారు. పండితులకు వ్యాయామ ఉపాధ్యాయులకు న్యాయం చేస్తామని పలుమార్లు హామీయిచ్చి అందుకు భిన్నంగా అప్‌గ్రేడేషన్ ఉత్తర్వులు యిచ్చారు.

ఇటీవల రాష్ట్ర వ్యాప్తంగా వేలాది మంది ఉపాధ్యాయులు తమ సబ్జెక్టులలో పదోన్నతులు పొందగా భాషాపండితులు, వ్యాయామ ఉపాధ్యాయులు నిరాశనిస్పృహలకు లోనయ్యారు. భాషాపండితులు, వ్యాయామ ఉపాధ్యాయుల పోస్టులు కూడా స్కూల్ అసిస్టెంట్ కేడర్‌గా అప్‌గ్రేడ్ చేసి ప్రమోషన్లు యివ్వాలి.

**2) మున్సిపల్ సక్సెస్ పాఠశాలలకు స్కూల్ అసిస్టెంట్ పోస్టులు మంజూరు చేయాలి.**

రాష్ట్ర ప్రభుత్వం, ప్రభుత్వ, జిల్లా పరిషత్, మున్సిపల్ యాజమాన్యాలలో గల ఉన్నత పాఠశాలలో 6500 పాఠశాలలను సక్సెస్ స్కీమ్‌లో భాగంగా అన్ని సౌకర్యాలతో (బోధన సిబ్బంది, మౌలిక వసతులు) అభివృద్ధి చేస్తామని ప్రకటించింది. సక్సెస్ ఉన్నత పాఠశాలలుగా గుర్తించిన పాఠశాలల్లో అన్ని స్కూల్ అసిస్టెంట్ కేడర్ పోస్టులే ఉండాలి. ఆ మేరకు ఆ పాఠశాలల్లో యిప్పటికే ఉన్న కేటగిరీ 3 పోస్టులను కేటగిరి 2 పోస్టులుగా అప్‌గ్రేడ్ చేయాలి. అదే విధంగా ప్యాట్రన్ ప్రకారం ఉండాల్సిన కేటగిరి 2 పోస్టులు కొత్తగా మంజూరు చేయాలి. అయితే మున్సిపాలిటీలలో 2000 తర్వాత డిఎస్‌సి జరగ నందున ఖాళీ పోస్టులు ఖాళీగానే ఉండిపోయాయి. 2008 డిఎస్‌సిలో మున్సిపల్ పాఠశాలల్లో వేకెన్సీలు భర్తీ చేయాలని శాసనమండలిలో పిడిఎఫ్ సభ్యులు, ఉపాధ్యాయ సంఘాల ద్వారా తీవ్రమైన వత్తిడి తీసుకురావడంలో కేవలం వేకెన్సీ పోస్టులు మాత్రమే డిఎస్‌సి 2008లో ప్రకటించారు. అయితే మున్సిపల్ సక్సెస్ పాఠశాలల్లో కేటగిరి 3 పోస్టుల అప్‌గ్రేడేషన్ చేయలేదు. మున్సిపల్ సక్సెస్ పాఠశాలలకు అవసరమైన పోస్టులు మంజూరు చేయలేదు. మున్సిపల్ సక్సెస్ పాఠశాలలకు అవసరమైన కేటగిరి 2 పోస్టులు మంజూరు చేయాలి.

**3) ఎస్‌సి, ఎస్‌టి, బిసి ఉపాధ్యాయుల స్పెషల్ విద్యావాలంటీర్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలి.**

పాఠశాల విద్యాశాఖలో బ్యాక్‌లాగ్ పోస్టుల భర్తీ కోసం డిఎస్‌సి 2002(అన్‌ట్రైన్డ్) ద్వారా దాదాపు 10 వేలమంది ఎస్‌సి, ఎస్‌టి, బిసి, పిహెచ్‌సి అభ్యర్థులను సెలక్ట్ చేశారు. కానీ వారిని రెగ్యులర్ నియామకాలు చెయ్యకుండా స్పెషల్ విద్యావాలంటీర్‌లుగా అపాయింట్ చెయ్యటంలోనే ప్రభుత్వం వివక్షత చూపింది. రిజర్వ్‌డ్ పోస్టులకు ట్రైన్డ్ అభ్యర్థులు అవసరమైనంతమంది లేనప్పుడు అన్‌ట్రైన్డ్ వారిని అపాయింట్ చెయ్యటం, వారికి ప్రభుత్వమే ఇన్‌సర్వీస్ ట్రైనింగ్ యిప్పించటం, అన్‌ట్రైన్డ్ పీరియడ్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వటం అనేది అమల్లో వున్న విధానం. అది సామాజిక న్యాయానికి సంబంధించిన విషయం. కానీ డిఎస్‌సి 2002 (అన్‌ట్రైన్డ్) వారి విషయంలో ప్రభుత్వం అందుకు భిన్నంగా వ్యవహరించింది.

ఇటీవల జి.ఓ. 2 ద్వారా ఉపాధ్యాయుల అప్రెంటిస్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు యిచ్చిన ప్రభుత్వం స్పెషల్ విద్యావాలంటీర్‌ల సర్వీస్‌ని మాత్రం వదిలివేసింది. ఈ వివక్షత వలన సదరు ఉపాధ్యాయులకు తీవ్రమైన అన్యాయం జరిగింది. స్పెషల్ విద్యావాలంటీర్‌ల సర్వీస్‌ని అప్రెంటిస్ సర్వీస్‌గా పరిగణించాలి. సదరు అన్‌ట్రైన్డ్, అప్రెంటిస్ సర్వీస్‌కి నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయాలి. ఆ విధంగా ఎస్‌సి, ఎస్‌టి, బిసి ఉపాధ్యాయులకు న్యాయం చేయాలి.

**4) ఎంఇఓ డిప్యూటీ డి.ఓ. పోస్టులు భర్తీ చేయాలి.**

రాష్ట్ర వ్యాప్తంగా సుమారు 450 ఎంఇఓ పోస్టులు, 50 వరకు డిప్యూటీ ఎడ్యూకేషన్ ఆఫీసర్ పోస్టులు ఖాళీగా వున్నాయి. దీని కారణంగా ప్రాథమిక మరియు ఉన్నత పాఠశాలల పై అజమాయిషి కొరవడింది.

ఈ నేపథ్యంలో ప్రస్తుతం ఖాళీగా వున్న ఎం.ఇ.ఓ. పోస్టులను దామాషా పద్ధతిలో పంచాయతీ రాజ్, గవర్నమెంట్ ఉపాధ్యాయులకు కేటాయించాలని ప్రతిపాదిస్తున్నాము. ఈ పోస్టులలోనికి ప్రస్తుతం ఉన్నత పాఠశాలల గెజిటెడ్ ప్రధానోపాధ్యాయులుగా పని చేయుచున్న వారిని సీనియారిటీ, సామర్థ్యం ఆధారంగా " అపాయింట్‌మెంట్ బై ట్రాన్స్‌ఫర్ " ద్వారా భర్తీ చేయాలని కోరుచున్నాము. అదేవిధంగా ఖాళీగా వున్న డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసర్ పోస్టులను ఫీడర్ కేటగిరి అయిన ప్రధానోపాధ్యాయుల సంఖ్య ఆధారంగా ప్రభుత్వ పంచాయతీరాజ్ విభాగాలకు దామాషా పద్ధతిలో కేటాయించి వారిలో ప్రమోషన్‌ల ద్వారా భర్తీ చేయాలి.

**5) ఉపాధ్యాయుల అప్రెంటీస్ 2 సంవత్సరాల సర్వీసును పెన్షన్‌కు లెక్కించాలి.**

జి.ఓ ఎం.ఎస్.నం.221 తేది. 16.07.94 ఉత్తర్వుల ద్వారా ఉపాధ్యాయ నియామకాలలో మొదటి సారిగా అప్రెంటీస్ విధానం ప్రవేశ పెట్టారు. ఈ జి.ఓ.కు ముందు జరిగిన నియామకాలన్నింటా జాయినింగ్ తేది నుండి టైం స్కేల్ చెల్లించారు. కాని అప్రెంటీస్ సర్వీస్‌కు రెండు సంవత్సరాలు స్టైఫండు చెల్లిస్తామని, సర్వీసును రెగ్యులరైజేషన్‌కు, ప్రొబేషన్ డిక్లరేషన్‌కు లెక్కించడం జరుగుతుందని ఉత్తర్వులలో పేర్కొన్నారు. కావున పెన్షన్‌కు ఈ సర్వీసు వర్తిస్తుందనే ఉపాధ్యాయులు భావిస్తూ వచ్చారు.

అయితే మెమో. 14403/Ser.-III-1/2006-2, తేది. 7.2.2007 ద్వారా అప్రెంటీస్ సర్వీస్ పెన్షన్‌కు లెక్కించబడదని విద్యాశాఖ కార్యదర్శి వివరణ యిచ్చారు. దీనితో యింతవరకు పెన్షన్‌కు ఈ సర్వీసు పరిగణించబడుతుందని ఆశించిన ఉపాధ్యాయులు దిగ్భ్రాంతి చెందారు.

ఈ ఉత్తర్వుల వలన 1994 నుండి 2002 జనవరి వరకు డిఎస్‌సిలలో నియామకమైన ఉపాధ్యాయులకు రెండు సంవత్సరాలు సర్వీసు పెన్షన్‌కు వర్తించకపోవడం జరుగుతుంది. రాష్ట్ర ప్రభుత్వం జి.ఓ.ఎం.ఎస్.నం. 653, ఆర్థిక, తేది. 22.09.2004 నుండి పాత పెన్షన్ విధానం రద్దు చేసి కాంట్రిబ్యూటరీ పెన్షన్ పథకం ప్రవేశ పెట్టింది. ఈ ఉత్తర్వుల వలన 2002 అక్టోబర్ రెగ్యులర్ అన్‌ట్రైన్డ్ డిఎస్‌సి 2003, 2006 డిఎస్‌సి. అభ్యర్థులకు అప్రెంటీసు సర్వీసు లెక్కించకపోవడం వల్ల పాత పెన్షన్ సౌకర్యం కోల్పోతున్నారు.

ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం అప్రెంటీస్ సర్వీస్‌కు నోషనల్ ఇంక్రిమెంట్లు అంగీకరించిన ఉత్తర్వులలో పెన్షన్ విషయం స్పష్టం చేయలేదు. అప్రెంటీస్ సర్వీస్ పెన్షకు అనుమతిస్తూ ఉత్తర్వులు యివ్వాలి.

**6) కాంట్రిబ్యూటరీ పెన్షన్ పథకాన్ని రద్దు చేయాలి.**

గత ఎన్‌డిఏ ప్రభుత్వం 1.1.2004 నుండి కాంట్రిబ్యూటరీ పెన్షన్ పథకాన్ని అమలులోనికి తీసుకు వచ్చింది. ఈ బిల్లు పార్లమెంటులో చట్టం కాకుండానే మన రాష్ట్ర ప్రభుత్వం అత్యుత్సాహంగా ఈ స్కీమును అమలు చేస్తున్నది. పశ్చిమ బెంగాల్, త్రిపుర రాష్ట్రాలు మాత్రము ఈ పథకాన్ని వ్యతిరేకించి ఉద్యోగుల పక్షం వహించాయి. కేరళలో కాంగ్రెస్ ఆధ్వర్యంలో యుడియఫ్ ప్రభుత్వం నూతన పెన్షన్ స్కీమ్‌ను తమ ఉద్యోగులకు అమలు చేయగా తర్వాత అధికారంలోకి వచ్చిన లెఫ్ట్‌ఫ్రంట్ ప్రభుత్వం నూతన పెన్షన్‌స్కీమును రద్దు చేసి పాత పెన్షన్‌ను ఉద్యోగులకు పునరుద్ధరిస్తూ ఉత్తర్వులు జారీ చేయడం అభినందనీయం.

రాష్ట్రంలో పెన్షనర్ల ప్రయోజనాలను కాపాడతామని అధికారంలోకి వచ్చిన

కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన వెంటనే రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల ,ఉపాధ్యాయులకు పాత పెన్షన్‌కు పాతరేసి చాలా అత్యుత్సాహంగా నూతన పెన్షన్ స్కీమును 1.9.2004 నుండి అమలు చేసే ఉత్తర్వులు తీసుకు వచ్చింది. దీని వల్ల ఉపాధ్యాయ రంగంలో అక్టోబర్ 2002 డిఎస్‌సి వారికి, ఆ తర్వాత నియామకమైన స్పెషల్ విద్యావాలంటీర్లు 2003, 2006 డిఎస్‌సి ఉపాధ్యాయులకు పాత పెన్షన్ వర్తించే పరిస్థితి లేకుండా పోయింది. వీరందరు తమ జీతాల నుండి పెన్షన్ కోసం జీతం డిఎలో 10 శాతం మినహాయించుకోవలసి వస్తుంది. రిటైరుమెంట్ తర్వాత వచ్చే పెన్షన్ కోసం ఉద్యోగంలో చేరినప్పటి నుండి తమ జీతం నుండి మినహాయించుకోవడం వలన ఆర్థికంగా నష్టపోతున్నారు. కావున రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులందరికీ పాత పెన్షన్ విధానాన్ని పునరుద్ధరించాలి.

**7) 2003 డిఎస్‌సి వారికి పాత పెన్షన్ విధానం వర్తింప చేయాలి**

డిఎస్‌సి 2003 ద్వారా 16వేల ఉపాధ్యాయుల నియామకానికి ప్రభుత్వం 2003 నవంబర్ 13న నోటిఫికేషన్ యిచ్చింది. 2004 ఏప్రిల్‌లో వ్రాతపరీక్ష జరిగింది. 2004 జూన్ 11 ఫలితాలు ప్రకటించారు. కోర్టు కేసులు కారణంగాను, సర్వీస్ రూల్స్ పేరుతో నియామకాలు సకాలంలో జరుపకుండా ప్రభుత్వం కాలయాపన చేసింది. 2005 ఆగస్టులో నియామకానికి మార్గదర్శకాలు యివ్వగా నవంబరు / డిసెంబరు నెలలో వీరి నియామకాలు జరిగాయి. ఈలోగా ప్రభుత్వం కాంట్రిబ్యూటరీ పెన్షన్ స్కీము 1.9.2004 నుండి అమలులోకి తెస్తూ ఉత్తర్వులు విడుదల చేసింది. దీనిలో ఈ ఉపాధ్యాయులు పాత పెన్షన్ సౌకర్యం కోల్పోయారు. డిఎస్‌సి నోటిఫికేషన్ బట్టి వీరికి పాత పెన్షన్ వర్తింప చేయాలి.

**8) 1990 తర్వాత నియామకమైన స్పెషల్ టీచర్లకు 8/16/24 సంIIల స్కేలు, పెన్షన్ వర్తింప చేయాలి**

జి.ఓ. 119 , తేది. 21.04.98 ద్వారా 1983-86 మధ్య జాయిన్ అయిన వారికి ఆ తదుపరి 1986-90 మధ్య జాయిన్ అయిన వారికి జి.ఓ.92, తేది. 8.8.2000 ద్వారా 8/16/24 స్కేలు మరియు పెన్షన్‌కు వర్తింప చేస్తూ ఉత్తర్వులు యిచ్చారు. వీరిలో రెగ్యులర్ వేకేన్సీలలో 1991లో నియామకమైన కొద్దిమందికి 8/16/24 వర్తింప చేస్తూ ఉత్తర్వులు రాలేదు. వీరికి కూడా 8/16/24 మరియు పెన్షన్‌కు లెక్కించే ఉత్తర్వులు యివ్వాలి.

**9) 610 జీ.ఓ. అమలులో భాగంగా బదిలీ అయిన ఉపాధ్యాయులకు టిటిఏలు చెల్లించాలి.**

**10) 610 జీ.ఓ.లో బదిలీ అయిన ఉపాధ్యాయులకు సూపర్‌న్యూమరీ పోస్టులు మంజూరు చేయాలి.**

610 జీ.ఓ. అమలులో భాగంగా సుమారు ఐదు వేల మంది ఉపాధ్యాయులను వారి స్వంత జిల్లాలకు రీపాట్రియేట్ చేశారు. హైదరాబాద్ జిల్లాకు మాత్రమే 40 సూపర్ న్యూమరీ పోస్టులు మంజూరు చేసారు. బదిలీల ఉత్తర్వులలో రీపాట్రియేట్ చేయబడిన సంఖ్యకు అనుగుణంగా సూపర్‌న్యూమరీ పోస్టులు మంజూరు చేయడం జరుగుతుందని చెప్పారు. వీరందరు వారి వారి స్వంత జిల్లాలలో ప్రస్తుతం ఉన్న వెకెన్సీలలో జాయిన్ అయ్యారు. కావున వీరి పోస్టులకు సమానంగా సూపర్‌న్యూమరీ పోస్టులు మంజూరు చేయాలి.

**11. ఎయిడెడ్ పాఠశాలల్లో ప్రమోషన్లు, నియామకాలపై నిషేధం ఎత్తివేయాలి**

ఎయిడెడ్ పాఠశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు పదోన్నతులు అవకాశాలను ఈ ప్రభుత్వం మెమో నం.8544/పిఎస్-1/2005, తేది. 22.08.2005 ద్వారా నిరవధికంగా 2005 నుండి నిలిపివేసింది. దీని మూలంగా ప్రస్తుతం సర్వీసులో ఉన్న 4 వేల మందికి పైగా ఉపాధ్యాయులు మరియు గత నాలుగు సంవత్సరాల నుండి నేటి వరకు రిటైరైన సుమారు ఐదు వేల మంది ఆర్థికంగా తీవ్రంగా నష్టపోయి, నిరాశ, నిస్పృహలతో నిస్తేజంగా తయారవుతున్నారు. దీని మూలంగా అటు విద్యార్థులు ఇటు ఉపాధ్యాయులు పడుతున్న యిబ్బందులను దృష్టిలో ఉంచుకొని తక్షణమే పదోన్నతులకు అవకాశం కల్పించాలి.

గత 5 ఏండ్లుగా ఎయిడెడ్ పాఠశాలల్లో నియామకాలపై నిషేధం ఉండడం వలన ఈ పాఠశాలల్లో ఉపాధ్యాయుల కొరత తీవ్రంగా ఉంది. ఉన్న వారిపై పని భారం పెరిగింది. విద్యార్థులు తీవ్రంగా నష్టపోతున్నారు. నిషేధం ఎత్తివేసి వెంటనే నియామకాలు చేపట్టాలి.

**12.** ఎయిడెడ్ ఉపాధ్యాయులకు యాక్టు 37/2005ను ప్రాస్పెక్టివ్‌గా అమలు చేసి వారికి గత ముప్ఫై సంతవ్సరాలు నుండి ఇస్తున్న అన్‌ఎయిడెడ్ ఇంక్రిమెంట్లనుతక్షణమే పునరుద్ధరించి వారికి 2005 పిఆర్‌సి అమలు చేయాలి.

**13.** ఎయిడెడ్ మున్సిపల్ ఉపాధ్యాయులకు మెడికల్ రీ-ఇంబర్స్‌మెంట్ సౌకర్యం కల్పించాలి.

**14.** ఎయిడెడ్ ఉపాధ్యాయులకు ప్రావిడెంట్ ఫండ్ సౌకర్యమును కల్పించాలి. 2005 వరకు కొనసాగించిన టి.పి.ఎఫ్ ను పునరుద్ధరించాలి. దీనిని ప్రభుత్వ ఉపాధ్యాయులకు మాదిరిగానే శాశ్వత ప్రాతిపదికన జి.పి.ఎఫ్ గా మార్చి కొనసాగించాలి.

**15.** ఎయిడెడ్ పాఠశాలలన్నింటినీ ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి.

**16) మున్సిపల్ ఉపాధ్యాయులకు సర్వీసు రూల్స్ రూపొందించాలి**

మున్సిపల్ ఉపాధ్యాయులకు సర్వీసు రూల్స్ రూపొందించాలని మనం చాలా కాలం నుండి చేస్తున్న పోరాటం ఫలితంగా పాఠశాల విద్యాశాఖలో పనిచేసిన మాజీ డైరెక్టర్ వారిని ఈ పని అప్పగించారు. ఈ ప్రతిపాదనలు యిప్పటికి ప్రభుత్వానికి చేరలేదు. కావున వెంటనే ఉపాధ్యాయ సంఘాలతో చర్చించి ప్రతిపాదనలు ప్రభుత్వానికి పంపాలి. ఆ వెనువెంటనే ప్రభుత్వం సర్వీసు రూల్స్ ప్రకటించాలి.

**17.** మున్సిపల్ ఉపాధ్యాయులకు 010 హెడ్ ద్వారా జీతాలు చెల్లించాలి.

**18.** మున్సిపల్ ఉపాధ్యాయుల సర్వీసులు ప్రావిన్షలైజ్ చేయాలి.

**19.** ఎయిడెడ్, మున్సిపల్ ఉపాధ్యాయులకు ఎల్‌టిసి సౌకర్యం వర్తింప చేయాలి.

**20.** కేటగిరి 3 ఉపాధ్యాయులకు 24 సంIIల స్కేలు మంజూరుకు వివరణ ఉత్తర్వులు యివ్వాలి.

**21.** ఎయిడెడ్, మున్సిపల్, గిరిజన సంక్షేమలలోని అప్రెంటిస్ సర్వీసు ఉన్న ఉపాధ్యాయులందరికీ నోషనల్ ఇంక్రిమెంట్లు వర్తింప జేయాలి.

**22.** నోషనల్ ఇంక్రిమెంట్లను 1.4.2009 నుండీ నగదుగా మంజూరు చేయాలి. జి.ఓ. 2ను సవరించి సమగ్రమైన జి.ఓ. విడుదల చేయాలి.

**23.** గిరిజన పాఠశాలలకు ఎస్ఏ ఇంగ్లీష్, ఫిజికల్ సైన్స్, పిడి పోస్టులతో సహా అవసరమైన అన్ని పోస్టులు మంజూరు చేయాలి.

**24.** గిరిజన ఆశ్రమ పాఠశాలల్లోని కాంట్రాక్ట్ టీచర్లు (సిఆర్‌టి)లను రెగ్యులరైజ్ చేయాలి.

**25.** పండితుల అప్‌గ్రేడేషన్ జి.ఓ. 330ని రద్దు చేస్తూ ఈ ప్రభుత్వం తీసుకు వచ్చిన యాక్ట్ 1/2005ను రద్దు చేయాలి.

## మహిళలకు మారుమూల ప్రాంతాల్లో ఎన్నికల డ్యూటీలు వద్దు

మహిళా ఉపాధ్యాయులు, ఉద్యోగులకు మారుమూల ప్రాంతాల్లో ఎన్నికల విధులకు నియమించవద్దని ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ విజ్ఞప్తి చేసింది. శాసనమండలి సభ్యులు డా॥ చుక్కారామయ్యతో కల్సి యుటియఫ్ అధ్యక్షులు ఎన్. నారాయణ, ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వర రావు, కోశాధికారి ఎం. సంయుక్త, కార్యవర్గ సభ్యులు రమాదేవి, విజయలక్ష్మి తదితరులు మార్చి 17న రాష్ట్ర ప్రధాన ఎన్నికల అధికారి ఐ.వి. సుబ్బారావుని కలిసి ఎన్నికల సందర్భంలో మహిళా టీచర్లు ఎదుర్కొనే సమస్యలు పరిష్కరించాలని విజ్ఞాపన పత్రం సమర్పించారు. యుటియఫ్ ప్రాతినిధ్యానికి ఎన్నికల అధికారి సుబ్బారావుగారు సానుకూలంగా స్పందించారు. మహిళా టీచర్లను మారుమూల ప్రాంతాల్లో ఎన్నికల విధులకు నియమించవద్దని, పట్టణ ప్రాంతాలు మరియు మండల కేంద్రాల్లోనే నియమించాలని, ఏ పోలింగ్ స్టేషన్‌లోనైనా మహిళా ఉద్యోగిని ఒంటరిగా నియమించవద్దని, కనీసం ఇద్దరు మహిళలైనా వుండాలనే ప్రతిపాదనలపైన జిల్లా కలెక్టర్‌లకు ఆదేశాలు యిస్తామని హామీ యిచ్చారు. వికలాంగులు, గర్భిణీ స్త్రీలు, బాలింతలను ఎన్నికల విధుల నుండి మినహాయింపు ఇవ్వాలని ఇప్పటికే ఆదేశాలు ఇచ్చామని తెలిపారు.

## పెద్దల అనుభవం యువతరం సారధ్యంలో పురోగమిస్తున్న యుటియఫ్ రాష్ట్ర మహాసభ ప్రతినిధుల అర్హతల పత్రాల విశ్లేషణ

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ రాష్ట్ర మహాసభలు 2009 ఫిబ్రవరి 20,21,22 తేదీలలో నల్లొండలో ఆద్యంతం స్ఫూర్తిదాయకంగా జరిగాయి. ఈ లక్ష్యంతో పి. బాబురెడ్డి కన్వీనర్‌గా, బి. నరసింహారావు, సిహెచ్. పద్మావతి, కె. సత్తిరాజు సభ్యులుగా ఏర్పడిన అర్హతల కమిటీ.

21,22 తేదీలలో జరిగిన ప్రతినిధుల సభల్లో రాష్ట్రం నలుమూలల నుండి ఎంపికై వచ్చిన 576 మంది ప్రతినిధులు, పరిశీలకులు, ఆహ్వానితులు పాల్గొన్నారు. మహాసభల ప్రతినిధుల అర్హతలను బట్టి భవిష్యత్ ఉద్యమ రూపు రేఖలను అంచనా వేయవచ్చును. వ్యవస్థ ప్రారంభమైంది. 83-94 మధ్య కాలంలో ఉపాధ్యాయులుగా చేరిన వారు 177 మంది. 95లో అప్రెంటిస్ వ్యవస్థ ప్రారంభమైన తర్వాత ఉద్యోగాలలోకి వచ్చిన వారు 213 మంది ఉన్నారు. మరోరకంగా చూస్తే 1991లో నూతన ఆర్థిక సంస్కరణల అమలుకు పూర్వం ఉపాధ్యాయులైన వారు 281 మంది కాగా ఆ తర్వాత వచ్చిన వారు 213 మంది ఉన్నారు. 492 మంది ప్రతినిధుల అర్హతల పత్రాల విశ్లేషించి సమర్పించిన నివేదికను మహాసభ ఆమోదించింది. 430 మంది పురుషులు, 62 మంది మహిళల్లో 40 సంవత్సరాలలోపు వారు 166 మంది, 41-50 సం॥ వయస్సుగలవారు 242, 51 సం॥ ఆపైన వయస్సు గలవారు 86 మంది. ఉద్యమంలో అపారమైన అనుభవమున్న వారు జిల్లా, రాష్ట్ర నాయకత్వాలలోను, యువతరం మండల కమిటీల బాధ్యతల్లోనూ అధికంగా ఉన్నారు. వీరిలో ఎస్‌సి-75, ఎస్‌టి-18, బిసి-186, మైనార్టీలు 13 మొత్తం 292. ప్రతినిధుల్లో 59% మంది అణగారిన వర్గాలకు చెందినవారే. అందుకనే సామాజిక స్పృహతో మన ఉద్యమం పురోగమిస్తున్నది. అన్ని ప్రాంతాలకు, యాజమాన్యాలకు, కేడర్లకు ప్రాతినిధ్యం వహిస్తున్నాము. ప్రభుత్వ 29, పంచాయితీరాజ్ 408, మున్సిపల్ 13, గిరిజన సంక్షేమ 09, ఎయిడెడ్ 10మంది ఆయా యాజమాన్యాల నుండి ప్రాతినిధ్యం ఉన్నది. క్యాడర్ల వారీగా ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులు 26 మంది, స్కూల్ అసిస్టెంట్లు 196, పిఎస్‌హెచ్‌ఎంలు 42 మంది, ఎస్‌జిటిలు 194 మంది, పండితులు 11మంది, పిఇటిలు 3, ఇతరులు 24 మంది ఉన్నారు. సంఘంలో బాధ్యతల రీత్యా పరిశీలిస్తే రాష్ట్ర ఆఫీస్ బేరర్లుగా 20మంది, జిల్లా ఆఫీస్ బేరర్లుగా 269 మంది, మండల, పట్టణ బాధ్యతల్లో 194మంది పనిచేస్తున్నారు. 472మంది ఐక్య ఉపాధ్యాయ జీవిత, దశాబ్ది, వార్షిక చందాదారులుగా ఉన్నారు. అభ్యుదయ సాహిత్యాన్ని అధ్యయనం చేసే వారు 343 మంది ఉన్నారు. రచయితలు, గాయకులు, నాటికలు, మిమిక్రీ, మ్యాజిక్ అభిరుచులు గల వారు 126 మంది ఉన్నారు.

సంఘం ఆవిర్భావం నుండి 1983 వరకు ఉపాధ్యాయులుగా నియమితులైన వారు 104 మంది ఉన్నారు. వారిలో ఆనాటి నుండి ఈనాటి వరకు 72 మంది రాష్ట్ర, జిల్లా మండల బాధ్యతల్లో పనిచేస్తూ ఉండటం గర్వకారణం. 1983 తర్వాత రాష్ట్ర విద్యారంగంలో స్పెషల్ టీచర్ ఉన్న యువత ఉద్యమిస్తూనే ఉంటారు. రాష్ట్ర యువకులపై కన్పిస్తున్న నాయకత్వంలో 85% యువత ఈ విధానాల ద్వారా అనేక యిబ్బందులు పడ్డారు.

కనుక సహజంగానే అప్రెంటిస్ విధానం రద్దు, నోషనల్ ఇంక్రిమెంట్లు సాధన, స్పెషల్ టీచర్ల సర్వీస్ పెన్షన్‌కి లెక్కించటం, స్పెషల్ విద్యావాలంటీర్ల సమస్యలు ఉద్యమ ఎజెండాగా ముందుకొస్తున్నాయి. వాటిపై యుటియఫ్ స్వతంత్రంగాను, ఐక్యంగాను ఉద్యమాలు నిర్వహించింది. కొన్ని విజయాలు సాధించింది. తమను వివక్షతకు గురి చేసిన, ఆర్థికంగా నష్టపరిచిన విధానాలపై పెద్దల అనుభవం దారి చూపుతుంటే అసంఖ్యాకంగా స్పష్టం చేస్తున్నాయి. దృశ్యాలు భవిష్యత్ అంతా పోరాటాలమయమేనని.

## రాజకీయ పార్టీల మేనిఫెస్టోలో విద్యారంగానికి ఏమి చేస్తారో చెప్పాలి
### రాష్ట్ర కార్యవర్గ సమావేశం డిమాండ్

రాష్ట్రంలోను, దేశంలోను సాధారణ ఎన్నికలు జరుగుతున్న నేపధ్యంలో విద్యారంగానికి ఏమి చేస్తారో ఎన్నికల మేనిఫెస్టోలో చెప్పాలని విజయవాడ చెన్నుపాటి భవన్‌లో జరిగిన రాష్ట్ర కార్యవర్గ సమావేశం తీర్మానించింది. మార్చి 10,11 తేదీలలో రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ అధ్యక్షతన జరిగిన కార్యవర్గ సమావేశం విద్యారంగం ఉపాధ్యాయుల సమస్యలపై పలు తీర్మానాలు ఆమోదించింది. 11వ రాష్ట్ర మహాసభ అనంతరం తొలి కార్యవర్గ సమావేశాన్ని ఎస్‌టిఎఫ్ఐ ప్రధానకార్యదర్శి కె.రాజేంద్రన్ ప్రారంభిస్తూ గత ఎన్డీఏ ప్రభుత్వంగాని, ఈ ఐదేళ్ళలో యుపిఎ ప్రభుత్వంగాని విద్యాహక్కు బిల్లును చట్టబద్ధం చేయలేకపోయాయన్నారు. సరళీకరణ విధానాలనే అమలు చేసి విద్యారంగానికి తగిన ప్రాధాన్యత యివ్వలేదన్నారు. ఉద్యోగులు, కార్మికులు, ప్రజల ప్రయోజనాలు కాపాడే ప్రభుత్వాలను ఎన్నుకోవలసి ఉందన్నారు. ఎమ్మెల్సీ ఎంవిఎస్ శర్మ సందేశమిస్తూ సంస్కరణ ముసుగులోనే సంక్షేమ పథకాలకు రాష్ట్ర ప్రభుత్వం అమలు చేసిందని, ఈ క్రమంలోనే విద్యారంగంలో వచ్చిన మార్పులు అర్థం చేసుకోవాలని, బడ్జెట్‌లో మార్పులేకుండా కొన్ని పోస్టులు అప్‌గ్రేడ్ చేసి అందుకు సమానంగా ఎస్‌జిటి పోస్టులు రద్దు చేసిందన్నారు. కార్యవర్గ సభ్యులు 116 మందికిగాను 100 మంది హాజరయ్యారు. ప్రధానకార్యదర్శి ప్రవేశ పెట్టిన నివేదికపై 22 జిల్లాల నుండి చర్చించారు. తక్షణ కర్తవ్యాలుగా మార్చి 21 నుండి నెలాఖరు వరకు అమరజీవి అప్పారి వెంకటస్వామి గారి 8వ వర్ధంతి సభలు అన్ని శాఖలు జరపాలని, ఎన్నికల ఎజెండాలో విద్యారంగం అనే అంశంపై విరివిగా సదస్సులు పెట్టాలని, మే 10న డిఎస్‌సి మోడల్ టెస్టు నిర్వహించాలని, జిల్లాల ప్రధాన బాధ్యులకు ఏప్రిల్ 27,28,29 తేదీలలో ఉద్యమ తరగతులు నిర్వహించాలను, ఐక్య ఉపాధ్యాయ, స్పెషల్ క్యాంపెయిన్ విజయవంతం చేయాలని తక్షణ కర్తవ్యాలు తీసుకోవడం జరిగింది.

**కార్యవర్గం ఈ క్రింది కమిటీలను నియమించడం జరిగింది**

**ఉద్యమ తరగతుల కమిటీ:** చైర్మన్‌గా కె. వెంకట్రావు, కన్వీనర్‌గా ఎ.నర్సిరెడ్డి, సభ్యులుగా సిహెచ్.రవి, కె.ఎస్.ఎస్.ప్రసాద్, పి.బాబురెడ్డి, ఎస్.సోమచంద్రారెడ్డి.

**నిబంధనావళి కమిటీ:** చైర్మన్‌గా ఎన్. నారాయణ, కన్వీనర్‌గా సిహెచ్.రవి, సభ్యులుగా ఐ. వెంకటేశ్వరరావు, పి. బాబురెడ్డి, కె.ఎస్.ఎస్. ప్రసాద్, ఎం. సంయుక్త, కె.వెంకట్రావు, ఆహ్వానితులుగా డి. రామిరెడ్డి, ఎంఎకె. దత్, సిహెచ్. సుభాష్‌చంద్రబోస్

**అకడమిక్ సెల్:** చైర్మన్‌గా సి. రామయ్య, కన్వీనర్ ఎంఎకె. దత్, సభ్యులుగా డి.రామిరెడ్డి, వి. బాలసుబ్రహ్మణ్యం, ఎన్.నారాయణ, పి. ఇంద్రజిత్ (హైదరాబాద్), డి. రాము (విజయనగరం), పి.జె.వి. అరుణపాణి(ఖమ్మం), ఎంవి.చలపతి (నెల్లూరు), డి. శ్రీనివాస్ (నల్గొండ), ఎస్. భాస్కర్ రెడ్డి(ఎం.నగర్), కె. సురేష్ కుమార్ (కర్నూలు), ఎస్. రాజశేఖర్ (రంగారెడ్డి)

**ప్రచురణల కమిటీ:** చైర్మన్‌గా సిహెచ్. సుభాష్‌చంద్రబోస్, కన్వీనర్‌గా ఎ. ఇజ్రాయెల్ రాజు, సభ్యులుగా కె.వెంకట్రావు, బి.నాగేశ్వరరావు, టి.మల్లేశ్వరరావు (గుంటూరు), ఆర్. విక్రమ్‌రెడ్డి (ఖమ్మం), విద్యాసాగర్ రెడ్డి (నల్గొండ), ఎస్.సోమయ్య (రంగారెడ్డి).

**మహిళా విభాగము:** కన్వీనర్‌గా ఎం.సంయుక్త, కో-కన్వీనర్లుగా సిహెచ్. పద్మావతి (గుంటూరు), నిర్మల (చిత్తూరు), విద్యాదేవి (వరంగల్), జి.ఉషాదేవి (నల్గొండ), సభ్యులుగా శాంతకుమారి (ఆదిలాబాద్), ఎ.రమాదేవి (ఖమ్మం), హేమలత (ఎం. నగర్), డి. సుజాత (చిత్తూరు), పి. సరళ (రంగారెడ్డి), మరియు అన్ని జిల్లాల మహిళా కన్వీనర్లు.



# పంతులమ్మ



ఇ. నరసింహారావు

రత్నగిరి ప్రాధమిక పాఠశాలలో రాధ తన సామాన్లతో అడుగుపెట్టింది. కూడా వచ్చిన గ్రామస్తులు మీ పంతులమ్మ అనడంతో ఆమె చుట్టూ పిల్లలు మూగారు. లోపల్నుండి మాష్టారు రావడంతో పరస్పరం పరిచయం చేసుకున్నారు. జాయినింగ్ పర్వం పూర్తయ్యాక పిల్లలు తక్కువమంది ఉండడానికి కారణమడిగింది. తల్లిదండ్రులు పిల్లలను పంపించడానికి ఇష్టపడడం లేదు అన్నాడు. మీరెక్కడుంటున్నారు. అన్నదానికి తాను మండల కేంద్రంనుండే రాకపోకలు సాగిస్తున్నట్లు తెలిపారు. నేను ఇక్కడే ఉండాలనుకుంటున్నాను అనడంతో మధ్యాహ్నభోజనం వండిపెట్టే రాజమ్మకు ఒక రూమ్ చూసి పెట్టమని పురమాయించాడు. ఆసక్తిగా తనవంకే చూస్తున్న పిల్లలను పలకరిస్తూ రాజమ్మతో కలిసి గ్రామంలోకి వెళ్ళింది. గట్టిప్రయత్నం చేసి రాజమ్మ తన ఇంటికి దగ్గర్లో ఒక గది ఇప్పించింది. తడికల గదిలో స్నానం. తెల్లవారుఝామునే బయలుకు వెళ్లాలమ్మా.. అన్నది. ఒక్కక్షణం పట్టణం నుండి తిరగాలనిపించినా ఆ ఆలోచనను విరమించుకుంది. సర్పంచ్ సాంబయ్య అంతమంచివాడు కాదమ్మా.. అయినా ఒక్కసారి కలసివద్దాం అంటూ... అటుగా దారి తీసింది రాజమ్మ.

మందీ, మార్బలంతో పిచ్చాపాటి మాట్లాడుతున్న సాంబయ్యకు రాధను కొత్త పంతులమ్మంటూ పరిచయం చేసింది. తనను ఆదోలా చూస్తూ నువ్వొస్తున్నావని పంతులు చెప్పాడ్లే ఏం కులమేంటి? ఊహించని ప్రశ్నకు తెల్లమొహం వేసింది. నాకులంతో పనేంటి అని ఎదురుప్రశ్నించింది. రాధ. ఏం కులం తక్కువదానవా.. ఆనటంతో చురుగ్గా చూసి రాజమ్మా వెళ్దాం పద అన్నది. గీర ఎక్కువే అన్నారు చుట్టూ చేరిన వాళ్ళు. లోపల్నుంచి ఆగు పంతులమ్మా అంటూ సర్పంచ్ భార్య జానకి వచ్చి చేయి పట్టుకుని ఇంట్లోకి తీసుకెళ్లింది. వాళ్ళ ముదనష్టపు మాటలకేం గాని, నువ్వు ధైర్యంగా ఉండు అనే భారోసాతో భద్రతాభావం పెరిగింది. భోజనానికి ఉండమన్నా సున్నితంగా తిరస్కరించి తను కొత్తగా చేరిన గదిలోకి వచ్చింది. భోజనానంతరం గ్రామంలోని విశేషాలు, ప్రజల స్థితిగతుల గురించి చాలాసేపు ఆలోచిస్తూ నిద్రపోయింది. తెలవారకముందే పంతులమ్మా అంటూ రాజమ్మ వేసిన కేకతో మెళకువ వచ్చింది. విషయం అర్థమైంది. ఊరి బయటకు వెళ్ళాక మహిళల దుర్భరస్థితి చూసింది. బుదరలోనే పొదలమాటున బిక్కుబిక్కుమంటూ మహిళలు కాలకృత్యాలు తీర్చుకోవటం చూసింది. ప్రకృతి సహజమైన పనిని నిదానంగా పూర్తి చేసే అవకాశాలు లేవు. కొత్తగదమ్మా నీకు కష్టంగానే ఉంటుంది. మాకలవాటే అంటున్నా రాజమ్మ మాటల్లో ఆవేదన గుర్తించింది. పాఠశాల సమయానికి ముందే వెళ్ళిన ఆమెకు ఆవరణంతా పశువుల పెంట, చెత్తాచెదారం దర్శనమిచ్చాయి. ఊడ్చేందుకు ఎవరూ లేరు. పైపైన శుభ్రం చేసుకునే పిల్లలు అక్కడే ఆడుకుంటున్నారు. ఒకరిద్దరు పిల్లలు ఊడుస్తుంటే చాలామంది చూస్తూ నిలబడ్డారు. తనకలవాటు లేకున్నా చీపురు తీసుకొని ఒక ప్రక్కగా ఊడ్చటం మొదలుపెట్టింది. తన చేతులను చిన్నారి చేతులు రెండు ఆపుచేసాయి. నేనూ ఉడుస్తా టీచర్ అన్నది రమ్య. రాధ మొహంలో చిరునవ్వు నేనివ్వను కావాలంటే మరొకటి తెచ్చుకుని ఊడ్చుకో అన్నది. ఆడ, మగపిల్లలు ఊళ్లోకి పరిగెత్తారు. వాళ్ళెందుకు వెళ్లారో కొద్ది సేపటికిగాని తెలిసింది. ప్రతీ ఒక్కరు పొలికట్టో, చీపురో తెచ్చుకొని ఊడ్వనారంభించారు. గదుల్లో బూజులు మటుమాయ మయ్యాయి. శుభ్రంగా తయారైన ఆవరణను చూశాక తన శ్రమను మరిచి పోయింది. పిల్లలను దగ్గరకు పిలిచి మెచ్చుకుంది. అప్పుడే వచ్చిన రామారావు మొహంలో బిడియం, సంభ్రమం చోటుచేసుకున్నాయి. మీకెందుకండీ ఈ కష్టం అంటున్న మాటలకి చిరునవ్వే సమాధానమైంది.

పిల్లలతో పాటు నేలపైనే కూర్చొని పాఠాలు చెప్పసాగింది. అభినయ గేయాలతో అలరించింది. పిల్లలు ఆమెను తాకటానికి పోటీలు పడుతున్నారు. మధ్యాహ్న భోజనం ఉన్నంతలో బాగానే చేసింది రాజమ్మ కాని కొందరు పిల్లలు తినకపోవటాన్ని గుర్తించింది. వండినోళ్ళు కులం తక్కువోళ్లని, తినొద్దని వాళ్ళవాళ్ళు చెప్పినట్లు తెలిపారు. పెద్దల కులవివక్ష ప్రభావం పసిమనసుల్లో బలపడుతుంది.

బడి వదిలాక పిల్లల్ని తీసుకొని గ్రామంలోని దళితుల నివాసప్రాంతానికి వెళ్లింది. పూరిగుడిసెలు, తేమలోనే పొర్లాడుతున్న పసిపిల్లలు, ఆలవిమీరిన చాకిరి వారికి ఇంటిపై, ఒంటిపై శ్రద్ధ లేకుండ చేసాయి. రోజుకు ఇరవై రూపాయల కూలి కూడా గిట్టుబాటు కాని పరిస్థితుల్లో నదురుగా కన్పించిన పిల్లవాళ్ళను తమతో కూలికి తీసుకుపోతున్నారు. ఆడపిల్లలను, పసిపిల్లలను, ముసలోళ్ళను చూసుకోవడంతోపాటు ఇంటిపని, వంటపని చూస్తున్నారు. రాధ మనసు వికలమైంది. బలహీనవర్గాల ప్రజల నివాసాలు వీరితో పోల్చితే కొంతబాగున్నట్లనిపించినా ధనికుల లోగిళ్ళు ఆస్తులతో పోల్చితే వెలవెల పోతున్నాయి. కొత్త పంతులమ్మ ఇళ్ళు పట్టుకొని ఎందుకు తిరుగుతుందాయని అందరూ ఆరాతీస్తున్నారు. ఆమె రాక పేదల మొహాల్లో కాంతులు వెదజల్లితే పెత్తందారుల్లో అనుమానాన్ని రేపాయి. అలా తిరగటం, సంభాషించటం మామూలైంది. పిల్లల్ని బడికి పంపాలని ఆమె విజ్ఞప్తులు ఒక మేరకు ఫలించాయి మరికొందరు కొత్తగా చేరారు.

ఒక రోజు పాఠశాల ప్రార్థనాసమయంలో ప్రధానోపాధ్యాయుని అనుమతితో మాట్లాడింది. మనిషిగా పుట్టినందుకు మనకోసమే కాక ఇతరులకు సాయం చేయాల్సిన అవసరం పిల్లలకు వివరించింది. ప్రతీరోజూ సాయం చేసిన చేతుల గురించి ఇక్కడ చెప్పుకుందాం. వాళ్ళు మిగతా వాళ్ళకంటే గొప్పవాళ్ళన్నమాట. దానిని మన పాఠశాలలో, ఇళ్ళలో మొదలుపెడదాం అంది. అప్పుడే ఆ పాఠశాలలోకి కొందరు వ్యక్తులు ప్రవేశించి ఒక ఉపాధ్యాయ సంఘం తరపున రాధను సభ్యత్వం చేర్చుకోవడానికి వచ్చామని తెలిపారు. రామారావు తాను ఆ సంఘంలోనే సభ్యుడ్ని అన్నాడు. రాధ సాలోచనగా మీ సంఘంలో నేను చేరితే నావల్ల సంఘానికి, సంఘం వల్ల నాకు ప్రయోజనమేమిటో చెప్పండి అన్నది. ఉపాధ్యాయులందర్నీ కార్లల్లో తిరిగేస్థాయికి తీసుకుని రావాలనేది మా సంకల్పం. మీతరపున అన్ని పనులూ మేమే చేస్తాం. మాకు రాజకీయ అనుబంధాలు లేవు. అధికారంలో ఎవరుంటే వారితో మంచిగా మెలిగి పనులు చేయించుకుంటాము. అధికారులతో దగ్గరగా ఉంటాం. అంతెందుకు బడికి రావటంల కాస్త అటూ ఇటూ అయినా మేము మేనేజ్ చేయగలం. ఈ గ్రామ సర్పంచ్ కూడా మామాట వింటాడు అన్నారు. మాకా అవసరం లేదులెండి అంటూ రాధ మరి ప్రజల మాటేమిటి ? వారికి మీరేం చేస్తారు? అన్నది. ఎవరిది వాళ్ళు చూసుకోవాలి మేడమ్. మన కుటుంబం మనబడి అంతే ఊర్లో విషయాల్లో తలదూర్చితే చికాకులు తప్పవు అన్నారొకరు. రాధ చేస్తున్న పనులు చూచాయిగా తెలుసు వారికి. సరే నేనాలోచించుకోవటానికి కొంత సమయమివ్వండి అని వినయంగా తప్పుకుంది.

సాయంకాలానికి మరొక సంఘం వాళ్ళు వచ్చారు. మధు ఇతరుల్ని, తనను పరిచయం చేసుకున్నాడు. ఉపాధ్యాయులు హక్కులు-బాధ్యతలు సమదృష్టితో చూడాలని సామాజిక స్పృహతో పనిచేయాలన్నాడు. సమాజంలోని రుగ్మతలకు వ్యతిరేకంగా ప్రచారం చేయాల్సివుందన్నారు. సమాజమార్పు, పాఠశాల నుండే ప్రారంభించే అవకాశం ఉంది కదా అన్నది రాధ, అవునండి అందుకు ముందు టీచర్లను సంసిద్ధులను చేసే ప్రయత్నంలో ఉన్నామన్నారు.

అనేక ప్రశ్నలు - సమాధానాల తరువాత తను ఆసంఘంలో సభ్యురాలైంది. రామారావును తమ సంఘంలోకి వచ్చే విషయం ఆలోచించమని కోరతూ వెళ్ళిపోయారు. మరుసటి ఆదివారం జరిగిన సంఘం సమావేశానికి వెళ్ళిన రాధ అందర్నీ ఇట్టే ఆకట్టుకుంది. సంఘం కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనాలని నిర్ణయించుకొంది. తనకు మధు అభ్యుదయ సాహిత్యం ఇచ్చారు. అలా కొంత కాలం గడిచింది. పిల్లలు ఇళ్ళల్లో తమ తల్లిదండ్రులకు ఏమేం సాయం చేసింది. చెప్పుకోవటానికి పోటీలు పడుతున్నారు. అలా ఏపనిచేయలేదని చెప్పుకోవటానికి సిగ్గుపడుతున్నారు. వారిని సముదాయించి రాధ మళ్ళీ వారిని పురికొల్పుతూనే ఉంది. ఫలితంగా దారిలో కలిసిన తల్లిదండ్రులు అభిమానంగా టీచర్లిద్దర్నీ పలకరించటం, తమ బిడ్డల్లో మార్పు గురించి మురిపెంగా చెప్పుకుంటున్నారు. మేము చెబితే అటు పుల్లతీసి ఇటు పెట్టనివాళ్ళు ఇళ్ళు ఊడ్చటంలో, వంటలో, పశువులకు మేత వేయటంలో, పసిపిల్లల్ని ఆడించటంలో సాయం చేస్తూనే బుద్ధిగా చదువుకుంటున్నారమ్మా. ఎవరు చెప్పార్రా ఈ పనులన్నీ చేయమని అని అడిగితే మా రాధా టీచర్ అని గొప్పగా చెబుతున్నారన్నారు.

ఒకరోజు పాఠశాలలో మధ్యాహ్నం భోజనం తయారు చేస్తున్న దగ్గరికి ఐదు తరగతుల నుండి వివిధ కమిటీల లీడర్లను తీసుకెళ్ళింది. రాధ సూచనలతో గతంలో కన్నా రాజమ్మ శుభ్రంగా తయారైవచ్చింది. అన్నం, సాంబారు చేయటానికి అన్నీ సిద్ధం చేసుంది. అగ్రవర్ణాలవాళ్ళ పిల్లలు అన్నారు. బియ్యం ఎన్నికావాలో సాంబారుకు కావాల్సిన పదార్థాలన్నీ లెక్క ప్రకారం వేరువేరుగా పిల్లల చేత తీయించింది. మరుగుతున్న నీళ్ళల్లో రాజమ్మ సూచనల మేరకు విద్యార్థులు ఒక్కో పదార్థాన్ని పాత్రల్లో వేసి ఆసక్తిగా వాటిని చూస్తున్నారు. వంట తయారైంది. ఆకలి బాగా వేస్తుందిరా మనమంతా కలిసి తయారుచేసిన అన్నం, సాంబారు ఎలా ఉందో రుచి చూడాలని ఉందికదూ అంది రాధ. అవును టీచర్ అన్నారు. కోరస్‌గా నాకేమో తినేయాలనిపిస్తుంది. మీలో కొందరేమో తినరు.. వద్దులేమ్మా వదిలేద్దాం అన్నది. ఊహూ తిందాం టీచర్ అని ఒకరంటే ఎక్కువమంది అవును అవును అన్నారు. ఒకరిద్దరు సందిగ్ధంలో అన్నారు. తను సాహసం చేస్తున్నానని ఆమెకు తెలుసు అయినా తప్పదు. ఎట్టకేలకు పిల్లలందరూ పంక్తిలో కూర్చున్నారు. తుళ్ళింతలతో భోజనం పూర్తిచేసారు. ప్రధానోపాధ్యాయుడు రామారావు టెన్షన్‌లో ఉన్నాడు. ఆ ఎఫెక్ట్ వచ్చిపడింది. పిల్లలు భోజనానికి రాకపోవడంతో వాళ్ళవాళ్ళు రావటం విషయం తెలుసుకొని ఇదేంటి పంతులమ్మా ఈ పనిచేసావు అంటే.. మరికొందరేమో రుసరుసలాడారు. పిల్లలు తమ ఇష్టప్రకారమే తిన్నామని చెప్పటంతో వెనుదిరిగారు. కొన్ని రోజులు ఇదే తంతు నడిచింది. అభ్యంతర పెట్టేవాళ్ళ సంఖ్య తగ్గింది. కాని సర్పంచ్ సాంబయ్య మండలాఫీసులో టీచర్లపై ఫిర్యాదు చేయనే చేసాడు. కులవివక్ష పాటించడం నేరమని దానిని రూపుమాపటం కోసం టీచర్లు మంచి పనే చేస్తున్నారు అని ఆఫీసర్లు అనటంతో మీరంతా అలగాజనం కొమ్ముకాస్తారు లెండి.. అంటూ ఉక్రోషం వెళ్ళగక్కాడు.

సంఘ నాయకుడు మధు, రాధ కలసి మండల కేంద్రానికి వెళ్ళారు. మండల అధికారులను, ప్రజాప్రతినిధులను, పారెస్టు అధికారులను కలిసి వినతిపత్రాలు ఇచ్చి చర్చించారు. ఆమె అడిగిన సహాయం చేయడానికి వారు సంతోషంగా అంగీకరించారు. కొద్ది రోజులకే అటవీశాఖ నుండి ఫలసాయాన్నిచ్చే వందలాది మొక్కలు పాఠశాలకు చేరాయి. అటవీశాఖ సిబ్బంది సూచనలతో ఉపాధ్యాయులు, పిల్లలు విస్తారంగా మొక్కలు నాటారు. ప్రతీ ఇంటికి కొన్ని మొక్కలను పిల్లల చేత పంపించారు. వాడుకనీరంతా ఆమొక్కలకు చేరేలా పిల్లలు, పెద్దలు ఏర్పాటు చేస్తున్నారు. మరికొన్ని రోజులకు పంచాయితీరాజ్ శాఖ నుండి ఇంజనీర్లు వచ్చి సర్పంచ్ సాంబయ్యను కలిసి గ్రామంలో సెప్టిక్ లెట్రిన్లు మంజూరయ్యాయని వాటిని నాణ్యంగా కట్టించాలని చెప్పి స్వయంగా డిపార్ట్‌మెంటే అందుకు పూనుకుంది. ఛీ పాడు.. వాకిట్లో ఉన్న వాటిల్లోకి ఆపనికోసం ఏం పోతాం అని బిడియపడినవాళ్ళు ఆరోగ్యశాఖ కార్యకర్తలు, టీచర్లు, నచ్చచెప్పిన మీదట వాటిని వాడటం ప్రారంభించారు. నెమ్మదిగా గ్రామం బయట ఉన్న మట్టిరోడ్ శుభ్రపడటం మొదలయ్యింది. రైతుల నొప్పించి ఉచితంగా గోబర్‌గ్యాస్ ప్లాంట్స్ కట్టించడంతో ఎంతకీ మండని కట్టెలపొయ్యిల పొగకు ఉక్కిరిబిక్కిరి అవుతూ వంటచేసే మధ్యతరగతి మహిళల ఆనందానికి అవధులు లేకపోతున్నాయి. ఈ మార్పులను ఎలా దిగమింగాలో పెత్తందార్లకు అర్థం కావటం లేదు. రాధను నేరుగా ఏమన్నా అనే ధైర్యం చేయలేకపోతున్నారు. తమ ఇంట్లో వాళ్ళే ఆమెను వెనకేసుకొస్తారని తెలుసు.

కొన్ని నెలలు వేగంగా గడిచిపోయాయి. రాధ యునియన్‌లో క్రియాశీల కార్యకర్తగా ఎదిగింది. మధు సహకారంతో ఇతర ప్రజాసంఘాలతోనూ పరిచయాలు పెరిగాయి. వారి మధ్య సాన్నిహిత్యం పెరిగింది. పదిహేను మంది ఆడపిల్లలు బడికి రాలేకపోతున్నారు. తల్లిదండ్రులను ఒప్పించటానికి వెళ్ళినవారికి పిల్లల్ని చదివించుకోవాలని ఉన్నా, తాము రోజంతా కష్టపడినా ఇల్లు గడవటం లేదని అందుకే వాళ్ళని పనికి తీసుకుకెళ్తున్నామని కొందరు, పసిపిల్లలను చూసే వాళ్ళు లేక వీళ్ళను ఇంట్లో ఉంచుతున్నామని చెప్పారు. మధు వ్యవసాయ కార్మిక సంఘాన్ని సంప్రదించటంతో వాళ్ళు గ్రామంలోకి వచ్చారు. కనీస వేతనాల అమలు, పని గంటలు తగ్గింపు, ఇతర సౌకర్యాల కోసం పోరాడితేనే సాధించగలమని చెప్పారు. ఆసంఘం కార్యకర్తలు అనేకరోజులు పేదలతో ఉండి ఒప్పించారు. ఫలితంగా తమ కూలిరేట్లు పెంచాలని, పనిగంటలు తగ్గించాలని పసిపిల్లల ఆలనాపాలన చూసేందుకు ఒక ఆడమనిషిని ఉంచాలని ఆమెకు కూడా రైతులే కూలి చెల్లించాలనే డిమాండ్లు ధనిక రైతుల ముందుంచారు. ససేమిరా అనటంతో పంటకోసే కాలంలో మెరుపు సమ్మె మొదలయ్యింది. ఆకలితో అల్లాడుతూ పట్టుదలగా పోరాడుతున్న వ్యవసాయ కార్మికులకు సంఘీభావంగా మధు, రాధ నాయకత్వంలో ఉపాధ్యాయులతో సంఘం ర్యాలీ నిర్వహించింది. ఉపాధ్యాయుల నుండి విరాళాలు సేకరించి సమ్మెలోని వారికి నిత్యావసర వస్తువులు సరఫరా చేసారు. ఈ పోరాటం క్రమంగా ఇతర గ్రామాలకు పాకింది. అధికారులు, ప్రజాప్రతినిధులు జోక్యంతో ధనికరైతులు అయిష్టంగానే పేదల డిమాండ్లన్నింటిని అంగీకరించారు. పోరాడితే ఎటువంటి విజయాలు సాధించవచ్చునో ప్రజలు ఆచరణలో తెలుసుకున్నారు.

గ్రామం ఆర్థిక, సామాజిక, రాజకీయ మార్పులకు నెలవైంది. నేడు బడి ఈడు పిల్లలంతా బడిలో ఉన్నారు. అటువంటి తరుణంలోనే రాధకు బదిలీ ఉత్తర్వులు వచ్చాయి. ఉన్న ఫళాన అక్కడ్నుంచి రిలీవ్ అవ్వాలని ఆదేశం. సర్పంచ్ తదితరులపనే ఇది అని అందరికీ అర్థమైంది. ఈ క్రమబదిలీని ఖండిస్తూ, రాధకు సంఘం బాసటగా నిలిచింది. క్షణాల్లో ఈ వార్త ఊరంతా పాక్కిపోయింది. ఎక్కడి పనులు అక్కడే ఆగిపోయాయి. పిల్లలు కన్నీరు. మున్నీరవున్నారు. స్థిరంగా ఉన్నది రాధ ఒక్కతే. రామారావు లీడ్ తీసుకున్నాడు. సంఘనాయకుడు మధు, తదితరులతో చర్చించిన పిదప వందలాదిగా హాజరైన ప్రజల్ని సమావేశపరిచాడు. ప్రజలారా... విద్యార్థులారా... రాధ మేడమ్‌ను బదిలీ ఎవరు, ఎందుకు చేయించారో మనందరికీ తెలుసు ఆమె మనకు మార్గదర్శి, స్ఫూర్తిప్రదాత. ఆమె ద్వారా వ్యాపించిన భావాలన్నీ శాశ్వతంగా మనలో ఉంటాయి. ఆ భావాలనెవరూ చంపలేరు. రాధ మేడమ్ అవసరం ఇక ఈ గ్రామానికి లేదు. ఆమె మరెందరో ప్రజల జీవితాల్లో వెలుగులు నింపాలి. ఉపాధ్యాయసంఘం నాయకురాలిగాను ఆమె ఉన్నతస్థానాలకు ఎదుగుతుంది. ఆమెను వెళ్ళనిద్దాం ఆమె చూపిన మార్గంలో మనం పయనించగలం అని గద్గదస్వరంతో అన్నాడు. ప్రజలు ఆమెకు కృతజ్ఞతాభివందనాలు అర్పించారు. రాధ పెద్దలకు నమస్కరించి ప్రజల విషాదవదనాలు పిల్లల కన్నీళ్ళ మధ్య వాళ్ళను కడసారిగి స్పర్శిస్తూ ముందుకు అడుగేసింది. రాధను బదిలీ చేయించి గెలిచామా, ఓడామా అని అందుకు కారకులైన వారు తలక్రిందులవుతున్నారు. తన ఆశయపథంలో తోడుగా నేనున్నానంటూ మధు కలిసి ముందుకు సాగాడు.

**రచయిత ఖమ్మం జిల్లా భద్రాచలం మండలం,యుపిఎస్ గొల్లగూడెం ప్రధానోపాధ్యాయులు మరియు యుటియఫ్ ఖమ్మం జిల్లా అధ్యక్షులు.**

# పురపాలక సంఘం - ఖమ్మం

## అభివృద్ధి కార్యక్రమములపై నివేదిక



**శ్రీమతి అఫ్రోజ్ సమీనా**
మున్సిపల్ చైర్‌పర్సన్, ఖమ్మం



**శ్రీ ఎన్. సత్యనారాయణ**
మున్సిపల్ కమీషనర్, ఖమ్మం

**ఎన్ఎస్‌డిపి (నేషనల్ స్లం డెవలప్‌మెంటు ప్రోగ్రాం)**

2005-2006 సంవత్సరములనకుగాను ఆం.ప్ర. ప్రభుత్వం రూ. 28.43 లక్షలు మంజూరు చేసియున్నారు. ఇట్టి పనులు పూర్తి చేయబడినవి. 2006-07 సంవత్సరమునకుగాను రూ. 40.92 లక్షలు మంజూరు చేయగా 15 పనులు చేపట్టబడినవి. ఇవి పూర్తికావచ్చినవి.

**టిఎఫ్‌సి (12వ ఆర్థిక సంఘ నిధులు)**

2005-2006 సంవత్సరమునకుగాను ఆం.ప్ర. ప్రభుత్వం రూ. 39.00 లక్షలు మంజూరు చేసియున్నారు. ఇట్టి నిధులతో 7 పనులు చేపట్టబడినవి. 2006-07 సంవత్సరమునకుగాను రూ. 77.95 లక్షలు మంజూరు చేయగా 12 పనులు చేపట్టబడినవి. ఇవి పూర్తి కావచ్చినవి. 2007-08 సం॥లో (4) పనులకుగాను రూ. 44.14 మంజూరు ఇచ్చియున్నారు. ఇట్టి పనులు చేపట్టుటకు టెండర్లు పిలువనైనది.

**ఏసిడిసి (అసెంబ్లీ కాన్సిట్యూయన్సి డెవలప్‌మెంటు ప్రోగ్రాం)**

ఏసిడిపి పథకం క్రింద రాష్ట్ర ప్రభుత్వం ద్వారా 2005-2006 సంవత్సరమునకుగాను రూ. 21.25 లక్షలు మంజూరు చేయగా 32 పనులు పూర్తి చే చేయబడినవి. 2007-08 సంవత్సరమునకు గాను 11 పనులకు 11.00 లక్షలు మంజూరు కాగా పనులు పూర్తి చేయబడినవి.

**యంపిల్యాడ్స్ (మెంబర్ ఆఫ్ పార్లమెంట్ లోకల్ ఏరియా డవలప్‌మెంటు ప్రోగ్రాం)**

ఈ పథకం క్రింద రాష్ట్ర ప్రభుత్వం ద్వారా 2006-07 సంవత్సరమునకుగాను రూ. 55.00 లక్షలు మంజూరు చేయగా 25 పనులు పూర్తి చేయబడినవి. 2007-08 సం॥గాను 11 పనులకు 33.00 లక్షలు మంజూరు కాగా పనులు పూర్తి చేయబడినవి.

**ఏయస్‌సి (అడ్వర్స్ సీజనల్ కండిషన్ గ్రాంట్సు)**

ఈ పథకం క్రింద రాష్ట్ర ప్రభుత్వం ద్వారా 2007-08 సంవత్సరమునకుగాను రూ. 20.00 లక్షలు మంజూరు చేయగా 5 పనులు పూర్తి చేయబడినవి.

**మున్సిపల్ జనరల్ ఫండ్స్**

2007-08 సం॥నకుగాను రూ. 145.14 లక్షలతో 106 పనులు చేపట్టబడినవి.

2008-09 సం॥నకుగాను రూ. 440.00 లక్షలతో 118 పనులకు టెండర్లు పిలువబడినవి.

**ఇంటర్నల్ రోడ్లు మరియు డ్రైన్లు**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ జి.ఓ.నం. 880 మరియు జి.ఓ.నం. ద్వారా ఖమ్మం పురపాలక సంఘమునకు 2008-09 సం॥నకు గాను ఇంటర్నల్ రోడ్లు మరియు డ్రైన్లు అభివృద్ధి పనులు చేయుటకు గాను రూ. 246.42 లక్షలు మంజూరు చేసినారు. అందుకుగాను మొత్తం 109 పనులు ప్రతిపాదనలకు జిల్లా కలెక్టర్ గారు పరిపాలనాపరమైన ఆమోదము తెలిపినారు. అట్టి పనులు చేపట్టుటకు తగిన చర్యలు తీసుకొనబడుచున్నవి.

**బిఆర్‌జిఎఫ్ గ్రాంట్స్**

వెనుకబడిన అభివృద్ధి ప్రాంతములలో (బిఆర్‌జిఎఫ్) మౌలిక సదుపాయములు ఏర్పాటు చేయుటకు 2008-09సం॥నకు గాను రూ. 370.60 లక్షలతో (మున్సిపల్ మ్యాచింగ్ ఫండ్ రూ. 214.46 లక్షలు మరియు బిఆర్‌జియఫ్ గ్రాంటు రూ. 156.14 లక్షలు) రోడ్లు, డ్రైన్లు మరియు కమ్యూనిటిహాల్స్ నిర్మాణము మరియు మంచినీటి పైపులైన్లు ఏర్పాటు చేయుటకు మొత్తము పనులతో కూడిన ప్రాజెక్టు రిపోర్టును జిల్లా ప్రణాళికా సంఘం ఆమోదించి ప్రభుత్వమునకు నిధులు విడుదల చేయుటకు పనులు చేపట్టుటకుగాను సమర్పించినారు.

మున్సిపల్ కమీషనర్
ఖమ్మం

# ఐక్య ఉపాధ్యాయ దశాబ్ది చందాల వివరాలు

ఐక్య ఉపాధ్యాయ దశాబ్ది చందాల స్కీము 2006 జనవరిలో ప్రారంభమైంది. కొంతమంది చందాదారులకు పత్రిక అందటం లేదని వస్తున్న ఫిర్యాదులను దృష్టిలో వుంచుకొని చందాదారుల జాబితాను 2007 జనవరి నుండి వరుసగా ప్రచురిస్తున్నాము. పత్రిక అందని వారు లేదా ఈ జాబితాలో తేడాలు ఏమైనా వుంటే చందా నెంబరుతో పత్రిక కార్యాలయానికి సమాచారం అందజేసిన యెడల లోపాలను సవరించగలము. - సంపాదక వర్గం

| S.No. | Name | Village & District | Period |
|---|---|---|---|
| 1901. | Bh.V.Chalam, Tuni | EG | 06/2007to05/2017 |
| 1902. | P.Ramakrishna, Tuni, | EG | 06/2007to05/2017 |
| 1903. | M V.N.Ambika Prasad, Tuni | EG | 06/2007to05/2017 |
| 1904. | K.S.Prakasa Rao, Tuni, | EG | 06/2007to05/2017 |
| 1905. | Y. Dinakar Reddy, Mohakala cheruv | CHTR | 07/2007to06/2017 |
| 1906. | M.Rajasekhar Reddy, B.Kothakota | CHTR | 07/2007to06/2017 |
| 1907. | N. Raju Nayak, Achampeta | MN | 07/2007to06/2017 |
| 1908. | Chilakaluri Subba Rao, Vijayawada | KRI | 07/2007to06/2017 |
| 1909. | Headmaster & Staff, ZPHS Dosapadu | KRI | 08/2007to07/2017 |
| 1910. | K.Srinivasa Rao, Vijayawada | KRI | 08/2007to07/2017 |
| 1911. | Headmaster, SVBVN E/M HS Vijayawada | KRI | 08/2007to07/2017 |
| 1912. | I.D.Srinivasa Rao, Vijayawada | KRI | 08/2007to07/2017 |
| 1913. | Adivarapupeta Venkateswara Rao, | EG | 08/2007to07/2017 |
| 1914. | K.Satya Prasad, Annavaram | EG | 08/2007to07/2017 |
| 1915. | S.Srinivasulu, Peddapudi | EG | 08/2007to07/2017 |
| 1916. | N.V. Padmavali, Kirlampudi | EG | 08/2007to07/2017 |
| 1917. | A.V.L.N Acharyulu, Kakinada | EG | 08/2007to07/2017 |
| 1918. | G.P.V. Ramana, Korukonda | EG | 08/2007to07/2017 |
| 1919. | K.Mani Kumar, Samalkota | EG | 08/2007to07/2017 |
| 1920. | M Srinivasa Rao, Pedapudi | EG | 08/2007to07/2017 |
| 1921. | Ch.S.V.Subrahamanyam, Prathipadu | EG | 08/2007to07/2017 |
| 1922. | Y.Soujanya Laxmi, Kakinada | EG | 08/2007to07/2017 |
| 1923. | D.A. Somaraju, Korukonda | EG | 08/2007to07/2017 |
| 1924. | M.Seethamahalaxmi, Undrajavaram | WG | 08/2007to07/2017 |
| 1925. | G.V. Raghavalu, Attili, | WG | 08/2007to07/2017 |
| 1926. | K.Parandhamaiah, Nellore | NLR | 08/2007to07/2017 |
| 1927. | K.Anjaneyulu, Korettapadu | GTR | 08/2007to07/2017 |
| 1928. | Y.Jaya Raju, Mangalagiri | GTR | 08/2007to07/2017 |
| 1929. | T.J.Christopher, Chinakakani | GTR | 08/2007to07/2017 |
| 1930. | V. Saradha, Ganganammapeta | GTR | 08/2007to07/2017 |
| 1931. | K.Koteswara Rao, Mangalagiri | GTR | 08/2007to07/2017 |
| 1932. | Md. Abdul Kaseem, Battiprolu | GTR | 08/2007to07/2017 |
| 1933. | J. Nagarani, Chintalapudi, Pennuru mdl | GTR | 08/2007to07/2017 |
| 1934. | Sk. Pakeer Ahamad, Chebrolu | GTR | 08/2007to07/2017 |
| 1935. | T.Venkata Narayana, Pennuru | GTR | 08/2007to07/2017 |
| 1936. | N.V.S. Nageswara Rao, Pedanandipadu | GTR | 08/2007to07/2017 |
| 1937. | V. Sunanda, Burahanpuram | KHM | 08/2007to07/2017 |
| 1938. | K.Praveen Kumar, Mahaboobabad | WRL | 08/2007to07/2017 |
| 1939. | M.V. Goutham, Ponnuru | GTR | 01/2007to12/2016 |
| 1940. | D.Ramachandra Rao, Mangalagiri | GTR | 06/2007to05/2017 |
| 1941. | K.Suryaprakash, Srikalahasti | CHTR | 08/2007to07/2017 |
| 1942. | N.Vijaya Laxmi, Adilabad | ADB | 08/2007to07/2017 |
| 1943. | V.Srinivasa Rao, Khammam | KHM | 07/2007to06/2017 |
| 1944. | T. Sheshaiah, Khammam | KHM | 07/2007to06/2017 |
| 1945. | CH.Pullaiah, Nelakondapalli | KHM | 07/2007to06/2017 |
| 1946. | U S.Prakasa Rao, Aswaraopeta | KHM | 04/2007to03/2017 |
| 1947. | P.S.S. Prakasa Rao, Aswaraopeta | KHM | 04/2007to03/2017 |
| 1948. | D.Ramachandra Rao, Mangalagiri | KHM | 01/2007to12/2016 |
| 1949. | V. Nagapadma, Kalluru, | KHM | 01/2007to12/2016 |
| 1950. | Ch. Narasimha Rao, Kalluru, | KHM | 01/2007to12/2016 |
| 1951. | I. Brahamaiah, Mittapalli | KHM | 01/2007to12/2016 |
| 1952. | A.Naga kusuma Kumari, Isukapalli | GTR | 07/2007to06/2017 |
| 1953. | P. Raghunandhana, Kukatpalli | R.R. | 08/2007to07/2017 |
| 1954. | P. Satyanarayana Reddy, Panadalapaka | EG | 08/2007to07/2017 |
| 1955. | K.Ranaga Rao, Vissakoderu (po) | WG | 08/2007to07/2017 |
| 1956. | K.Venkata Rao, Bhimavaram | WG | 08/2007to07/2017 |
| 1957. | K.B.Bhaskar Rao, Pentapadu | WG | 07/2007to06/2017 |
| 1958. | K.Arunamma, Kukatpally | HYD. | 08/2007to07/2017 |
| 1959. | Sk. Khaja Rahamthulla, Veligandal | PRK | 08/2007to07/2017 |
| 1960. | V. Balamani, Ghatkesar, | R.R. | 07/2007to06/2017 |
| 1961. | Arigalla Venkateswarlu, Attili | WG | 09/2007to08/2017 |
| 1962. | K.V. Subba Rao, Attili, | WG | 09/2006to08/2016 |
| 1963. | N.S.D.P. Chandur Babu, B.Kothapadu | WG | 09/2006to08/2016 |
| 1964. | K.Swarnalatha, Kothapeta | WG | 12/2006to11/2016 |
| 1965. | K.Brahamaiah, Mogalthur | WG | 12/2006to11/2016 |
| 1966. | Banu Rama Krishna, Nidadavolu | WG | 08/2006to07/2016 |
| 1967. | P.Jayakar, Nidadavolu, | WG | 06/2006to05/2016 |
| 1968. | V.Venkatewara Rao, Nidadavolu | WG | 06/2006to05/2016 |
| 1969. | S.V.Brhamam, Nellipaka, | KHM | 08/2007to07/2017 |
| 1970. | Ch.A.Sailaja, HM, Mallelamadugu | KHM | 08/2007to07/2017 |
| 1971. | Ch.Rajeswari, Khammam | KHM | 08/2007to07/2017 |
| 1972. | B.Venu, Jullurupadu | KHM | 08/2007to07/2017 |
| 1973. | N.Laxmana Rao, Jullurupadu | KHM | 08/2007to07/2017 |
| 1974. | M.Appala Naidu, Itakarlapalli | KHM | 08/2007to07/2017 |
| 1975. | A.Laxmi Nayudu, Ragolu | VZM | 08/2007to07/2017 |
| 1976. | P.Vijayalaxmi, Meerpeta | R.R. | 08/2007to07/2017 |
| 1977. | Y.Ailayya, Kanchanapalli | NLG | 08/2007to07/2017 |
| 1978. | I.Prasada Rao, Prathipadu, | EG | 08/2007to07/2017 |
| 1979. | T.Chitti Babu, Gudimellanka | EG | 08/2007to07/2017 |
| 1980. | J.Jagadeeswara Rao, Mangalagiri | GTR | 08/2007to07/2017 |
| 1981. | M.Koti Reddy, Mangalagiri | GTR | 08/2007to07/2017 |
| 1982. | K.Saida Naik, Mangalagir | GTR | 08/2007to07/2017 |
| 1983. | D.China Anka Rao, MEO Mangalagiri | GTR | 08/2007to07/2017 |
| 1984. | V.Yedukondalu, Mangalagiri | GTR | 08/2007to07/2017 |
| 1985. | N.Chandrasekar Reddy,chilamathuru | ATP | 08/2007to07/2017 |
| 1986. | P.Yesuratnam, P.Gangavaram | EG | 08/2007to07/2017 |
| 1987. | K.Giri Kumar, Y.V.Palem | EG | 08/2007to07/2017 |
| 1988. | P.Chendra Rao, Innalavari Palem | EG | 08/2007to07/2017 |
| 1989. | B.Arunakumari, P.Gannavaram | EG | 08/2007to07/2017 |
| 1990. | B.Satyanarayana, Gangalakurru | EG | 08/2007to07/2017 |
| 1991. | Y.Malleswara Rao, Pithapuram | EG | 08/2007to07/2017 |
| 1992. | P.Satya Prasad, Rajahmundry | EG | 06/2007to05/2017 |
| 1993. | P.Raghava Rao, Rajahmundry | EG | 06/2007to05/2017 |
| 1994. | Thrimurthulu, Sankavaram | EG | 08/2007to07/2017 |
| 1995. | R.P.DevaVani, Velampeta | EG | 08/2007to07/2017 |
| 1996. | B.Seshu Prabha, Seethanagaram | EG | 08/2007to07/2017 |
| 1997. | S.Swarnalatha, Seethanagaram | EG | 08/2007to07/2017 |
| 1998. | G.Sujatha, Seethanagaram | EG | 08/2007to07/2017 |
| 1999. | Ch.Padmavathi, Rajahmundry | EG | 08/2007to07/2017 |
| 2000. | A.Ramadevi, Rajaymundry | EG | 08/2007to07/2017 |



**1500 భాషాపండితులు, 500 వ్యాయామ ఉపాధ్యాయుల పోస్టులు స్కూల్ అసిస్టెంట్స్‌గా అప్‌గ్రేడ్ చేస్తూ ఆర్థిక శాఖ ఉత్తర్వులు**

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

School Education Department – Upgradation of 1500 Language Pandit Posts to that of School Assistant (Languages) and another 500 PET posts as Physical Education in Success Schools in the State – Orders – Issued.

**FINANCE (SMPC) DEPARTMENT**

**G.O.Ms.No.80** **Dated:02.03.2009.**

**Read the following:-**

1. From the Director of School Education, A.P., Hyderabad, Lr.Rc.No.337/ UC-2/2008, Dt.03.02.2009 and 17.02.2009.
2. Education (SE.TRG) Department, U.O.N. 2244/Trg/A3/2009, Dated: 27.02.2009.

***

**ORDER:**

The School Education Department have stated that issued orders vide G.O.Ms.No.76, Education (SE.Trg) Department, Dt.10.06.2008 upgrading 6500 High Schools under the programme of SUCCESS Schools with parallel English medium sections from 6th class onwards with CBSE syllabus with an aim to strengthen such SUCCESS Schools. Director of School Education has submitted that the following number of Language Pandits Gr.II and PETs are working in SUCCESS Schools in the State.

| | |
|---|---|
| a. Language Pandits Gr – II Telugu | 4444 |
| b. Language Pandits Gr – II Hindi | 3825 |
| c. Language Pandits Gr – II Urdu | 205 |
| d. PETs | 4288 |
| Total | 12762 |

All the above posts are in the pay scale of Rs. 5,470/- to Rs. 12,385/-

2. In the reference 1st read above, the Director of School Education, Hyderabad has requested to sanction 1000 School Assistant posts (Telugu), 400 posts of School Assistants (Hindi), 100 posts of School Assistants (Urdu) and 500 posts of School Assistants (Physical Education) in the SUCCESS Schools, where the enrolment of students is high. He has submitted that the pay scale of School Assistants is Rs. 7,200/- to Rs. 16,195/-.

3. The Director of School Education, A.P. Hyderabad has submitted that the financial commitment to give promotions to Language Pandits (1500) who have completed 8 years / 16 years / 24 years is Rs. 82,37,736/-. The financial commitment for giving promotions to PETs who have completed 8 years / 16 years / 24 years is Rs. 24,43,344/-.

4. The Director of School Education, A.P., Hyderabad has further reported that an amount of Rs.1.06 Crores is going to be the additional financial burden and he also worked out the number of surplus vacant SGT posts required to be suppressed so as to offset the additional financial burden. He has proposed that 102 SGTs surplus vacant posts are to be suppressed in order to upgrade 1500 Language Pandit posts to the posts of School Assistant (Languages) and another 500 PET posts as School Assistants (Physical Education) in Success Schools.

5. Government after careful examination of the proposal hereby accord sanction for upgradation of 1500 Language Pandit posts as School Assistant (Languages) and another 500 PET posts as School Assistant (Physical Education) in Success Schools in the State by suppressing 102 Secondary Grade Teacher posts.

6. The School Education Department shall take further necessary action accordingly.

7. Copy of this order is available on Internet and can be accessed at address "http://www.ap.gov.in/goir".

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A. P.)**

**Dr. N. RAMESH KUMAR**
**PRINCIPAL SECRETARY TO GOVERNMENT (R&E)**

***

**మున్సిపల్ ఉద్యోగులు, ఉపాధ్యాయులకు 010 హెడ్ ద్వారా జీతాలు మరియు పెన్షను**

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

Municipal Administration & Urban Development Department - Request of A.P. Municipal Employees & Workers JCA&U for payment of salaries and pension to the Municipal employees through treasures under 010 Salaries Head of Account- Orders issued.

**MUNICIPAL ADMINISTRATION AND URBAN DEVELOPMENT (G1) DEPARTMENT**

**G.O. Ms. No. 179** **Dated: 25-2-2009**

**Read the following: -**

1. Agreement between the Govt. and representatives of JCA&U on 22.5.07.
2. Govt. Memo.No.2748/G1/2007-6,dt.17.8.07.
3. From the CDMA Lr. No. From the CDMA Lr.No.18614/ 2008-J2, dated 18-9-2008, an 16-10-2008.

***

**ORDER:-**

In the reference 1st read above, an agreement has been made by the Government and representatives of JCA&U, to constitute a committee to study the issues relating to payment of salaries/pensions/provincialisation of Municipal employees. Accordingly a committee has been constituted vide reference 2nd read above and the committee after studying the situation in 5 states i.e., Karnataka, Rajastan, West Bengal, Tamilnadu and Kerala has submitted its report.

2. Government examined the report in consultation with Commissioner and Director of Municipal Administration has decided to make payment of salaries and pensions of Municipal employees including municipal teachers through Treasures under "010-Salaries" w.e.f 01.04.2009 in all the municipalities and Municipal corporations except Greater Hyderabad Municipal Corporation, Greater Visakhapatnam Municipal Corporation and Vijayawada Municipal Corporation.

3. Government after careful examination hereby order that the payment of Salaries and pensions to the municipal employees including municipal teachers in all the Municipalities and Municipal corporations except Greater Hyderabad Municipal corporation, Greater Visakhapatnam Municipal Corporation and Vijayawada Municipal Corporation, shall be made under detailed Head of Account "010-Salaries" through Treasures with effect from 01.04.2009 in lieu of statutory and non–statutory grants to be released to these urban local bodies.

4. Necessary amendments to the A.P. Municipalities Act, A.P. Tax on Professions Act and A.P. Stamps and Registration Act and also clarifications/ instructions on foregoing statutory and non-statutory grants will be issued separately.

5. The operational guidelines for payment of salaries to the Municipal employees including municipal teachers in all the Municipalities and Municipal Corporations except Greater

Hyderabad Municipal Corporation, Greater Visakhapatnam Municipal Corporation and Vijayawada Municipal Corporation, under detailed Head of Account "010-Saalaries" through Treasuries with effect from 01-04-2009 will be issued separately.

6. The Commissioner and Director of Municipal Administration shall take further necessary action in the matter.

7. This order issues with the concurrence of Principal Secretary, Finance vide their No. 695/PFS/09, dated 25/2/2009.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A. P.)

**Dr. C.V.S.K. SARMA**

**PRINCIPAL SECRETARY TO GOVERNMENT**

***

## 1030 మంది పార్ట్‌టైం వృత్తి విద్యా బోధకుల రెగ్యులరైజేషన్ ఉత్తర్వులు

## GOVERNMENT OF ANDHRA PRADESH

### ABSTRACT

Vocational Education - Regularization of 1030 Part- Time Vocational Instructors working under the control of School Education Department - Orders – Issued.

**SCHOOL EDUCATION (PROG.I) DEPARTMENT**

**G.O.Ms.No. 31** **Dated: 13.02.2009**

**Read the following: -**

1. G.O.Ms.No.366, School Education ( F2 ) dt. 14.07.1984.
2. G.O.Ms.No.162, Finance (SMPC) Dept, dt. 22.06.2006.
3. From Sri R. Narasimha Reddy, President, and Sri P.Srinivas, General Secretary, School Education Vocational Instructors Association, Andhra Pradesh, Hyderabad, representation, dated 15.10.2007.
4. From the Director of School Education, A.P., Hyderabad, Letter Rc.No.466/VE-1/2006,dt. 17.10.2007.
5. G.O.Rt.No.505, S.E. (Prog.I) Dept., dated 17.07.2008.
6. G.O.Ms.No.473, Finance (SMPC) Department, dt. 05.12.2008.

* * *

**ORDER:**

In the G.O. 1st read above, Government have introduced a Scheme of Vocational Education during the year 1984-85 and 1985-86 in 345 schools based on the recommendation of the V.R.Reddy Committee report with a view to make the pupils learning in the schools are not only eligible for higher education but to equip themselves with the Vocational skills required for gainful employment. At present, the scheme is being implemented in 297 High Schools and in 48 Mandal Vocational Educational Centers in the State. 1030 Part-Time Vocational Instructors are being engaged in Government, Aided and Local Body High Schools to impart Vocational Education, and they are being paid an amount of Rs.3,500/- per month as honorarium.

2. In the reference 3rd read above, the Vocational Instructors Association of School Education Department, A.P., Hyderabad has represented to the Government, to regularize the services of Part-Time Vocational Instructors, who are working for the last 23 years.

3. In the reference 4th read above, the Director of School Education, Hyderabad has submitted a proposal to the Government for regularization of services of 1030 Part-Time Vocational Instructors who possessed the qualification prescribed by Government at the time of recruitment and who were recruited by the District Selection Committee duly suppressing the same number of vacant Craft Teachers posts which are available in the Department.

4. The Government in the reference 6th read above, have continued the permanent/temporary/supernumerary posts including 1283 Craft Teachers posts for a further period upto 28.02.2009 in School Education Department.

5. Government after careful examination of the proposal, decided to regularize the services of Part-Time Vocational Instructors in the existing Craft Teachers vacancies and accordingly, hereby regularize the services of 1030 Part-Time Vocational Instructors who were re-engaged in the Schools in the State in June, 2008 for the academic year 2008-2009 as per the orders issued in the reference 5th read above, in the scale of pay of Rs.5470-12385 by suppressing 1030 vacant Craft Teacher posts, with effect from the date of issue of the orders. The Pay and allowances shall be debited to the relevant Head of Account under various Managements, as per rules in force.

6. The Director of School Education, A.P., Hyderabad shall take necessary action accordingly.

7. This order issues with the concurrence of Finance Department, vide their U.O.No.4954/84/A1/PC.III/2009, dated 13.02.2009.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A. P.)

**K.R. KISHORE,**

**PRINCIPAL SECRETARY TO GOVERNMENT**

***

## ఎస్‌సి, ఎస్‌టి, బిసి ప్రాంతాలు మరియు మారుమూల ప్రాంతాలలోని ఎయిడెడ్ పాఠశాలలకు ఆర్థిక సహాయం

## GOVERNMENT OF ANDHRA PRADESH

### ABSTRACT

School Education - Aided Schools – Sanction of financial assistance to the schools based on the student strength to the Aided Schools run in the SC/ST/BC localities in the remote villages - Orders – Issued.

**EDUCATION (SE - PS.II) DEPARTMENT**

**G.O.Ms.No. 37** **Dated 27.02.2009**

**Read the following:-**

1. From Director of School Education, Hyderabad Lr Rc. No. 1434/B3-4/2008, dt. 6.01.2009
2. From Director of School Education, Hyderabad Lr Rc. No. 1434/B3-4/2008, dt. 25.02.2009.

***

**ORDER:-**

It has been brought to the notice of Government that most of the Aided Schools run in the SC/ST/BC localities in the remote villages could not run the schools though they have invested substantial amounts towards construction of pucca Buildings and enjoying grant in aid. Due to imposition of ban on creation and filling up aided posts vide Government Memo. No. 12080/COSE/2004-4, dt.20.10.2004 the aided vacancies fallen vacant in these schools could not be filled up and grant–in-aid for these vacancies were not released to them. Consequently, the managements couldnot impart quality education to the SC/ST/BC students studying in these schools and these institutions are not in a position to engage qualified teachers and pay them salaries from their meager funds and requested the Government to provide some financial assistance to these schools.

2. Government have examined the matter and considered that the endeavor of the Government is to provide access to education to the children up to the age of 14 years free of cost through Government run institutions and to extend a helping hand to those institutions which are really facing financial crunch and which are likely to be closed, as they are unable to take up the burden of paying salaries to the teachers from their own. It is felt necessary to extend financial benefit taking into consideration the strength of the students in those institutions. Further the financial assistance is to be extended to such of those institutions, which have got pucca buildings and have been running over a long period and have got substantial strength of students on their rolls earlier. As sufficient infrastructural facilities are available in the institutions and the students are continuing to study in these institutions by choice, it is considered worthwhile to give some financial assistance.

